హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

67

Also available on net:
www.haasam.com



ముఖచిత్రం
అంకిత
స్పెషల్ ఫోటో

## హాస్యం











## సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల ప్రత్యేకం

పాత పాటల ప్రత్యేకం 71, 72, 73 పేజీల్లో






'హాసం' పత్రికలో ముఖ్యంగా నా అభిమాననటి జమున ప్రారంభించిన "నేను నా పాటలు", ఇంద్రగంటి జానకీబాలగారు వ్రాసిన "కొమ్మా కొమ్మా కోకిలమ్మా" ప్రచురించినందుకు నా నమస్సులు. శ్రీ చిత్తూరి వి.నాగయ్య గారి "పావనగుణరామా", "నన్ను విడచి కదలకురా", సర్వమంగళ నామా సీతారామా", "ఇదిగిదిగో గగన సీమా" సాహిత్యపరంగా ముద్రించగలరని నా ప్రార్థన. "రాంపండు లీలలు" మరల ప్రారంభించగలరని ప్రార్థన. **- తుర్లపాటి విజయలక్ష్మి, హైదరాబాదు.**

'హాసం' పత్రికలో ప్రచురించిన చైత్ర గురించిన వ్యాసం బాగుంది. ఇంత చిన్న వయసులోనే చైత్ర చాలా బాగా పాడింది. ఆమె భవిష్యత్తులో ఇంకా గొప్ప గాయని కావాలని కోరుకుంటూ, ఇలా ఎప్పటికప్పుడూ కొత్త విషయాలను అందజేస్తున్న హాసం పత్రికకు నా కృతజ్ఞతలు. **-ఎ. శశికిరణ్, రాగంపేట.**

యస్.పి.బాలసుబ్రహ్మణ్యంగారి పుట్టిన రోజైన 4-6-04 నాడు మేము "పసిడిపాటల వెండి వెన్నెల" అనే సినీసంగీతకార్యక్రమ ధారావాహికను ప్రారంభించాం. ప్రతినెల జరిగే ఈ కార్యక్రమంలో నూతనగాయకుల చేత మధుర గీతాలు పాడిస్తున్నాం. ఆయా నెలల్లో విలసిల్లిన సినీరంగ సంగీత సాహిత్య కోవిదులను ఈ వేదిక మీద స్మరించుకునే అంశాన్ని రూపొందించాము. అలాగే ఈ జూన్ నెలలో 9 మంది ప్రముఖుల కృషిని స్మరించుకొని అభినందనలు ప్రకటించాము. ఇంతమంది గురించిన సమాచారం మాకు 'హాసం' వల్లనే తెలిసిందని చెప్పడానికి ఎంతో ఆనందిస్తున్నాను. అందుకు మీకు, పత్రికా సిబ్బందికి నా ధన్యవాదాలు తెలుపుతున్నాను.

**- డా॥ఎం.పురుషోత్తమాచార్య,నల్గొండ.**

అర్థంచేసుకుందాం ఆస్వాదిద్దాంలో "అనార్కలి" పాటలో మిల్‌నా అంటే విరియటం అని రాశారు. అది"ఖిల్‌నా"!.

**-కె.రామారావు, హైదరాబాదు.**

'హాసం' నా ప్రాణం. ఎన్నో మధుర స్మృతులను తట్టి లేపుతుంది. "బావామరదళ్లు" (పాతది) పాటలు, వివరాలు తెలియజేయండి. మే 16-31,2004 సంచికలో రామారావుగారి శివుని ఫొటో అద్భుతం.

**- ఝాన్సీరాణి,వైజాగ్.**

నేను-నా పాటలు ద్వారా జమున గారి విశేషాల ద్వారా ఆమె ప్రతిభ తెలుస్తోంది. ఆమె పాటల సెలక్షను బాగుంది. శ్రీచందాల కేశవదాసు గురించి డా॥ఎం.పురుషోత్తమాచార్యగారు తెలియజేసిన వివరాలు పదికాలాల పాటు గుర్తు వుంటాయి. 'హాసం' ద్వారా ఆడియో బుక్స్ వుంటాయని తెలిసింది. "వినుడు వినుడు కలాం గాథ" ఎక్కడైనా వినాలని వుంది. డూలిటిల్ తరువాత తెలుగులో కూడ జంతువుల చేత మాట్లాడించి తీసిన చలనచిత్రం వుంది. దాన్ని గురించి కూడ ప్రచురించండి.

**- ఉప్పాల మోహనబాబు,అవనిగడ్డ.**

హిందీ సినిమా పాటల్లో పంఛీకి గల ప్రత్యేక స్థానం గురించి రాసిన ఆర్టికల్ ఎంతో బాగుంది. సైగల్‌తో ప్రారంభమై (ఈ పాట నాకు తెలియదు) నిన్న,మొన్న 'మైనే ప్యార్ కియా'లో పాట వరకూ గుర్తు తెచ్చి తీయని మధుర లోహాలోకి తీసుకెళ్ళారు (జా...జా.... కబూతర్ జా అనే పాట గురించి రాయడం మరచి పోయారా?) సినిమాల్లో ఒక్కసారి కనిపించి మాయమయినా పాటల ద్వారా, హృదయాలలో,శాశ్వతంగా నిలిచి పోయే పాత్ర పక్షులదే నని చెప్పవచ్చు. పక్షిని పాటల ద్వారా ప్రవేశపెట్టే మొదటి ఆలోచన ఎవరిదో కానీ, వారికి నా హృదయాంజలి. రాబోయే ఇలాటి మంచివ్యాసాల కోసం ఎదురు చూస్తూ... **-ఎ. అన్నపూర్ణ,హైదరాబాదు.**

'హాసం' రూపురేఖలు దిద్దుకోవడంలో అమూల్యసేవలందిస్తున్న సాహితీ కృషీ వలులందరికీ నమః సుమాంజలి. 'హాసం' మొదటిసంచిక నుండి నేటి వరకు అన్నింటిని భద్రపరచుకుంటున్నాను. తొలి సినిమాపాట సృష్టికర్త కీ.శే. శ్రీ చందాల కేశవదాసుగారి జయంతిని పురస్కరించుకొని అందించినందుకు కళాభివందనాలు.**- కేమాచెంచయ్య,పమిడిపాడు.**

మేము రాసిన జోకులకు మీరు పంపిన పెదబాబు సి.డి. అందినది. కృతజ్ఞతలు. కళాభారతి జమునగారి నేనూ-నా పాటలు సీరియల్‌గా అందిస్తున్న 'హాసం' కు అభినందనలు.ముందు ముందు మరిన్ని మంచి మధుర గీతాలు అందిస్తారని ఎదురు చూస్తుంటాము.

**-గంటి యామినీ సాగర్, వనపర్తి**

'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ' శ్రీమతి ఇంద్రగంటి జానకీ బాలగారు సూర్యకుమారి గురించి ఎన్నో విషయాలు తెలిపారు. వారికి కృతజ్ఞతలు. ఆకాశవాణిలో గతంలో సూర్యకుమారి లలిత సంగీతం రికార్డులు శ్రోతలను ఎంతగానో అలరించేవి!

**- కాకుటూరు సుజాతనాగరాజరావు, కావలి.**

16-31 జూన్ 'హాసం' పత్రికలో శ్రీ చందాల కేశవదాసుగారి గురించి వ్యాసం చదివాను. అలనాటి చిత్రాలు శ్రీకృష్ణతులాభారం లోని 'బలే మంచి చౌక బేరము', 'సతీసక్కుబాయి'లోని 'గజ్జెలందియలు ఘల్లుఘల్లు మన' పాటల సాహిత్య సొగసులను, సంగీత మాధుర్యాన్ని ఆస్వాదించడమే గాని,వాటి రచయిత ఎవరో తెలియని శ్రోతలకు,ముఖ్యంగా యువ శ్రోతలకు (పాఠకులకు) తెలియని రోజుల్లో ఆ వైనాన్ని తెలియపరచిన 'హాసం' పత్రికకు కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను.

**-గంధం నరసయ్య, మునగాల,నల్లగొండ.**

'హాసం' సంచికలో ఎడిటోరియల్ ఆలోచింపచేసింది. కళాకారుడు ఎల్లప్పుడూ ఉత్తమమైన కళను సృష్టించడానికి తపిస్తాడు. ఈ పద్ధతిలో అతడు ఎంతో ఒత్తిడిని,అశాంతిని ఎదుర్కొంటాడు. ఇలా ఉత్పన్నమైన కళ పాఠకులకు గానీ,శ్రోతలకు కానీ, ప్రేక్షకులకు గాన అలరించవచ్చు లేదా అలరించకపోవచ్చు. వారి చప్పట్లు,ప్రశంసలే కళాకారుడికి కొండంత ఆనందాన్ని ఇస్తాయి. తన కళ వారి ఆదరణను నోచుకోనపుడు మాత్రం ఎంతో కృంగి పోతాడు. సంపాదకీయంలో అన్నట్లు శ్రీ శ్రీ వ్రాసిన ప్రతి కవితా "మహాప్రస్థానం"కాలేదు. రాజేశ్వరరావు గారి 'మల్లీశ్వరి' లాగ ప్రతి సినిమా కాకపోవచ్చు కానీ వారు ఎల్లప్పుడు ఉత్తమమైన కళ కోసం తపించి ఉంటారు. కాబటి కళాకారుల నుండి మనం అన్ని రకాల కళా ప్రసాదాన్ని స్వీకరించగలగాలి. **-కె. క్రిష్ణమూర్తి,నిజామాబాదు.**

చందాల కేశవదాసు వ్యాసంద్వారా పాత పాటలను సేకరించుకొనే అవకాశం మాకు లభించింది. కాని వారి నిర్యాణము విషయంలో అచ్చుతప్పు పడినట్లున్నది. 14-06-1956 నాడు విజయనామ సంవత్సరం కాదు దుర్ముఖి నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ షష్ఠీ గురువారం. ఒకవేళ విజయనామ సంవత్సరమే నిజమైతే 14-06-1954 తేది అవుతుంది.

**- ఏ.అశోక్‌కుమార్ రావు,గుర్రంపోడ్.**

హ్యూమర్ బాక్స్ శీర్షికలో పడిన నా జోక్‌కి బహుమతిగా మీరు పంపిన 'పెదబాబు' ఆడియో సి.డి. నాకు అందినది. బహుమతిని ఇంత తొందరగా అదీ పత్రికతో పాటు పంపినందుకు ఎంతో సంతోషం.

**-బొలెమ్ సత్యనారాయణ,చినఓగిరాల**

నేను సింగీతం శ్రీనివాసరావు అభిమానిని. ఆయనవి చాలా సినిమాలు చూసాము. కానీ వారిలో అంతర్లీనంగా ఓ రచయిత దాగివున్నారని మాకు తెలియదు. కానీ హాసం పుణ్యమా అని ఆ విషయం తెలిసింది.

**-బి. విజయ్‌కుమార్,కొత్తవెంకోజిపాలెం.**

గోపాలకృష్ణ కార్టూన్‌లు తెగ నవ్విస్తున్నాయి. మా కెంతో ఇష్టమైన పాట 'పగలే వెన్నెల' పాటను మొత్తం గా ఇవ్వడం మాకెంతో నచ్చింది.

**-వరయోగిరామ్‌మోహనరావు,సత్యాఅల్వాల్**

'హాసం' వెలువడిన కొత్తలో- మాలాంటి హాస్య-సంగీత ప్రియులందరినీ ఒక చోట చేర్చేలా 'హాసం' వాళ్ళు ఏదైనా వర్క్‌షాప్ గానీ,సెమినార్ గానీ నిర్వహిస్తే బాగుంటుంది కదా అనుకునే వాడిని. యిప్పుడు 'హాసం క్లబ్'లు చేస్తున్న పని అదే!

**- కోనే నాగవెంకట ఆంజనేయులు, ఉక్కునగరం.**

సంపుటి: 3 సంచిక:19

1-15 జులై 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

67

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి

చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

ఎమర్జన్సీ విధించి 29 సంవత్సరాలు పూర్తయ్యాయి. ఈ పక్షంతో 30 వ సంవత్సరంలో అడుగుపెడుతున్నాం. 1975 జూన్ 26 నుండి రమారమి 18 నెలలపాటు సాగిన ఎమర్జన్సీరోజులు స్వతంత్ర భారతచరిత్రలో ఓ చీకటి అధ్యాయం. ఎమర్జన్సీకాలంనాటి ప్రభుత్వం తమ మాట వినని స్నేహలతారెడ్డి వంటి నటీమణులపై కక్ష సాధించి చావుకు గురిచేసింది.

గాయకుడు కిశోర్‌కుమార్ కథ మరొకలా నడిచింది. అధికారపార్టీ ఏర్పాటు చేసిన ఓ సభలో పాడమని సమాచార శాఖామంత్రి ఒత్తిడి తెచ్చినా కిశోర్ కుమార్ సమ్మతించలేదు. అహం దెబ్బతిన్న ఆ మంత్రి గారు ఆలిండియా రేడియోలో కిశోర్ పాటలను బహిష్కరించారు. మూడు దశాబ్దాల క్రితం టీవీలు, క్యాసెట్‌లు ఇంతగా లేని రోజుల్లో కళాకారులకు, శ్రోతలకు అనుసంధానం కలిగించేది రేడియో మాత్రమే! ఆ మాధ్యమాన్ని దూరం చేసుకోవడం ఓ గాయకుడికి ఆత్మహత్యాసదృశమే!

రెండుదశాబ్దాల అవిరళకృషి తర్వాత కిశోర్‌కు గాయకుడిగా బ్రహ్మాండమైన గుర్తింపు ఇచ్చింది - 'ఆరాధనా'! అది విడుదలయి 6 యేళ్లు తిరక్కుండానే ఈ ఉపద్రవం వచ్చిపడింది. ఎమర్జన్సీ ఎంతకాలం ఉంటుందో అప్పుడెవరికీ తెలియదు. రేడియో ద్వారా ప్రజలను చేరలేని గాయకుడికి నిర్మాతలు అవకాశాలు ఇవ్వకపోవచ్చని తెలిసినా కళాకారుడిగా తన స్వేచ్ఛను వదులుకోవడానికి కిశోర్ సిద్ధపడలేదు. సినిమావారు పిలవకపోతే స్టేజిషోలు చేసుకుని బతుకుదామనుకున్నాడేమో! అతని కా ధీమా కలిగించినది గాయకుడిగా అతనికి లభించిన ప్రజాదరణ! స్టేజిషోల ద్వారా ప్రజలతో అతను నేరుగా నెలకొల్పుకున్న బంధం! ప్రభుత్వం అనాదరించినా, ఆంక్షలు విధించినా ప్రజలు తన వెంట ఉన్నారన్న నమ్మకమే అతన్ని ధైర్యంగా నిలబెట్టింది.

ఈనాటి కళాకారులతో ఇంటర్వ్యూలు చూసినప్పుడు గానీ చదివినప్పుడు గానీ ఒక విషయం స్పష్టమవుతుంది - వ్యక్తిగతంగా చక్కటి అభిరుచి కల వీరు అశ్లీల సాహిత్యంతోనో, హోరెత్తించే సంగీతంతోనో ప్రజలను ఊదరగొడదామని రాకపోయినా తమ సంతృప్తి మేరకు పనిచేయగలిగేవారు వీరిలో కొందరే! దీనికి కారణం, ప్రజలు దేనిని ఆదరిస్తారన్నదానిపై నిర్మాత, దర్శకులు ఏర్పరచుకున్న అభిప్రాయాలతో విభేదించడానికి సాహసించలేకపోవడం. తమ ఆలోచనలకు ప్రజామోదం లభిస్తుందన్న గట్టినమ్మకం వీరి కుంటేనే అది సాధ్యపడుతుంది.

ఆనాటి కిశోర్ అనుభవాలతో పోల్చి చూస్తే, ఈనాటి పరిస్థితి భిన్నంగా ఉంది. ప్రభుత్వపరంగా కళాకారులపై ఆంక్షలు లేవు. పైగా అశ్లీల సాహిత్యాన్ని, అసభ్యసంగీతాన్ని నియంత్రిద్దామనే ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. పాలకుల మద్దతు ఉన్నా ప్రజలు తమ పక్షాన ఉన్నారో లేదో రూఢి అయితేగానీ ఈ కళాకారులు తమ అభిరుచులను ఆచరణలో తెచ్చేందుకు సాహసించలేరు.

ప్లెబిసైట్‌లు, ఎగ్జిట్ పోల్స్ లేని ఈ రంగంలో శ్రోతలకు ఏం నచ్చుతుందో తెలుసుకోవడం కష్టం. హిట్ అయిన పాటలో తారల వాటా తీసేస్తే కానీ దాని అసలు విలువ తెలియదు. అందువల్ల సినిమాయేతర సంగీతాన్ని (అంటే భక్తిసంగీతం, పాప్ సంగీతం మాత్రమే కాదు, ప్రేమగీతాలు సైతం అందించవచ్చు) కూర్చిన కళాకారులు స్టేజీషోల ద్వారా నేరుగా శ్రోతలకు చేర్చగలిగితే వారి అభిరుచుల గురించి సరైన అంచనా ఏర్పడుతుంది. క్రమంగా వారిని తమ దారికి తీసుకురావడం సాధ్యపడుతుంది.

ఈ పద్ధతి కళారంగంలో ఏ విభాగం వారికైనా అనుసరణీయమే! కానీ అందరికంటె ఎక్కువ అనువుగా ఉండేది సంగీతకళాకారులకే!





ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## కరాజు కథలు 16

# అత్తరు శిక్ష

రోజా రాజ్యంలో ఎన్నో సమస్యలు ఎదురౌతూంటాయ్. వాటికన్నిటికీ మంత్రిగారు తగురీతిన పరిష్కార మార్గాన్ని ఆలోచించి ఆజ్ఞలను జారీ చేస్తూంటారు. ఇవి ఫలించి నప్పుడెల్లా తృప్తితో ఆనందిస్తారు. కానీ ఈసారి మాత్రం కాస్త భిన్నంగా జరిగింది. ఆజ్ఞలకు పూర్తి న్యాయం జరిగిందనడంలో ఎటువంటి సందేహమూ లేదు. పైగా అనుకున్న దానికంటే ఎక్కువే ఫలితం లభించింది. కాకపోతే ఇలా జరగడమే ఈసారి మంత్రిగారిని ఆనందపరిచే బదులు చికాకు పరిచింది.

కొన్నాళ్ళ క్రితం ప్రభుత్వ కార్యాలయాల్లో కొన్ని అవకతవకలు జరుగుతున్నాయని మంత్రి దృష్టికి వచ్చింది. కాస్త అనుమానం వచ్చినా మంత్రి సహించడు. వెంటనే ప్రథమ న్యాయాధీశులైన అభయానందమూర్తి గారిని పిలిపించి ఎక్కడెక్కడ లోపాలున్నాయో పరిశీలించ వలసిందిగా కోరారు. కాని న్యాయాధీశులు ఆరా తీసే కొద్దీ బావి తవ్వితే భూతం వచ్చినట్టు ఒక చేదు నిజం బయటపడింది.

పెద్దమనుష్యులుగా, నగరంలోని ముఖ్యులుగా చలామణీ అవుతున్న చాలామంది తమ అధికారాలను దుర్వినియోగం చేసి విశేషమైన డబ్బును ఆర్జించినట్టు ఋజువైంది. రాజ్యంలో ఈ వార్త దావానలంలా ప్రాకింది. ఎక్కడ చూసిన జనం దీన్ని గురించి మాట్లాడుకోవడమే. పెద్దల నిజస్వరూపాలను నడివీధిలోకి లాగిన వీరునిగా మంత్రిని పేర్కొన్నారు. అతని మీది గౌరవం అందరిలో పదిరెట్లు పెరిగింది.

శిక్ష విధించే రోజు ఎప్పుడూ వస్తుందా అని గుబుల్తో ఎదురు చూస్తున్న నేరస్తులు ఇప్పుడు ఏదో పనిమీద రోజుకో వారానికో ఒకసారైనా బయటకి రాకుండా ఉండలేరు కదా! అలా వచ్చినపుడు అందరూ వెనకనుంచి వాళ్ళను వెక్కిరిస్తున్నారని తెలునం.

ఒకప్పుడు వీళ్ళను జనమంతా దేవతల్లాగ చూసేవారు. ఇప్పుడు చీడ పురుగుల్లా చూస్తున్నారు.

ఇప్పుడు వాళ్ళకున్న ఆశ ఒక్కటే. కొన్నాళ్ళ వరకూ వాళ్ళు ముఖాలకు గుడ్డేసుక్కొని తిరగొచ్చు. ఆ సమయంలో వాళ్ళని ఎవ్వరూ కనిపెట్టలేరు. వెనుక నుంచి వెక్కిరించలేరు. కొంతకాలం అయేసరికి దీని గురించి అందరూ మర్చిపోతారు. అప్పుడు మళ్ళీ యదేచ్ఛగా మునుపటిలాగే తిరగొచ్చు.

ప్రధాన న్యాయాధీశులను నియమించి లంచగొండీలను ఎలా పట్టుకున్నదీ కరాజుగారికి



తెలియజేస్తే తనను చాలా మెచ్చుకుంటారనే ధీమాతో మంత్రి రాజభవనానికి వెళ్ళి కరాజు గారికి మొత్తం వివరాలు అందజేశాడు. మహారాజుగారు ఏమంటారో వినాలనే కుతూహలంతో ఎదురు చూస్తున్న సమయంలో వార్తాహరుడొకడు వచ్చి ఉత్తర భారతదేశం నుంచి మహారాజుగారిని చూడ్డానికి ముఖేశ్వర్ లాల్ అనే వ్యక్తి వచ్చాడని చెప్పాడు. అతన్ని లోపలికి అనుమతించండని మహారాజు గారు చెప్పేసరికి మంత్రిగారి కలలకు అడ్డుపడింది.

ముఖేశ్వర్‌లాల్ వచ్చీరావడంతోనే "శ్రీ కరాజు మహారాజులుం గార్కి సహస్రానేక ప్రణామాలు" అని స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడ్డం చూసి అందరికీ ఆశ్చర్యం వేసింది. ముఖేశ్వర్ తన సంచిలోంచి మూతవున్న ఒక చిన్న బంగారు భరిణెను తీసి 'మహారాజుగారికి వినయ పూర్వకంగా నేనిచ్చుకొను



కానుక' అంటూ కరాజు కిచ్చాడు. కరాజు గారు తీస్కొని దాని మూత తీశాడో లేదో గుప్‌మని ఒక సువాసన అందులోంచి వచ్చి మందిరమంతా నిండిపోయింది. ఏనాడు ఎరుగని ఒక ఆహ్లాదాన్ని అందరూ పొందారు. ముఖేశ్వర్ వివరిస్తూ "మహారాజా! ఇది కొద్ది దశాబ్దాలుగా నేను అభ్యసించి, కృషిచేసి తయారు చేసిన అత్తరు" అన్నాడు. కళాప్రియుడైన కరాజుకు అత్తరులంటే బాగా ఇష్టం. కాని ఇంతటి పరిమళాన్ని వెదజల్లే అత్తరును చూడడం ఇదే మొదటిసారి. "అత్తరు అద్భుతంగా ఉంది. నీ వెవ్వరవు! ఉత్తర భారత దేశం నుంచి వస్తున్నానంటున్నావ్. తెలుగు ఇంత బాగా మాట్లాడ్తున్నావ్ ఇదెలా?" అని ప్రశ్నించాడు కరాజు.

ముఖేశ్వర్ లాల్ తన కథంతా సవిస్తరంగా విన్నవించాడు. ముఖేశ్వర్‌లాల్ అసలు తెలుగువాడే. కృష్ణా జిల్లాలో ఒక చిన్న ఊరు. అసలు పేరు ముక్కు ఈశ్వరయ్య. ముక్కు అనే ఇంటిపేరు రావడానికి కూడా ఒక కథ వుంది. వంశపార్యపరంగా వారికి ఆస్తి పాస్తులు పెద్దగా లేక పోయినా ఆ వంశీయుల్లో చాలామందికి ఒక చిత్రమైన శక్తి వుంది. ఎవ్వరికీ అందని చిన్న వాసనను అయినా వాళ్ళు దూరం నుంచే పసికడ్తారు. అందుకనే వాళ్ళకు ముక్కువారు అనే పేరు స్థిరమైంది. ఈశ్వరయ్యకు ఈ శక్తి మరీ ఎక్కువగా అబ్బింది. ఒక రోజు రాత్రి అతను ఇంటి అరుబైట నులకమంచం మీద కూర్చొనుంటే ఉన్నట్టుండి అతనికి పాము వాసన వచ్చింది. వెంటనే దీపం పట్టుకొనొచ్చి చూస్తే పది గజాల దూరంలో ఒక పాము పడగ విప్పుకొనుంది. కాసేపటికదే వెళ్ళిపోయింది. రేపు వర్షం వస్తుందంటే ఈశ్వరయ్యకు ఈవేళే దాని వాసన తెలుస్తుంది. ఇంట్లో కూర్చునే వాసన బట్టి ఎవరెవరు వీధిలో వెళ్తున్నారో చెప్పగలడు. అతని ప్రజ్ఞకు అందరూ ఆశ్చర్య పోయ్యేవారు. ఇది అతనికి దేవుడు ఇచ్చిన వరం అనేవారు. కాని ఈశ్వరయ్యకు ఈ వరం ఒక శాపంగా మారింది.

తనున్న ఊళ్ళో మురికి కాలువ లెక్కువ. మిగతా వారంతా వాటి పక్కనే ఉన్నా ఏమీ ఎరగనట్టు హాయిగా నిద్రపోయేవారు. కాని ఈశ్వరయ్యకు కాలువలికి ఎంత దూరం వెళ్ళినా ఆ దుర్వాసన నుంచి బయట పడడం అసాధ్యమైంది. అందుకని అవూరు విడిచి వేరే ఊరు వెళ్ళాడు. అక్కడి పరిస్థితి అంతకంటే అధ్వానంగా వుంది. ఇలా ఏవూరికి వెళ్ళినా ఏదో ఒక దుర్వాసన. పగలూ రాత్రీ నిద్రలేదు. అన్నం సహించదు. ఇక తట్టుకోలేక ఈ దేశం వదిలి ఉత్తరదేశం వెళ్ళాడు. అక్కడ కూడా ఇదే పరిస్థితి. బ్రతుకు భారమైంది. కొందరికి ముక్కుమీద కోపం ఉంటుందంటారు. ఇది ఈశ్వరయ్య విషయంలో అక్షరాల నిజం. ప్రతి క్షణం తనకు తన ముక్కుమీదే కోపం. కత్తితో కోసేద్దాం అన్నంత కోపం. ఈ సమయంలో అతనికి దేముడిలా సాక్షాత్కరించాడు అత్తరు బాబా. అత్తరు బాబా ఉత్తరాదిలో ప్రఖ్యాతుడైన అత్తరు వ్యాపారి. అతను ఎన్నో సంవత్సరాలు పరిశోధనలు చేసి అత్తర్లు తయారు చెయ్యడంలో అసమాన ప్రతిభను పొందాడు. ఈ మధ్య అతను చేసిన రకరకాల అత్తర్ల పరిమళాలు పూసుకున్న ఆరు నెలల వరకూ అలాగే ఉంటాయట. అందుకే అక్కడి నవాబులు, వారి కుటుంబసభ్యులకు అత్తరు బాబా దేముడు.

దేశంలో ఎక్కడి కెళ్ళినా దుర్వాసనలతో తట్టుకోలేక సతమతమౌతున్న ముక్కు ఈశ్వరయ్యకు ఒక ప్రాంతం దగ్గరికి వచ్చేసరికి అనూహ్యరీతిలో ఒక సువాసన వచ్చింది. ఆత్మహత్య చేసుకోవాలి అనుకున్నవాడల్లా ఒక్కసారి ఆనందంతో గంతేసి సువాసన వస్తున్న దారిని వెళ్తే అత్తరు బాబా ఆశ్రమం కనుపించింది. అక్కడ అత్తరు బాబాను కలిసి ఈశ్వరయ్య తన బాధల్ని చెప్పుకున్నాడు. ఈశ్వరయ్య అంటే అతరు బాబాకు ఒక ప్రత్యేకమైన వాత్సల్యం ఏర్పడింది.

ముఖ్యంగా ఈశ్వరయ్య లాగ ముక్కులతో సూక్ష్మగ్రహణశక్తి గలవారు నూటికో కోటికో ఒకరు. అలాంటి వారే తనకు శిష్యుడు కాదగ్గవారు. అప్పట్నుంచి ముక్కు ఈశ్వరయ్య అత్తరు బాబా ప్రథమ శిష్యుడై అత్తర్లు తయారు చెయ్యడంలోని క్లిష్టమైన సూత్రాలను క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. ఇప్పుడు తాను నివసిస్తున్న దేశాన్ని అనుసరించి తనపేరును ముక్కు ఈశ్వరయ్య కాకుండా ముఖేశ్వర్‌గా మార్చుకున్నాడు. ఆ తర్వాత అందం కోసం లాల్ చేర్చుకున్నాడు. ఇప్పుడు ఈశ్వరయ్య జీవితం స్వర్గం. ఇరవైనాలుగు గంటలూ సువాసనలే. హాయిగా నిద్రపోతున్నాడు. హాయిగా తింటున్నాడు.

ఇలా కొంతకాలం గడిచే సరికి ఈశ్వరయ్యలో ఒక చిన్న దుఃఖం చోటు చేసుకుంది. ఒక రోజు రాత్రి ఈశ్వరయ్య ఆరుబైట కూర్చొనుంటే ఎందుకో వాళ్ళ ఊరు జ్ఞాపకం వచ్చింది. ఆ తర్వాత తను తిరిగిన ప్రతి ఊరిని ఒక్కొక్కటిగా గుర్తు చేస్కోడం మొదలు లెట్టాడు. అది తలచుకున్నప్పుడల్లా అతనికి ముందు గుర్తొచ్చేది అక్కడి దుర్వాసన. తన ఊరివారు, రాజ్యం వారు ఇంత కష్టపడ్తుంటే తాను మాత్రం ఈ సువాసనలలో సుఖాన్ని అనుభవిస్తూండడం అతనికి బాధ కలిగించింది. తన వారికి అన్యాయం చేస్తున్నానన్న భావన కలిగింది. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు. అత్తరు బాబా అనుమతితో తాను తయారు చేసిన అత్తర్లను

తీస్కొని తన రాజ్యానికి వెళ్ళాలనుకున్నాడు. అక్కడ ఈ అత్తర్లను ఊరూరా పంచిపెడ్తే అక్కడి దుర్వాసనలు పోయి రాజ్యం పరిమళమంత మౌతుందనీ, ప్రజలు ఎటువంటి బాధా లేకుండా హాయిగా నివసించగలరని ఈశ్వరయ్య ధ్యేయం. ఈ సంకల్పంతోనే ఇప్పుడు కరాజు దగ్గరకు వచ్చి తాను తయారు చేసిన అత్తరును కానుకగా ఇచ్చాడు. మహారాజుగారి ఆశీస్సులతో ఊరూరా తిరిగి అందరికీ అత్తర్లమ్మాలనేది ఈశ్వరయ్య ఉద్దేశం.




కరాజు కాసేపు అత్తరు పరిమళాన్ని ఆనందించాడు. చుట్టూ వున్న వాళ్ళుకూడా అదే పనిలో ఉన్నారు. చివరకు కరాజు ఈశ్వరయ్య వంక ప్రసన్న వదనంతో చూసాడు. 'ఈశ్వరయ్యా! అత్తరు ద్వారా నీవు చేయదలచిన సామాజిక సేవను నేను అభినందిస్తున్నాను. ఈ నేపథ్యంలో నీ కొక సలహా యిస్తున్నాను. దీని ఉపయోగానికి పరిపూర్ణత చేకూరాలంటే ఈ అత్తరును గురించి మా ప్రధాన న్యాయాధీశుడు అభయానంద మూర్తి గారికి చెప్పు. నేను పంపానని చెప్పు. దీని వలన దేశానికి ఎంతో మేలు కాగలదు' అన్నాడు కరాజు.

అభయానందమూర్తికీ అత్తరుకూ సంబంధమేమిటి? అయినా దాని వల్ల దేశానికి ఎలా మేలు జరుగుతుంది? అని వింతగా చూశాడు మంత్రి. కాని రాజుగారి మాట ఎవ్వరూ కాదనలేరు కదా! ఈశ్వరయ్య కూడా 'అలాగే మహారాజా' అన్నాడు.

కరాజుగారి ఆజ్ఞ ప్రకారం ఈశ్వరయ్య తన అత్తరును ప్రధాన న్యాయాధీశులకు సమర్పించుకొని దీని సువాసన ఆరునెలల వరకు పైగా ఉంటుందని చెప్పాడు. ముందు న్యాయాధీశులకు అర్థం కాలేదు. కాని కరాజుగారు ప్రత్యేకంగా పంపారనే సరికి న్యాయాధీశులకు మెరుపులా స్ఫురించింది. కళ్ళల్లో ఒక వెలుగు వెలిగింది. ఈశ్వరయ్యను తమకు ఒక పెద్దమొత్తం అత్తరు సీసాలను సరఫరా చేయవలసిందిగా కోరుతూ ప్రతినెలా ఇలాగే సరఫరా చేస్తుండాలని చెప్పాడు. దీనికి కావలసిన మొత్తం డబ్బు ప్రభుత్వం ద్వారా ఇప్పించే ఏర్పాటు చేస్తానన్నాడు. ఒక్క దెబ్బతో ఇంత పెద్ద వ్యాపారం జరగడం ఈశ్వరయ్యను ఆశ్చర్యానందాల్లో ముంచేసింది. కాకపోతే న్యాయాధీశులవారికి ఇన్ని అత్తరు సీసాలు ఎందుకు కావలసి వచ్చాయా అన్నది ఈశ్వరయ్యకు అర్థంకాలేదు.




మరుసటి రోజు న్యాయాధీశుల ఎదుట నేరస్థులు హాజరయ్యారు. వారెవరో కాదు. అంతకు ముందు పెద్ద మనుష్యులుగా ఉండి లంచగొండితనాలవల్ల పట్టుబడ్డవారు. వింత ఏమిటంటే ఆరోజు వాళ్ళకు కొత్తరకమైన శిక్షపడింది. అంతకు ముందు లాగ కొన్ని నెలలు చెఱసాలకు పంపకుండా న్యాయాధీశులు నేరస్థుల్ని ఒక్కొక్కరిగా పిలిచి వాళ్ళకు కాస్త 'అత్తరుపూసి' పంపించాడు. శిక్ష ఇంతేనా అనుకున్నారు. కాని నేరస్తులు బయటకి వచ్చిం తర్వాత తెలిసింది దాని ప్రభావం. అంతకు ముందు నేరస్థుడిగా ముద్ర పడ్డవాళ్ళు శిక్షాకాలం అయిన తర్వాత కొన్ని మాసాల వరకు ముఖం కప్పుకొని తిరిగేవాళ్ళు. సాధ్యమైనంతవరకు ఇంట్లోంచి బైటకొచ్చేవారు కాదు. దాంతో వాళ్ళంతా ఎక్కడున్నదీ ఎవ్వరికీ తెలీదు. కొన్నాళ్ళకు అందరూ వాళ్ళను గురించి మర్చిపోయేవారు. అప్పుడు మళ్ళీ వారంతా బైటకి తిరిగినా వాళ్ళను మళ్ళీ యథా ప్రకారంగానే జనం చూసేవారు.

కాని ఇప్పుడు సంగతి వేరు. ముఖం కప్పుకొని వచ్చినా అత్తరు వాసన కొన్ని ఆమడలవరకు ప్రాకేసరికి 'ఎవ్వరా దొంగ'? 'ఎవ్వరా దొంగ'? అని అందరూ అతన్నే చూసేవారు. కొందరు అల్లరి కుర్రాళ్ళు గుడ్డతీసి,ముఖం చూసి అందరికీ చెప్పేవారు కూడా. ఇక ఇంట్లోనే వుందామనుకున్నా ఆ యింటి ముందునుంచి ఎవరు వెళ్తున్నా, లోపల్నుంచి అత్తరు వాసన రాగానే 'ఈ ఇంట్లో ఎవరో దొంగ ఉన్నట్టుందే' అని అనుకునేవారు. దీంతో ఇంట్లోని వాళ్ళంతా, ముఖ్యంగా ఆడవాళ్ళు చాలా చాలా ఇబ్బంది పడేవారు. నేరం చేసిన వాళ్ళమీద రోజూ శాపనార్థాలు పెట్టేవాళ్ళు. అత్తరు తుడిచేస్కుందామంటే కుదరదాయె. ఒకసారి పూసుకుంటే అది ఆర్నెల్లవరకూ వుంటుంది. ఇప్పుడు నేరస్థులందరికీ అత్తరు శిక్ష కారాగారశిక్ష కన్నా కఠినంగా తోచింది. నేరం చేసి పట్టుబడితే అత్తరు పూస్తారేమోనన్న భయంతో రానురాను పెద్దమనుష్యులు నేరాల్లోకి దిగడం తగ్గిపోయింది.

"చూశారా మంత్రీ! దుర్వాసనకు అలవాటు పడిన మహానుభావులు పరిమళాలంటే ఎలా జడుసుకుంటారో" అన్నాడు కరాజు నవ్వుతూ.

మంత్రి మౌనంగా తలఊపాడు. మరుసటి రోజు ఈశ్వరయ్య మంత్రిని కలిసి "మంత్రిగారు! మీకొక అత్తరు భరిణెను కానుకగా ఇస్తున్నాను" అన్నాడు.

"వద్దు వద్దు నీ దగ్గరే ఉంచుకో" అన్నాడు మంత్రి కంగారుగా.

◆




సినిమానటుడికి గౌరవం, వైశిష్ట్యం కలిగించిన చిత్తూరు వి.నాగయ్యగారి స్వీయచరిత్ర 'విజయచిత్ర'లో మూడు దశాబ్దాల క్రితం ధారావాహికంగా వెలువడింది. దానిని గ్రంథస్తం చేసిన అప్పటి 'విజయచిత్ర' సహాయ సంపాదకుడు శ్రీ రావి కొండలరావు ఇప్పుడు మేలిప్రతిగా దానిని తీర్చిదిద్ది విడుదల చేసిన పుస్తకమిది. నటుడు, గాయకుడు, సంగీతదర్శకుడు, దర్శకుడు అనే సాంకేతిక గుణగుణాలతో బాటు సినీపరిశ్రమ యావత్తు 'నాన్నగారు' అనే పిలుపుతో గౌరవించే వ్యక్తి నాగయ్య. సినిమా పరిశ్రమ రూపుదిద్దుకుంటున్న రోజుల్లో సినీసంగీతానికి ఓ నిర్వచనం ఇచ్చిన వ్యక్తి ఆయన. పద్యం పాడడంలో నాటకధోరణికి భిన్నంగా ఆయన పెట్టిన ఒరవడి పలువురికి అనుసరణీయం అయింది.

ఒక శ్రోత్రియ కుటుంబీకుడైన తను నాటకాలలో, సినిమాలలో ఎలా ప్రవేశించడం జరిగిందో, సినిమారంగంలో ఎలా తప్పటడుగులు పడ్డాయో భేషజం లేకుండా, దాపరికం లేకుండా వివరించిన ఆత్మకథ ఇది. దానాలకు మారుపేరుగా నిలిచిన నాగయ్య జీవితం కష్టమయం కావడానికి స్వయంకృతమే కారణమనిపిస్తుంది పుస్తకం చదివితే. మనుషుల్ని అంచనా కట్టడంలో పొరబాట్లు, అపాత్రదానాలు, హద్దుమీరిన ఔదార్యం, ఆత్మనియంత్రణ లేకపోవడం, ప్రణాళిక పట్ల నిర్లక్ష్యం - ఇవన్నీ ఆయన జీవితచరమాంకాన్ని విషాదభరితం చేశాయి. సాధారణంగా ఆత్మకథలు బోరు కొడతాయి కానీ జీవితంలో మిట్టపల్లాలు ప్రదర్శించిన ఈ స్వీయచరిత్ర మాత్రం ఆసాంతం రసవత్తరంగా సాగుతుంది. రచయిత, పాత్రికేయుడు అయిన రావి కొండలరావు కొన్ని కొన్ని ఘట్టాలు మలచినదంతా ఒక ఎత్తయితే పుస్తకాన్ని 1/4 క్రౌన్ సైజులో వేయడం వలన మంచి గెటప్ వచ్చింది. ఫొటోలు పెద్దగా, అందంగా దాచుకునేట్లు ఉన్నాయి. అనుబంధంలో నాగయ్య నటించిన వివిధ సినిమాలు, పాడిన పాటల (పల్లవులు, రచయిత, గాయకుల పేర్లతో) వివరాలు ఇచ్చారు. నాగయ్యకు ప్రముఖుల నివాళి, ఆయనతో వారికున్న అనుభవాలు చేర్చారు. అభిరుచి గలవారంతా కొని దాచుకునే పుస్తకంగా తీర్చిదిద్దారు.

సినిమాలలోకి వచ్చేముందు నాగయ్యకు పాశ్చాత్య సంగీతంతో కలిగిన పరిచయం గురించి హాసం.. సంచికలో ముచ్చటించడం జరిగింది. సినిమా సంగీతదర్శకుడిగా ఆయన మారిన ఘట్టం గురించి -

"వాహినీ సంస్థ ప్రారంభించేటప్పుడు అందరం కలిసికట్టుగా ఉండి చక్కని చిత్రాలు నిర్మించాలి- అని ఎలియట్స్ బీచ్‌లో కూచుని ప్రమాణం చేసి సంస్థ ఆరంభించారు. ముఖ్యపాత్రలు ధరించడం, సంగీతదర్శకత్వం వహించడం నా వంతుగా నిర్ణయించారు... నేను కర్ణాటక సంగీతం అభ్యసించాను. హమీద్‌ఖాన్ దగ్గిర కొంత హిందూస్థానీ కూడా నేర్చుకున్నాను. సినిమా సంగీతం కూర్చడం అన్నది నాకు మొదట్లో అంతగా తెలియదు. కర్ణాటకం, హిందుస్థానీ కలిపి పాటలకు వరసలు చెయ్యసాగాను. బి.ఎన్.రెడ్డి, రామనాథ్ నన్ను దారిలో పెట్టారు. "సినిమా సంగీతం చాలా తేలికగా ఉండాలి. శాస్త్రప్రకారం వెళ్తే బాగుండదు." అని. హిందీ సినిమాపాటలు అవీ నాకు వినిపించారు. అలాగే ఆంగ్లసంగీతం కూడా వినిపించారు. నేను ఆ హిందీ పాటలు కొంత అర్థం చేసుకున్నాను. సన్నివేశాలకు అనుగుణంగా ఉండే పాటలను హిందీలో నుంచి తీసుకుని దానికి కొంత మార్పు కలిపించి పాట చేశాను. స్పెయిన్, జపాన్, చైనా వారి సంగీతం నుంచి కూడా కొంత నోట్సు తీసుకుని అదీ యిదీ మిళితం చేస్తూ వరసలు కట్టేవాడిని. లేదా వరస యిస్తే తర్వాత సముద్రాల రాఘవాచార్యులుగారు పాట రాసేవారు. ఒక్కోపాటను యిరవై రకాలుగా రాసేవారు రాఘవాచార్యులుగారు. ఎవరికి ఎక్కడ ఏ మాట నచ్చకపోయినా మార్చడానికి ప్రయత్నించేవారు. రాసిన పాట యూనిట్‌లో ఉన్న ప్రతివారికి నచ్చవలసిందే...'సుమంగళి 'లో బావ పట్నం నుంచి వస్తాడని మాలతి ఆనందంగా పాడుకోవాలి. ఆ ఘట్టానికి రాఘవాచార్యులుగారు ఎన్నోరకాల పాటలు రాశారు. ఏదీ రామనాథ్‌గారికి, బియన్ గారికి నచ్చలేదు. షూటింగు టైము దగ్గరపడడంతో 'సరేలెండి మీకు కుదరకపోతే వదిలేయండి' అన్నారు. రాఘవాచార్యులు గారికి పట్టుదల వచ్చింది. ఉదయం నుంచి ఆలోచించి, ఆలోచించి మధ్యాహ్నం భోజనానికి ముందు స్నానానికి వెళ్లి తిరిగివచ్చి 'పాట దొరికింది' అన్నారు. అందరికీ నచ్చింది. ఆ పాట 'వస్తాడే మా బావ'! అమితమైన ప్రజాదరణ పొందిన పాట!"

సినిమా సంగీతంద్వారా ప్రజలకు దగ్గరవడమే కాదు, శాస్త్రీయ సంగీతాన్ని ప్రజలకు దగ్గర చేయాలని కూడా నాగయ్య ఎంతో తాపత్రయపడ్డారు. మద్రాసులోని టి.నగర్‌లో వాణీమహల్ వారి కృషి ఫలితమే! ఆ ఆలోచన ఎలా రూపుదిద్దుకుందో వివరించారు -



పే - 144 వెలరూ. 150/-
ప్రతులకు ఆర్కేబుక్స్, హైదరాబాదు
040-23830137



36 వ యేట వయసు మీరిన పాత్ర పోషించి మెప్పునందిన నాగయ్య

"త్యాగయ్య సినిమా తీస్తూండగానే మద్రాసులో మైలాపూరులో జి.యన్.బాలసుబ్రహ్మణ్యం కచేరీకి వెళ్లాను. పూర్తయేసరికి వర్షం. ఎందరో స్త్రీపురుషులు వానలో తడుస్తూ వెళుతూండడం కనిపించింది. టి.నగర్‌నుండి కచేరీకై వచ్చారట. "నా కారులో రండి. టి.నగర్‌లో దిగవచ్చు" అన్నాను. "వద్దుసార్, ఒకరమా ఇద్దరమా 80 మందిమి ఉన్నాము." అన్నారు. నేను అయితే అయిందని, అక్కడ ఉన్న బంగళా వరండాలో నించుని, ట్రిప్‌కు ఏడెనిమిది మంది చొప్పున ఎన్ని ట్రిప్స్ అయితే అన్ని ట్రిప్స్ వేసి అందర్నీ టి.నగర్‌లో దింపి రమ్మన్నాను. అప్పటివరకు నిల్చోడంలో ఒక ఊహ వచ్చింది- టి.నగర్‌లో ఒక సంగీతసభ ఆరంభించాలని!

..జి.యన్.చెట్టి వీధిలో మందిరనిర్మాణం ఆరంభమయింది. దాన్ని అందరూ 'నాగయ్య హాల్' అని పిలుస్తూ వుండేవారు. ప్రారంభోత్సవవేళ సర్ సి.పి.రామస్వామి "ఆ పేరే ఉండనీ" అన్నారు. 'నా పేరు తగదు' అని వాదించాను నేను. భాష్యం అయ్యంగారు 'వాణీమహల్' అని సూచించారు.

..త్యాగరాజు జన్మస్థలమైన తిరువయ్యారులో సంగీతపాఠశాల పెట్టడానికి 10 వేలు విరాళం ఇచ్చాను. మద్రాసులో ఎన్నో సంగీతసభలలో జీవితసభ్యుడిగా చేరాను. విరాళాలు ఇచ్చాను."

ఇతరగాయకులతో నాగయ్య అనుభవాలు - "ఒకసారి మద్రాసులో కరీంఖాన్ సంగీతకచేరీ కి హాజరయి నా గౌరవప్రపత్తులు తెలుపుతూ కానుకలు సమర్పించాను. ఆయన నన్ను ఏదైనా పాడమని బలవంతం చేశారు. ముందులో సిగ్గుపడ్డా 'ఎందరో మహానుభావులు' పాడాను. పక్కన ఉన్న మిత్రులద్వారా పాటలో ఉన్న అర్థం తెలుసుకుంటూ కరీంఖాన్ బ్రహ్మానంద భరితులయ్యారు. ఆయన దగ్గిర రెండు తంబూరా (పేర్లు రామ్, లక్ష్మణ్)లలో 'రామ్'ను నాకు బహూకరించారు. 'త్యాగయ్య' చిత్రంలో దాన్నే వాడాను."

మద్రాసుతో నాగయ్యకున్న అనుబంధానికి గుర్తుగా టి.నగర్‌లోని పానగల్ పార్కులో 1977న ఆయన కాంస్యవిగ్రహాన్ని నెలకొల్పారు.

(సశేషం)

**- ఎమ్బీయస్ ప్రసాద్**

# నేనూ నా పాటలు

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

**8**



- శ్రీమతి జమునా రమణారావు

'ఏక్‌రాజ్' లో కిశోర్‌కుమార్ హీరో. హీరాలాల్ మాస్టారు నాచేత రెండు మంచి డ్యాన్స్ సాంగ్స్ చేయించారు. ఒక డాన్సుకి కిశోర్‌కుమార్ 'పాయల్ వాలీ దేఖ్‌నా...' అంటూ మంచి క్లాసికల్ సాంగ్ పాడతాడు. దానికి సూపర్బ్ ట్రెయినింగ్ నాకు. ఆ తర్వాత ఇంకో సాంగ్... 'డగర్ చలత్ జన్‌కే బిచువా' అని లతా మంగేష్కర్, ఉషా మంగేష్కర్ పాడేరు. అందులో కూడా చాలా ఫాస్ట్ మూవెంట్స్. పక్కనుండే అమ్మాయి మధుమతి అని ఫాస్టెస్ట్ డ్యాన్సరట ఆ రోజుల్లో... ఆ అమ్మాయికి, నాకూ కలిపి నాలుగు రోజులు రిహార్సిల్స్ చేయించారు. స్పీడ్ స్పీడ్ అంటుండేవారు. కాళ్లంతా నొప్పులు. కానీ చాలా బాగా ఆ అమ్మాయితో ఈక్వల్‌గా చేయించారు హీరాలాల్ మాస్టారు. అది జనం కూడా బాగా లైక్ చేశారు. నాకు పర్సనల్‌గా ఇష్టమైన పాట 'పాయల్‌వాలీ దేఖ్‌నా' !

ఆ రెండు పాటలే కాకుండా కిశోర్‌కుమార్‌కు, నాకు ఓ డ్యూయెట్ సాంగ్ కూడా ఉంది. బొంబై దగ్గర ఓ చిన్న హిల్ స్టేషన్ ఏదో ఉంది. జనరల్‌గా లవ్‌సాంగ్స్ చేయాలంటే ... ఇప్పుడంతా ఫారిన్ వెళ్తున్నారు కానీ ఆ రోజుల్లో అంతా చుట్టుపక్కలే కదా ! మహా అయితే కాశ్మీర్...!

చిత్రం : ఏక్‌రాజ్    రచన : మజ్రూహ్ సుల్తాన్‌పురి
సంగీతం : చిత్రగుప్త    గానం : కిశోర్‌కుమార్





లచకత్ చమకత్ చలక్ కామినీ
జహీగున్ దమకత్ చపల్ దామినీ
ఓ బావరీ ఓ సావరీ
హరీ ఓ చంచల్ పల్‌చిన్ రుక్ జా రుక్ జా రుక్ జా
పాయల్ వాలీ దేఖ్‌నా ॥2॥
యహీ పే కహీ దిల్ హై పగ్ తలే హాయె నా ॥పాయల్॥
జైసే దామినీ యా బద్‌రా మే ఉడే
కుచ్ దూర్ చలే ఫిర్ జాకే ముడే ॥జైసే॥
ఉరారే నయన్ కజ్‌రారే
పర్ ఇత్‌నా సమజ్ లే కిసీ కీ లగే హాయె నా ॥పాయల్॥
కిత్ ఝూమ్ చలీ మదిరాసీ పీయే
మత్ వారీ పవన్ అచ్‌రా మె లియే ॥ఇత్‌ఝూమ్॥
జమానా యహీ మస్‌తానా
దేఖోజీ కహీ రుత్ బిన్ కాలీఘటా ఛాయే నా ॥పాయల్॥
కహీ ఐసా నహో కోయీ బాత్ బనే
అంగ్‌డాయీ మేరీ తేరా నాచ్ బనే ॥కహీ॥
నా చోరీ న బన్‌కే చకోరి
ఘూంగర్ కహీ ధడ్‌కన్ మేరీ బన్ జాయే నా ॥పాయల్॥



# నేనూ నా పాటలు



'నగ్మా ఏ దిల్ కో ఛేడ్‌కే హోంఠోంమే క్యోఁ దబాలియా' అని మంచి సాంగ్. బొంబై దగ్గరున్న ఆ హిల్ స్టేషన్‌లో రెండు రోజులు పాటు షూటింగ్ చేశారు. అక్కడకు వెళ్లినప్పుడు ఏం జరిగిందంటే - ఒకతను ఓ కుక్కను పెట్టుకుని మా షూటింగ్ స్పాట్‌లో కొచ్చి కూర్చున్నాడు. నాకు కుక్కలంటే బాగా ఇష్టం...మీకు తెలుసు కదా. బ్రేక్‌లో అతన్ని పిలిచాను. 'కాటేగా యా నహీఁ?' అంటే 'కుఛ్ నహీ కర్తా అమ్మా...' అన్నాడు. 'సరే... దగ్గరకు తీసుకురా' అన్నాను. టచ్ చేస్తే ఏమీ అనలేదు. వెంటనే అతను 'అమ్మా ఫ్యూఛర్ బతాతా హై మేరా డాగ్...' (జ్యోతిష్యం తెలుసు దానికి...అన్నీ చెప్తుంది, స్టార్స్ కనుక్కుంటుంది. ఫలానా స్టార్ మనిషి ఇక్కడ ఎవరున్నారు అంటే ఆ స్టార్ మనిషి దగ్గరకు వెళ్లి చూపిస్తుంది) అని అన్నాడు.

'అదేంటి... కుక్క ఎలా జ్యోతిష్యం చెబుతుందీ' అంటే 'అగర్ ఆప్ మౌకా దేంగే తో హమ్ లోగ్ ఆతే.. ఆప్ కో దిఖాతే హై'(మీరు నాకు అవకాశం ఇస్తే మేం వస్తాం, చూపిస్తాం) అన్నాడు. షూటింగ్‌లో ప్రాణ్ కూడా ఉన్నాడు. అతనికి కూడా నాలాగే కుక్కలంటే విపరీతమైన పిచ్చి. వాళ్లింట్లో కూడా పెద్ద పెద్ద కుక్కలు చాలా ఉండేవి. 'అరే అరే..లావ్..షామ్ కో షూటింగ్ ఖతమ్ హోనే కే బాద్ లావ్...' అన్నాడు. షూటింగ్ అయిన తర్వాత అందరూ రెడీ అయి రౌండ్‌గా కూర్చున్నాం.

అతనేమో ఆరున్నర ఆ టైమ్‌లో కుక్కని తీసుకువచ్చాడు. మామూలు పోలీస్ డాగ్‌లాగా ఫీట్స్ చేయదది. దానికవేమీ తెలీదు. ఫస్ట్ అతను అడిగింది ఏమిటంటే - 'ఇన్ లోగోం మే సే ఆప్‌కో కౌన్ బహుత్ ప్యార్ కర్‌తే హై' (కుక్కలంటే బాగా ఇష్టమున్న వ్యక్తి ఈ గ్రూప్‌లో ఎవరున్నారు చెప్పు) అంటే సర్రుమని నా దగ్గరకు వచ్చేసింది. వచ్చి తోకాడించుకుంటూ కాలుతో నన్ను చూపించింది. నేను చాలా ఆశ్చర్యపోయాను. ఇంతమంది ఉంటే నన్నే చూపించిందని. తర్వాత అతను మళ్లీ అడిగాడు 'ఔర్ కోయీ హై తో దిఖావో' అని. అంటే అది మళ్లా ఓ రౌండ్ తిరిగి ప్రాణ్ దగ్గరకు వెళ్లి ఆయన ఒళ్లో రెండు కాళ్లు పెట్టింది. తర్వాత అతను స్టార్‌లు చెప్పాడు. ఇందులో మకర రాశి, ధనిష్టా నక్షత్రం....ఇలా ఒక్కొక్క రాశి, ఒక్కొక్క నక్షత్రం చెప్తుంటే అది అలా వెళ్లి అందరినీ చూపించింది. నాకు చాలా ఆశ్చర్యమేసింది. ఇదెలా ట్రైనింగ్ ఇచ్చాడురా.... అని... వండర్‌ఫుల్. పైగా అది జాతి కుక్క కూడా కాదు. ఊరకుక్కట. మామూలు ఊరకుక్కకే అంత ట్రైనింగ్ ఇచ్చాడు ! భవిష్యత్తు గురించి మేం ఏమీ అడగలేదు. ప్రాణ్ ఏదో అడిగాడు కానీ గుర్తులేదు. అదొక తమాషా సంఘటన.

ఆ రోజుల్లో ఏంటంటే - ఎవరి క్యారెక్టర్‌కు వాళ్లే డబ్బింగ్ చెప్పుకోవాలి.

ఇతర భాషల తారలు వచ్చినా కూడా ఆ లాంగ్వేజ్ నేర్చుకుని ఆ భాషలో డబ్బింగ్ చెప్పవలసివచ్చేది. అరవ తారలు తెలుగులో చేసినా కూడా తెలుగులో మాట్లాడేవారు. ఇవాళ పాత సినిమాలు చూస్తుంటే నాకు చాలా ఆశ్చర్యమేస్తుంది. సరోజాదేవి, ఎల్.విజయలక్ష్మి .... వాళ్లందరితో చాలా చక్కగా తెలుగు మాట్లాడించేవారు. అలాగే హిందీలో నయాఆద్మీ తప్పించి అన్నిటిలోనూ నా వాయిస్సే. ఏక్‌రాజ్ 100 రోజులు ఆడింది. వాళ్లకు 100 రోజులు పెద్దలెక్కలోకి రాదు. సిల్వర్‌జూబ్లీ అంటేనే అది పెద్ద హిట్ క్రింద లెక్క.

యాక్చువల్‌గా హీరోలు, నేను బాయ్‌కాట్ చేసుకుని ఉన్న టైంలో ... రేలంగి గారు తంతే బూరెల గంపలో పడ్డావని అన్నారోసారి.. ఆ బూరెల గంప ఏమిటంటే ఎల్వీప్రసాద్ గారు వరుసగా మూడు హిందీ పిక్చర్స్‌కు నాతో ఎగ్రిమెంట్ చేయించుకోవటం... ఫస్టది 'ససురాల్', రెండోది 'హమ్‌రాహీ' రెండిటిలోనూ రాజేంద్ర కుమార్ హీరో! మూడోది 'మిలన్'. సునీల్‌దత్ హీరో. మూడు ఎగ్రిమెంట్ నాతోనే చేసారు. కానీ అప్పుడేం జరిగిందంటే బి.సరోజాదేవి హీరోయిన్‌గా రాజ్‌కపూర్‌తో 'నజరానా' ('పెళ్లికానుక' హిందీ చిత్రం) తీస్తున్నారు. ఈ అమ్మాయి లేట్‌గా వచ్చిందని ఆ హిందీ సినిమా నుండి తీసేశారు. యాక్చువల్‌గా 'ససురాల్‌లో' నేనుండాలి. 'ఇల్లరికం' హిందీ వెర్షన్ అది. అలాగే 'భార్యాభర్తలు' హిందీ వెర్షన్ 'హమ్‌రాహీ'. ఈ అమ్మాయి వెళ్లి ఎల్వీప్రసాద్‌గారి దగ్గర ఏడ్చి, గొడవపెట్టి భవిష్యత్తు పాడయిపోతుందని అంటే ఆమెను తీసుకెళ్లి బొంబైలో 'ససురాల్' షూటింగ్ చేసేశారు. నాకు ఇన్‌ఫర్‌మేషన్ కూడా లేదు... నాకు చాలా బాధ కలిగి ప్రసాద్ గారి దగ్గరకు వెళ్లి 'నాన్నగారూ.. ఎందుకిట్లా చేశారు మీరు ? అసలే నేను ఇక్కడ గొడవల్లో ఉన్నాను. నాకు ఆశపెట్టి, అగ్రిమెంట్ కూడా చేసి మీరు ఇలా చేస్తే ఎలా? నాకు వేషం ఇమ్మని మిమ్మల్ని నేను అడగలేదు. మీరే పిలిచి మూడు పిక్చర్స్‌లో వేషం ఇచ్చినట్టే ఇచ్చి ఇలా చేశారేంటి...'అని అంటే "ఏం చేస్తానమ్మా ఆ అమ్మాయి వచ్చి ఏడ్చింది పాపం... నీకు ఇంకో పిక్చర్ ఇస్తాను. నీ మూడు పిక్చర్‌లు నీకు ఉంటాయి కదా... డోంట్ వర్రీ" అన్నారు. అని 'సంతానం'ను 'బేటీ బేటే' గా తీసారు. అది 'హమ్‌రాహీ' తర్వాత చేశాను. ఆ తర్వాత 'మిలన్'.

'హమ్‌రాహీ' కి తాతినేని ప్రకాశరావు గారు డైరెక్టర్. మొత్తం పిక్చర్ అంతా కూడా బొంబైలోనే షూటింగ్. అప్పటికి











'ఏక్‌రాజ్'లోని 'డగర్ చలత్ జనేకే బిచువా' పాటలో ఉత్తరాది నర్తకి మధుమతితో శ్రీమతి జమున చేసిన నృత్యంలో కొన్ని దృశ్యాలివి...

# నేనూ నా పాటలు



చిత్రం : ఏక్‌రాజ్    సంగీతం : చిత్రగుప్త
రచన : మజ్రూహ్ సుల్తాన్‌పురి    గానం : కిషోర్ కుమార్, లతా మంగేష్కర్

ఆ: నగ్ మా ఏ దిల్ కో ఛేడ్‌కే
హా రోం మె క్యోం దబాలియా ॥నగ్ మా॥
అ: కైసే కహూం మై హాలెదిల్
తుమ్‌నేతో సర్ ఝుకాలియా ॥కైసే కహూం॥
అ: కెహనా యే థా ఆజ్ హమ్
ఫూల్‌కొయి న చున్ సకే ॥2॥
ఆ: గుమ్మె తుమ్హారి ప్యార్ మే
హోష్ కిసే జొ సున్‌సకే
అ: హాయె సితమ్ కె గాల్ పే
జుల్ఫోం కో ఫిర్ గిరా లియా ॥నగ్ మా॥
ఆ: మెరా తో దిల్ ఖిల్ గయా
దేఖీ కీ జహా ఝులక్ తెరీ ॥మె రా తో॥
ఆ: మెరీ నిగాహ్ జబ్ ఉఠీ
మిల్ తీ హుయీ పలక్ తెరీ
ఆ: పల్కే నహీ ఝుకీ నహీ
తుమ్నే తుమ్హే ఛూపాలియా ॥కైసీ కహూం॥
అ: మేరా జిగర్ మేరా దిల్
హా....మెరీజాన్ తుమ్హీ కహో ॥మేరా॥
ఆ: ఛోటా సేయే ఏక్ ప్యార్ కా
మేరా జహా తుమ్హీ తో హో
అ: హమ్‌నె తుమ్హీ తో ఆప్‌నే
అప్నా హమే బనాలియా ॥నగ్ మా॥







రాజేంద్ర కుమార్ టాప్ పొజిషన్‌లో ఉన్నారు. నేను మాట్లాడే హిందీ విని రాజేంద్రకుమార్ 'బహుత్ అచ్ఛీ బోల్తీ హై, (చక్కగా మాట్లాడుతున్నారు) కాఫీ అచ్ఛీ బోల్తీ హై హిందీ' అన్నారు. ఆ టైంలో నేను ఏం చేసానంటే లక్నో నుంచి సిన్హా అని ఓ మాస్టారును పెట్టుకుని నేర్చుకున్నాను. హిందీ మాట్లాడటం వేరే.. యాక్సెంట్ వేరే. దానికోసం మాస్టారు కూడా షూటింగ్‌కు బొంబై వచ్చేవారు. అట్లా హిందీ బాగా నేర్చుకున్నాను. ఆ రోజుల్లో పెద్ద పెద్ద హోటల్స్ ఏమీ లేవు. అందులోనూ మేం వెజిటేరియన్స్ కాబట్టి బొంబై సెంటర్‌లో ఒక్కటే సౌత్ ఇండియన్ హోటల్ ఉండేది... ఇడ్లీ, సాంబార్‌తో! మమ్మల్ని అక్కడే రెండు, మూడు ట్రిప్పులు ఉంచారన్నమాట.

ముఖ్యంగా ఇక్కడ గుర్తుచేసుకోవలసింది ఏమిటంటే ... రాజేంద్రకుమార్ గారు చాలా రెస్పెక్ట్ ఇచ్చేవారు. రెస్పెక్టబుల్‌గా బిహేవ్ చేసేవారు. షూటింగ్ టైమ్‌లో ఒకసారి తాతినేని ప్రకాశరావుగారిని ఒక ప్రశ్న అడిగారు. 'ఈ అమ్మాయి ఇంత ఫ్రెష్‌గా, లేత గులాబీలా.. అందంగా ఉంది. ఏంటి సీక్రెట్ ...' అంటూ నన్ను గులాబితో పోల్చారు. 'జనరల్‌గా 50..60 సినిమాలు చేసినవారంటే కొంత ముదురుతనం వచ్చేసి ఇంకో రకంగా కనిపిస్తారు... ఈ అమ్మాయి మాత్రం చాలా ఫ్రెష్ కనిపిస్తోంది' అని అంటే అప్పుడు ప్రకాశరావు గారు చాలా గొప్పగా చెప్పారు నా గురించి ... 'ఆ అమ్మాయి చాలా స్ట్రిక్ట్ అండి... బాడ్ హేబిట్స్ లేవు. నాన్ వెజ్ తినదు. డ్రింక్ చేయదు. స్ట్రెయిట్ ఫార్వర్డ్‌గా ఉంటుంది. వాళ్ల నాన్నగారు కూడా చాలా మంచి వారు. చాలా మంచి ఫ్యామిలీ నుండి వచ్చారు. షి మెయింటైన్స్ హర్ డిగ్నిటీ ఇన్ ఫిలిం ఫీల్డ్. ఫాస్ట్ లైఫ్ కాదు. అందువల్ల ఆ అమ్మాయి ఎక్కడకు వెళ్లినా చాలా ఫ్రెష్‌గా ఉంటుంది. ఇంకా 100 సినిమాలు చేసినా అలానే ఉంటుంది' అన్నారు.

తర్వాత ప్రకాశరావుగారు నాతో..'ఏమ్మా నీ గురించి ఇలా నాతో అడిగారు...నేను ఇలా చెప్పాను' అని చెప్పారు. అక్కడనుంచి నేనంటే రాజేంద్ర కుమార్‌కు ఇంకా గౌరవం పెరిగింది. అక్కడి వాళ్లు ఎంతో సరదాగా ఉంటారు. రెస్పెక్టు ఇస్తారు. బిహేవియర్ అనేది ఇవతల వాళ్లు లీనియన్స్ ఇస్తేనే కదా అవతల వాళ్లు చనువు ఎక్కువగా తీసుకునేది. రాజేంద్రకుమార్ ఒక్కటే అనేవారు... నాకళ్లు బాగుంటాయంట... అందుకని 'జమునా నీ కళ్లూ సాలా బాగుంటాయి'- అంటూ పాట లాగా పాడేవారు. ఇలా అనాలంటే ఎలాగా అని ఇంగ్లీషులోనో, హిందీలోనో అడిగి తెలుగులో ప్రకాశరావు గారి దగ్గర నేర్చుకోవటం.... ప్రకాశరావుగారు ఏం చెబితే ఈయన అది చెప్పడం. అందుకని ఈయన 'జమునా నీ కళ్లూ సాలా బాగుంటాయి' అంటూ పాడుతుండేవారు. నేను సెట్‌లోకి అడుగు పెట్టగానే ఇదే పాడుతుండేవారు. 'సాలా' కాదండి బాబూ 'చాలా' అని నేను చెప్పటం.... అలా సరదాగా ఉండేది షూటింగ్.

'హమ్‌రాహీ'లో మెహమూద్, శుభాకోటే కామెడీ పెయిర్. శుభాకోటే మదర్... మహరాష్ట్రియన్. మరాఠీ బాగా మాట్లాడతారు. మా నాన్నగారూ మరాఠీ బాగా మాట్లాడతారు. వీళ్లిద్దరూ కూర్చుని మరాఠీ మాట్లాడుకుంటూ ఉండేవారు. 'మీకు మరాఠీ ఎట్లా వచ్చూ' అని ఆవిడ అడిగితే... మా ఫోర్ ఫాదర్స్... గ్రాండ్ ఫాదర్స్ మా బ్యాక్‌గ్రౌండ్



'హమ్‌రాహీ' చిత్రంలో రాజేంద్రకుమార్‌తో...

# నే నూ నా పా ట లు



GENESIS OF NIPANIKAR RAJWADE FAMILY: GAZETTEER OF INDIA

MAHARASHTRA STATE: KOLHAPUR DISTRICT (Revised Edition)

Page. 78: Chapter 2 - History Maratha Rule. Shivaji III (1760-1812)

" He( Shivaji III) further possessed himself of the districts of Chikodi and Manoli which during the late disturbances had fallen into the hands of the Nipanikar the Chief of Nipani some thirty miles to the South of Kolhapur who had raised himself from the position of a humble Desai to that of a powerful leader.

Page. 80:

The Nipani chief who was in alliance with (Gwalior) Scindia had unsuccessfully beseiged the Fort of Nerli in the "Miraj Saranjam" but ontroops being sent to his assistance from Kolhapur the place fell.

Lakshmi Bai the Regent of Savantwadi state applied for aid to the Peswha at Poona. The later(Peshwa) assisted her secretly instigating the Nipani Chief to take possession of the Districts of Chikodi and Manoli on which the Kolhapur Raja hastily raised the seized of Vadi and returned to his own territory. Active hostilities then took place between him and the Nipanikar which resulted in the Total defeat of the Former (Kolhapur Raja) in a battle at Sanganav in 1808. The Nipanikar however did not press his advantage and in the following year a peace was negotiated which was to be consolidated by the marriage of Nipanikar with one of the Kolhapur princess. The marriage took place but had not the desired effect. In the midst of the wedding festivities the Nipani Chief suddenly decamped with his bride and a hostile incursion made not long after into Kolhapur territory.

శ్రీమతి జమున పెదనాన్న గారు మహారాష్ట్ర లైబ్రరీలోని శివాజీ చరిత్ర నుండి పరిశోధించి సంపాదించిన నిప్పాణి వంశస్థుల చరిత్ర గజిట్ కాపీ ఇది.

నిప్పాణికర్ రాజ్‌వాడే కుటుంబ ఆవిర్భావం ఆధారం - గెజిటీర్ ఆఫ్ ఇండియా

మహారాష్ట్ర రాష్ట్రం - కొల్హాపూర్ జిల్లా (రివైజ్‌డ్ ఎడిషన్) అధ్యాయం

పేజీ. 78 : చాప్టర్ 2 - మరాఠా పరిపాలన చరిత్ర, శివాజీ III (1760-1812) పాలనాకాలం

..."అంతకుముందు జరిగిన ఆందోళనలలో నిప్పాణి రాజైన నిప్పాణికర్ స్వాధీనంలోకి వెళ్లిన చికోడీ, మనోలీ జిల్లాలను శివాజీ III తిరిగి ఆక్రమించుకున్నాడు. కొల్హాపూర్‌కు దక్షిణంగా 30 మైళ్ల దూరంలో ఉన్న నిప్పాణిని పాలించిన నిప్పాణికర్ గ్రామాధికారియైన దేశాయి పదవి నుండి క్రమంగా బలపడి ఒక శక్తిమంతమైన నాయకుడిగా ఎదిగాడు.

పేజీ 80 :

'మీరజ్ సంరంజన్' జరిగినప్పుడు గ్వాలియర్ రాజైన సింధియా సహాయంతో నిప్పాణి పాలకుడు నెర్లి కోటను ఆక్రమించుకోబోయాడు కానీ సఫలీకృతుడు కాలేకపోయాడు. కానీ కొల్హాపూర్ నుండి అతనికి సహాయంగా సేనలు రావడంతో కోట వశమయింది.

సావంత్‌వాడి రాజ్యానికి రాజ సంరక్షకురాలిగా ఉన్న లక్ష్మీబాయి పూనాలో ఉన్న పీష్వాను సహాయానికై అర్థించింది. ఆమెకు సహాయపడడానికై పీష్వా, నిప్పాణి పాలకుడిని పురికొల్పి చికోడీ, మనోలీ జిల్లాలపై దండెత్తమన్నాడు. సరేనని నిప్పాణి పాలకుడు దండెత్తగానే 'వాడీ' కోటను తన సైన్యంతో దిగ్బంధం చేసి కూచున్న కొల్హాపూర్ రాజా ముట్టడి ఎత్తేసి తన రాజ్యానికి మరలిపోయేడు.

దీని తర్వాత నిప్పాణికర్‌కు, కొల్హాపూర్ రాజాకు శత్రుత్వం పెరిగింది. అంతిమంగా 1808లో సంగనావ్ వద్ద జరిగిన యుద్ధంలో నిప్పాణికర్ కొల్హాపూర్ రాజాను ఓడించడం జరిగింది. తనదే పైచేయిగా ఉన్నా నిప్పాణికర్ రాజాతో శాంతి వాంఛించాడు. మరుసటి సంవత్సరం జరిగిన శాంతి చర్చల్లో భాగంగా కొల్హాపూరు రాకుమారిని నిప్పాణికర్ వివాహమాడడానికి ఒప్పందం కుదిరింది.

పెళ్లి జరిగింది కానీ అనుకున్న శుభ పరిణామాలను ఇవ్వలేకపోయింది. వివాహ వేడుకలు జరుగుతూండగానే నవవధువుతో సహ నిప్పాణి పాలకుడు చెప్పా పెట్టకుండా తన రాజ్యానికి వెళ్లిపోయాడు. వెనువెంటనే కొల్హాపూర్ రాజ్యంతో కీచులాటలు ప్రారంభమయ్యాయి.

పాఠకుల కోసం శ్రీమతి జమున ప్రత్యేకంగా తీసి ఇచ్చిన ఆ గజిట్ కాపీకి 'హాసం' అనువాదమిది.

అంతా నిప్పాణీ రాజ్‌వాడ్‌కర్... ట్రెడిషనల్ .... హిస్టరీ ఉంది" అని చెప్పేవారు.

మా దొడ్డప్ప గారు 'మన మధ్వా బ్రాహ్మిణ్స్‌కు ఈ నిప్పాణీ అనేది ఎలా వచ్చింద'ని రిసెర్చ్ చేశారు. మహరాష్ట్ర లైబ్రరీలో ఇప్పటికీ ఉంది అది... శివాజీ చరిత్రలో ఫలానా పేజీలో...ఫలానా పేరాలో మన ఫ్యామిలీ గురించి ఉంది అని టైప్ చేసి నాకు పంపించారు. నిన్నే (21/06/2004) నాకు దొరికింది.

అప్పుడు నాకు మా పెదనాన్నగారు ఈ పేపర్ ఇచ్చిన తరువాత ఏం చెప్పారంటే నాకు తెలిసి శివాజీ కాలంలో నలుగురు నిప్పాణికర్‌లు పీష్వాలుగా ఉండేవారు. వీళ్ల నలుగురు చాలా స్ట్రెంగ్త్‌గా ఉండేవారు శివాజీకి. అందువల్ల బ్రిటీష్‌వాళ్లు శివాజీని పట్టుకోలేకపోయారు. డివైడ్ అండ్ రూల్ పాలసీగా ఆ నలుగురులో ఎవరినన్నా పక్కకు పెట్టేస్తే తప్ప ఆ ఫోర్ట్ చిక్కదు అనుకుని వీళ్లందరికీ జమీందారీలు ఇచ్చేసి ఒకరిని తమిళనాడు, ఒకరిని కర్నాటక, ఒకరిని ఆంధ్ర...ఇలా స్కాటర్ చేసేశారు బ్రిటీష్ వాళ్లు. నాలుగోవాళ్లు మాత్రం అక్కడే ఉండిపోయారు. అప్పుడు ఫోర్ట్‌ను క్యాప్చర్ చేసేశారు.

నిప్పాణీ ఫ్యామిలీస్ ఇలా స్కాటర్ అయిన తరువాత మా పెదనాన్నగారు కర్నాటకలో మధ్వా బ్రాహ్మిణ్ అమ్మాయిని చేసుకున్నారు. ఆయన పేరు నిప్పాణి వెంకట్రావ్. ఇంకో పెదనాన్న తమిళనాడులో పాన్నేరిలో. ఆంధ్రా వైపు పొద్దుటూరులో మా నాన్నగారి ఫాదర్ నిప్పాణీ నరసింగరావు గారు. ఆయన లీడింగ్ లాయర్. లవ్ మేరేజ్ చేసుకున్నారు. మా నాన్నగారు పసుపు, పొగాకు బిజినెస్ కోసం దుగ్గిరాలకు వచ్చారు. యాక్చువల్‌గా నేను పుట్టింది హంపీ, కర్నాటకలో. దుగ్గిరాలకు నేను వచ్చేటప్పటికి కన్నడ ఒక్కటే మాట్లాడగలను. మరాఠీ రాదు.

కర్నాటకలో పుట్టినా కూడా ఆంధ్రాలోనే పెరిగాను. తెలుగు పిల్ల లాగానే కలిసిపోయాను. అందుకని తెలుగు అమ్మాయిగానే లెక్కగానీ, మహరాష్ట్రియన్ అని చెప్పుకోను కూడా . ఎందుకంటే ఆంధ్ర రాష్ట్ర ప్రజలే కదా నన్ను అభిమానించి ఇంత దాన్ని చేశారు. అందులో కృష్ణా, గుంటూరు అంటే చాలా చక్కటి తెలుగు భాష.

బి.ఎన్.రెడ్డి గారు 'బంగారుపాప' టైమ్‌లో ఈ అమ్మాయికి మహరాష్ట్రియన్ ఫేస్ కట్ ఉంది, ఆ లాంగ్ ఫేస్ కావాలి అని చెప్పటం గురించి 16-31 మార్చి, మే 2004 'హాసం' సంచికలలో చెప్పాను. ...ఇక్కడ చెప్పుకోవలసింది ఏమిటంటే బి.ఎన్.రెడ్డిగారి అబ్జర్వేషన్...! ఈ అమ్మాయి ఆ వేషానికి సరిగ్గా సరిపోతుంది... ఆ కట్టు కడితే ఈ అమ్మాయి మరాఠీ పిల్లలా ఉంటుందన్న ఆయన థాట్‌కు మనం హేట్సాఫ్ చెప్పాలి. బి.ఎన్.గారికి నా వంశ చరిత్ర అవేమీ తెలియదు. ఈ స్టోరీ అంతా శుభాకోటేకు చెప్పాం. ఇక వాళ్ల అమ్మగారికి ఇంకా సంతోషం. 'క్యాం బేటీ తుమ్ భీ మరాఠీ సీక్‌నా చాహియే... బాత్ కరోనా...కరో' అనేది. అలా వాళ్ల దృష్టిలో మహరాష్ట్రియన్ గా కూడా ఎస్టాబ్లిష్ అయ్యా !

(హమ్‌రాహీ చిత్రంలోని పాటల గురించి... ఆ చిత్రంలో శ్రీమతి జమునకు ఎదురైన ఓ చేదు సంఘటన గురించి వచ్చే సంచికలో....)




# పెళ్లిపుస్తకం

**దర్శకత్వం : బాపు**

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్లపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**10**

### జరిగిన కథ

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్లవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. యజమానురాలి కోరిక మేరకు భామ వసుంధరకు డాన్స్ నేర్పే సమయంలోనే శ్రీధరం కృష్ణమూర్తిని తనతో టీల్ ఆడమంటాడు. డాన్సు మానేసి వసుంధర, కృష్ణమూర్తిని చూడడం భామకు కోపం తెప్పిస్తుంది. ఆటలో కృష్ణమూర్తి జారిపడి నడుం పట్టేస్తుంది. నడుం నొప్పితోనే ఇంటికి వస్తాడు. -(ఇక చదవండి)

".....ఏదో ఒక జోకు వేస్తావుగా... వెయ్యరాదూ?" అన్నాడు కృష్ణమూర్తి ఇక భరించలేక.

'నేనా... మీ మీదనా... తప్పుకాదూ...' అన్నట్టు సైగల ద్వారా భావ ప్రకటనలు ఇచ్చి దగ్గరకొచ్చి నృత్య భంగిమ ప్రదర్శించి నమస్కరించింది భామ.

"ఇదేమిటి?" అన్నాడు కృష్ణమూర్తి అర్థంకాక.

"నాట్యకవులకు వందనములు" అన్నది భామ గ్రాంధిక భాషలో నమస్కరిస్తూ.

"నాట్యకవులా?.....వాడెవడూ?" అన్నాడు కృష్ణమూర్తి.

"మేము ఒట్టినాట్యం చేస్తాం. పాఠాలు అప్పచెప్పినట్లు చేస్తాం. కానీ దానికి కవిత్వం జోడించి బ్యాడ్మింటన్లో భరతనాట్యం, భరతనాట్యంలో బ్యాడ్మింటన్ కలిపి ఇలా జుగల్‌బందీ చెయ్యడం నేడే చూశాను. జోహార్లు" అన్నది భామ చేతులు పైకెత్తి జోడించి.



అప్పుడర్థమైంది కృష్ణమూర్తికి భార్య కోపానికి కారణం.

మునగకాడ ముదరక ముందే పులుసులో వేసుకోవాలన్నట్లు - భార్య అనుమానం బలపడకముందే తుంచివెయ్యాలనుకుని తేలిగ్గా నవ్వాడు కృష్ణమూర్తి..." హ...హ...హ...హ...అదా.... బాసుకుట్టి పసిపిల్లకదా....దాన్ని కొంచెం హ్యూమర్ చేద్దామని..." సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

కానీ భామ వెంటనే నమ్మలేదు. చపాతీ విసిరింది. అది కృష్ణమూర్తి ప్లేట్లో పడ్డది" లవ్ ఫిఫ్టీ ..లవ్ థర్టీ ..లవ్ ఫార్టీ... " అంటూ చపాతీలు విసిరెయ్యసాగింది.

తప్పించుకునే ప్రయత్నంలో.. "అమ్మో ..అమ్మో...."అన్నాడు కృష్ణమూర్తి నడుముపట్టుకుంటూ.

భామకు కూడా అనుమానం వచ్చింది. భర్త నడుముమీద చెయ్యివేసి "అయ్యెయ్యో..... నిజంగా నడుము పట్టేసిందా? సారీ.... కామెడీ చేస్తున్నారనుకున్నాను" అన్నది ప్రేమగా.

"మరే...ఇంతవరకూ కామెడీ చేసింది నేను" అన్నాడు కృష్ణమూర్తి.-'నేను కాదు నువ్వే' అన్న సౌండ్ వచ్చేలా!

భామ నవ్వుతూ "ఈ పారుళ్ నోడియందు. ఒరు ఫస్ట్‌క్లాస్ మరంజియుండు" అన్నది మళయాళంలో.

"భామా... డోన్టాక్ నాన్సెన్స్" అన్నాడు కృష్ణమూర్తి విసుగ్గా.

"అబ్బ వినండి. దీనికో చిట్కా ఉంది. మా కేరళాబాస్ సంగుణ్ణిమీనన్ నేర్పించారు. నొప్పి చేత్తో తుడిచినట్లు పోతుంది."

"కేరళా వైద్యమా?" అనుమానంగా అన్నాడు కృష్ణమూర్తి. నాటు పద్ధతుల్లో ఎముకలు విరగదీస్తారని భయం వేసింది. ఒంగునే పరిగెత్తసాగాడు. భామ అతన్ని పట్టుకుని వెనకనుంచి ఒక్కసారిగా సెట్ చేసింది.

జండూబామ్‌తో తలనొప్పి చిటికెలో మాయమైనట్లు నడుం నొప్పి మాయమైంది. రిలాక్స్‌డ్‌గా ఫీలయ్యాడు కృష్ణమూర్తి.

"వారెవా! ..క్యాబాత్‌హై.....శభాష్...ఇట్స్‌గాన్.... నొప్పి ఎగిరిపోయింది. థాంక్యు వెరీమచ్"..అంటూ షేక్‌హాండ్ పద్ధతిలో చెయ్యి కలపబోయాడు.

కానీ చేతులు రెండూ స్తంభించినట్లు గ్రహించాడు. జాయింట్లు ఏవో పట్టుకుపోయి చేతులు రెండూ కదలడం లేదు.



అప్పుడు గుర్తొచ్చింది భామకు "ఈ చిట్కాలో ఓ చిక్కుందండోయ్. నడుం విడితే చేతులు పట్టేస్తాయి. మా సంగుణ్ణి గారు వార్నింగిచ్చారు" అన్నది.

పళ్ళుపటపట కొరికాడు కృష్ణమూర్తి. "ఇప్పుడెలా?" అన్నాడు.

"డాక్టరుకు చూపించాల్సిందే" అన్నది భామ.

"యూ..." అంటూ అరిచాడు కోపంగా.



"అందాక నే తినిపిస్తాలెండి. రేపట్నుంచి నేనుండనుగా. మీ బాసుకుట్టి వచ్చి తినిపిస్తుంది".

కృష్ణమూర్తి ఏడుపు ముఖం పెట్టాడు. "నీకీవిధంగా వెనకనుంచి ఎలుగుబంటిలా పట్టుకోవడం, గట్టిగా నొక్కడం ఆ సంగుణ్ణిగాడు ఎలా నేర్పించాడు? నీ మీదే చేసి చూపించాడా? " అన్నాడు కసిని, అసూయని జమిలీగా మిళాయించి.

"నారాయణా.... అంటూ పగలబడి నవ్వింది భామ.

* * *

కృష్ణమూర్తికి పూర్తిగా నయం అయిపోయింది. ఓ ఆదివారం నాడు కృష్ణమూర్తి, భామ ఇద్దరూ నవ్వుకుంటుండగా ఓ కుర్రాడు పరిగెత్తుకుంటూ లోపలకొచ్చాడు. దూరంగా వస్తున్న కొండ్రావు కనిపించాడు.

"అమ్మో.... మాయలపకీరు పరిగెత్తు.. పరిగెత్తు.... దాంకో ...దాంకో...." అంటూ భామను తొందర చేశాడు కృష్ణమూర్తి.

భామ కంగారుగా చూసింది.

"మాయల పకీరంటే యస్వీరంగారావాండీ?" అడిగాడా కుర్రాడు అమాయకంగా.

"కాదు. సాక్షిరంగారావు. పో అవతలకు" అంటూ కసిరాడు కృష్ణమూర్తి.

భామ అక్కడే బావి దగ్గర నిలబడి అటుఇటు చూస్తున్నది .

"నువ్వింకా ఇక్కడే ఉన్నావా? దాంకోమన్నానా?" అరిచాడు కృష్ణమూర్తి.

"దిగనా ? దూకనా? " అన్నది భామ బావి వైపు చూసి. "అమ్మో..ఒద్దు. గొడవలైపోతాయి. ఇప్పుడెలారా దేవుడా..వాడు ఇల్లంతా వెతికేస్తాడే..." అన్నాడు కృష్ణమూర్తి తలబాదు కుంటూ.



"...నేను మీ పక్క వాటాలో కాపురం అని చెప్పండి" చెప్పింది భామ ధీమాగా.

"ఆహా... బ్రిల్లియంట్ బ్రిల్లియంట్ ఐడియా. థాంక్యు థాంక్యు.. చూడు... మీ అమ్మా నువ్వు గట్రా వేరు. నేను, మానాన్న, గట్రావేరు. అల్లుడూ అని నన్ను పిలవద్దని చెప్పు" అన్నాడు భామతో.

కొండ్రావు ఆవేశంగా వచ్చాడు. ఆయనెప్పుడూ హడావిడిగా కనిపిస్తాడు. యజమాని ఆదేశాలను యుద్ధప్రాతిపదిక మీద అమలు చెయ్యడం ఆయన ప్రత్యేకత. పైగా వయసు తెచ్చిన పెద్దరికం వల్ల అందరితోనూ చనువు తీసుకుంటాడు.

"అబ్బాయ్ అర్జుగారూ..." పిలుస్తూలోపలికొచ్చాడు.

"అరె..మీరా.....రండి...నమస్కారం. కూర్చోండి. కూర్చోండి" అంటూ నవ్వు పులుముకుని ఆహ్వానించాడు కృష్ణమూర్తి.

"కూర్చునేందుకు రాలేదు" అన్నాడు కొండ్రావు.

భామ తలుపుచాటున నిలుచుని వీరి మాటలు వింటున్నది. "ఇక్కడ అరేంజ్‌మెంట్స్ ఇన్‌స్పెక్షన్ చెయ్యడానికి కొచ్చాను. "ఓ గంటలో మా యజమానురాలు వసుంధర... అంటే మాకంపెనీ డైరెక్టర్ ఇక్కడికొస్తుంది" అంటూ ప్రకటించాడు.





"ఎందుకూ?" అడిగాడు కృష్ణమూర్తి.

"అవన్నీ అమ్మాయ్ చెబుతుంది. సాయంత్రం నాలుగు దాకా ఇక్కడే ఉంటుంది. భోజనాలు, కాఫీలు, టిఫిన్లు సర్వం ఇక్కడే" కొండ్రావు చెబుతుండగానే కొంతమంది పనివాళ్ళు రకరకాల వస్తువులను మోసుకొస్తున్నారు.

వారివంక అయోమయంగా చూశాడు కృష్ణమూర్తి. "నువ్వేం వండక్కర్లేదు. సమస్తం క్యారేజీల్లో వస్తాయి. నీక్కూడా... అమ్మాయి ఎక్కడ కూర్చుంటుంది? ఈ పెయింటింగు రూమ్ ఒకటేనా? వేరేగది గిది ఉన్నాయా" అని అన్నాడు కొండ్రావు పరిశీలనగా చూస్తూ.

"వెనకా వరండా, ఆ పక్కపెరడూ కూడా ఉన్నాయి. చోటు చాలకపోతే.... " అన్నాడు కృష్ణమూర్తి, వెటకారంగా. "ఏంటా తిక్కమాటలు?" ఉరిమిచూశాడు కొండ్రావు.

"లేకపోతే ఏంటండీ.... మా యింటికి వచ్చి మా మీదే జులుం చేస్తున్నారు. ఏదో గవర్నరు గారు వస్తున్నట్లు...." అన్నాడు కృష్ణమూర్తి కోపంగా.



కొండ్రావు కోపం ఎక్కువైంది. "ఓహో అలాగేం! మా అమ్మాయి మీకు గవర్నరు లాంటిది కాదా? కాదు అను... అను... చూద్దాం" అన్నాడు.

"మీరు అనద్దంటే ఎందుకంటానండీ ? అననండీ" చల్లబడ్డాడు కృష్ణమూర్తి.

"అను...అనకపో.... నాకనవసరం. పెద్దమ్మగారు చెప్పమన్నారు. చెప్పాను. ఇంకో గంటలో వస్తుంది అమ్మాయి" తీవ్రంగా అన్నాడు కొండ్రావు.

"అయితే అర్జెంటుగా రూమ్ రెడీ చేసేస్తాను"

ఇంట్లోకెళ్ళి తలుపేసుకున్నాడు కృష్ణమూర్తి.

కొండ్రావు బయటకొచ్చి పక్కనున్న పోర్షన్లోకి వెళ్ళాడు వరండాలో బట్టలు ఇస్త్రీ చేస్తూ కనిపించింది భామ. అక్కడ ఆమెను చూపి ఆశ్చర్యపోయాడు కొండ్రావు.

"అరె....నువ్వా.. టైపిస్టు భామ...! నువ్వు..నువ్వు...ఇక్కడున్నావేంటి?" ఆశ్చర్యంగా అడిగాడు.

భామకూడా ఆశ్చర్యం నటించి "మీరిక్కడున్నారేంటి?" అన్నది.

"నేనిక్కడలేను. ఉండను. వచ్చాను" అన్నాడు కొండ్రావు.

"నేనూ అంతే...." బదులిచ్చింది భామ.



"ఓహో... హాస్టల్లో కదా నీ బస!" అన్నాడు కొండ్రావు ఇంటర్వ్యూరోజు భామ చెప్పిన సంగతి గుర్తొచ్చి .

"హాస్టల్లో చాకలి బట్టలను చంపేసి, చింపేసి పోగులు పెడుతున్నాడు. ఇది మా చుట్టాలిల్లు. శని, ఆదివారాల్లో ఇక్కడ ఉంటుక్కుంటాను" చెప్పింది భామ - కొండ్రావులాగే అక్షరం, అక్షరంకి అభినయాన్ని అందిస్తూ.

కొండ్రావు ఆశ్చర్యం అధికమైంది. "ఎవరూ? ఆ టింగురంగడు నీకు చుట్టమా?" అన్నాడు నోరు తెరిచి.

(ఇంకావుంది)

గిద్దెడు నెయ్యికోసం....కొంప నొదిలివెళ్ళిపోయిన వాళ్ళెవరన్నా ఉన్నారా?....ఆహ్..ఉన్నారా ?.....ఎందుకు లేరూ!

ఎవర హో'(...పండిత్ భీమ్‌సేన్ జోషి...!!

భీమ్‌సేనుడు...ఆకారంలోనే కాదు..భోజన ప్రియత్వంలో కూడా! ...అంచేత ..కావల్సినంత నెయ్యి కూడా తినలేక పొయ్యాక ఇంకెందుకీ వెధవ బతుకు అని అలాగే...పదకొండో ఏట.. కట్టుబట్టల్తో... (చొక్కా...నిక్కరు) ఇల్లొదిలి ...ఊరొదిలి..రాష్ట్రం వదిలి ..వెళ్ళిపోయాడు.

ఇంత చేస్తే..నెయ్యన్నది సాకు మాత్రమే. భవిష్యత్తులో సంగీత ప్రియులందరికీ తేనె గుమ్మరిద్దాం అన్న పరమేశ్వరాజ్ఞ మేరకు..సంగీత గురువును వెతుక్కుంటూ వెళ్ళిపోయిన అపర తాన్‌సేన్-భీమ్‌సేన్ జోషి....

కర్ణాటక రాష్ట్రంలోని -గదగ్ (చూశారూ..భీముడికీ,గదకీ దగ్గర సంబంధం ఉంది)లో జన్మించాడు భీంసేన్. తల్లి గోదావరీబాయి. సనాతనాచారపరురాలు....చక్కటి భజన్లూ అవీ పాడేది...అంటే నేతితోనే కాకుండా, ఉగ్గుపాలతోటే సంగీతం జోషి కెక్కేసింది....భజన కీర్తనల్లో పాల్గొనటం అలవాటు పడ్డాడు ఆయన.. ఊళ్ళోకి భజన బృందం వస్తే చాలు వాళ్ళ వెంట పడివెళ్ళిపోయేవాడు.

అప్పుడు గోవిందుడి వెంట ఆవుల మంద వెళ్ళిపోతే, ఇప్పుడు..భజన బృందం వెంట వెళ్ళే లేగదూడ భీమ్‌సేన్. అలా ఎక్కడికెళ్ళిపోయేవాడో




తల్లిడిల్లిపోయేది తల్లి...ఓ రాత్రివేళ ఏ పుణ్యాత్ముడో ఇంటి అరుగుమీద దిగబెట్టి చక్కాపోయేవాడు.

తండ్రికేమో కొడుకుని డాక్టర్‌గానో...ఇంజనీరుగానో చూడాలని కోరిక...కానీ కుర్రాడేమో ఊళ్ళో ఎక్కడ గుడున్నా భజన్లు పాడేసి ప్రేక్షకుల్తో పాటు ..పరమేశ్వరుణ్ణీ ముగ్ధుణ్ణి చేసేస్తున్నాడు. ఇక తండ్రికి తప్పక....చెన్నప్ప కురుకోటీ అనే సంగీత విద్వాంసుడికి ఐదురూపాయలు సంభావన ఇచ్చి..శిష్యుడిగా చేర్చాడు.

చెన్నప్ప..వృత్తి రీత్యా రజకుడు. ఉస్తాద్ ఇనాయత్ ఖాన్ గారి శిష్యుడు. ఓ ఏడునెల్లపాటు అక్కడ ప్రాథమిక శిక్షణ అయిపోయాక పండిత్ శ్యామాచార్ వద్ద చేరాడు. శ్యామాచార్ పురోహితులు..గాయకులు.. హార్మోనియం వాద్యనిపుణులు. సంగీత శిక్షణ అద్వితీయంగా సాగుతోంది. ఒకసారి ప్రముఖ సంగీత విద్వాంసుడు 'సవాయి గాంధర్వ' గానం వినీ ఆయన వంటి వారి వద్ద సంగీతం నేర్చుకునీ..ఆయన కన్నా గొప్ప పేరుప్రతిష్టలు తెచ్చుకోవాలనీ నిర్ణయించుకున్నాడు. అదిగో ఆ నిర్ణయమే ....ఇల్లొదిలి దేశాలు పట్టడం!!

రాగి కానీ లేకుండా రైలెక్కేశాడు..వెళ్ళాల్సింది బీజాపూర్ అయితేనేం ..నోట్లో అమోఘమైన విద్య ఉంది కదా..ఒకసారి గొంతు సవరించుకునీ..అఖండ గానం చేసాడు. శ్రోతలకి సంగీతాభ్యంగన స్నానం అయింది..ఊగిపోతున్నారు..రైలుతో పాటు. అంతే... మిఠాయిలు పెట్టేవారు...రొట్టెలు పెట్టేవారు..పాలు ఇచ్చేవారు..పళ్ళు ఇచ్చేవారు..ఒక 'సంచార సంగీతాలయం'.... బీజాపూర్ చేరింది..సరస్వతీదేవి మందహాసం చేసింది!

కొన్నాళ్ళపాటు బీజాపూర్‌లో గురువుని అన్వేషించి ఫలితం లేక ఎవరి సలహా మేరకో..పూనా చేరాడు భీమ్‌సేన్.

పూనాలోని ప్రముఖ సంగీత విద్వాంసుడు కృష్ణారావు పుతంత్రీకర్ భీమ్‌సేన్ గొంతువినీ.. మెచ్చుకునీ.. సంగీతం నేర్పుతా గానీ నెలకి వందరూపాయ లిమ్మన్నాడు..గురుదక్షిణ..సరే! ఆయనే ఉంటే ఈయనెందుకనీ మళ్ళీ రైలెక్కాడు....శారదాంబ ఓరగా చూసింది!!

మళ్ళీ ...వేరే రైలెక్కి...ఓ పాటందుకున్నాడు..సరస్వతీ...రసజ్ఞులే ఉండరు గదా..కొంతమంది టిక్కెట్టు కలెక్టర్లు..మరి కొంతమంది పోలీసులూ ఉంటారు ! అంచేత టిక్కెట్టులేని 'బాల సరస్వతి'ని తీసికెళ్ళి జైల్లో పెట్టారు...ఎక్కడైతేనేం..సందర్భానికి తగ్గట్టు పరవశంగా ఎత్తుకున్నాడు.. రాగం మారొచ్చుగానీ గానం మారదుగా! పోలీసుల్లో గూడా మహా పురుషులుంటారు గాబట్టి..ఓ గ్లాసు లస్సీ ఇచ్చి వదిలేసాడో పోలీసు.

అక్కణ్ణించి గ్వాలియర్..ఎట్లాగోలాగ ఆస్థాన గాయకుడిని కాళ్ళావేళ్ళాపడి..ఓ తంబుర పుచ్చుకుని....అయన్తో పాటు రాజమందిరాలకి వెళ్ళడం మొదలెట్టాడు. ఓసారి రాజావారు ఈ కుర్రాడి తంబుర మీటుకి ముచ్చటపడీ.. దక్షిణ ఓ పదిరూపాయలూ-ఓ కొబ్బరికాయ ఇచ్చారు...నారికేళ పాకానికి వాణి ముచ్చటపడింది..

తర్వాత ఉస్తాద్ హాఫీజ్ ఆలీ వద్ద.. మరువా -పూరియా రాగాల సూక్ష్మ రహస్యాలూ..ఖరగ్‌పూర్‌లోని కేశవ్ ముకుంద్ తభీవర్య.... మరికొన్ని విషయాలూ. కలకత్తాకు చెందిన భీష్మ చటర్జీ వద్ద కొంతకాలం శిష్యరికం తర్వాత పహారీ సన్యాల్ గారి వద్ద..గురుశుశ్రూష...చేస్తూ..కొంత విద్య..

అక్కణ్ణించి జలంధర్ వెళ్ళి మంగత్‌రామ్ ఆర్మీ సంగీత విద్యాలయంలో చేరి 'ద్రుపథ్ - ధమ్మార్' శైలిని సాధన చేయడం ఆరంభించాడు...!

అంటే ఒక సంగీత వటవృక్షం తయారుకాడానికి ఒక సామాన్యుడు

చేసిన ప్రయత్నం, పట్టుదలా..శుశ్రూషా... తల్చుకుంటే ..ఆ మహానుభావుడి పాదాల్ని ముద్దెట్టుకోవాలనిపించదూ!!

చివరగా ఉస్తాద్ మొసాక్ హుస్సేన్ దగ్గర..కట్టెలు కొట్టడం..నీళ్ళు మొయ్యడం,కాళ్ళుపిసకడం ఆఖరికి శోత్రియుడైన భీమ్‌సేన్ జోషి..సంగీతం కోసం గురువుగారికి మాంసం వొండి పెట్టడం.. ఇవన్నీ చేస్తూ ఆరు నెలల పాటు..రోజుకీ పదహారు గంటలు సాధన చేస్తూ 'నట్‌మల్హార్ 'రాగాన్ని సొంతం చేసుకున్నారు.

అంతే! ఆ రాగం ఆకాశవాణిలో ప్రసారం కావడం..మర్నాడు కల్లా.... భీమ్‌సేన్ జోషి పేరు దేశమంతా మారుమ్రోగిపోవడం.



1964..82 మధ్య అయిదుసార్లు విదేశాలలో కచేరీ చేసిన భీమ్‌సేన్‌జోషి ..ఆఫ్ఘనిస్థాన్ ప్రభుత్వ సత్కారం... భారత ప్రభుత్వం నుండి పద్మభూషణ్ సత్కారం మరెన్నో....ఎన్నో.... అవార్డులు..సంపాదించారు..

1965..'రాగ్‌మియామల్హార్' పేర.. భీమ్‌సేన్‌జోషి మీద డచ్ నిర్మాత 25 నిమిషాల డాక్యుమెంటరీ ఫిల్మ్ తీసాడు!!

ఆ మధ్య...దేశసమైక్యత కోసం 'టివీ లో 'మిలేసుర్.... మేరా..తుమ్హారా! గానం చేసి భీమ్‌సేన్ జోషి ..'పాటను ప్రజలంతా ఆసక్తిగానే వింటారు. కానీ మర్నాడే ..లంచాలు పుచ్చుకుంటారు..'అని వేదన చెందుతూ..నెలకొక్కసారైన...భారత యువత .శాస్త్రీయ సంగీతం వింటే... ప్రవర్తనలో మార్పువొస్తుందని ఆశిస్తున్నారు...జోషి!

తథాస్తు ! అంటోంది కమలభవురాణి!!

- తనికెళ్ల భరణి

### పాఠకులకి.....నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 42... మరొక ఎనిమిది వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే...ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన...

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ... మా దగ్గర వారికి సంబంధించినవీ ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువన ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన 8 మంది మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసారి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరుణాళ్,అల్లారఖా.

వీర్ని గురించిన వివరాలను మీరు పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ హాసం,**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**

ఇన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ **తనికెళ్ల భరణి**



కాంపౌండర్ : డాక్టరు గారూ! ఈ మధ్య రోగులు ఎక్కువగా మధ్యాహ్నం వస్తున్నారెందుకు? అర్థం కావడం లేదు నాకు.

డాక్టరు : ఊళ్లో కరెంటు ఉండనిది అప్పడే కదా.

కాంపౌండర్ : దానికీ దీనికీ ఏంటిసంబంధం?

డాక్టరు : అప్పడు టీవి సీరియల్స్, సినిమాలు చూడ్డం కుదరదు కదా! అందుకని.



పెళ్లయి కొత్తగా కాపురం పెట్టిన రాంపండు భార్యతో అన్నాడు "నువ్వు పోయిన నెలలో మీ అమ్మ ద్వారా తెల్సుకొని చేసిన గుత్తివంకాయ కూర విలువ రెండు వందల ఇరవై రూపాయలు"

"అమ్మో ! నిజంగానా? అంత కచ్చితంగా ఎలా చెప్పగలరు ?" అడిగింది కొత్తగా వంట నేర్చుకుంటున్న భార్య.

"ఇదిగో దానికి సంబంధించిన S.T.D బిల్లు"



"నువ్వు రికమండ్ చేసిన డాక్టరు చాలా మొరటుగా మాట్లాడతాడయ్యా!"

"ఏమయిందేమిటి?"

"బ్లడ్ టెస్ట్ చేయించుకోడానికి వెళ్లాను. రక్తంలో కొలెస్ట్రాల్ ఎక్కువుందని సున్నితంగా చెప్పొచ్చుగా?"

"ఎలా చెప్పాడేంటి?"

"నీకు బాగా కొవ్వెక్కిందయ్యా - అన్నాడు."

**ఈ జోకులను పంపించిన వారు: రమణశాస్త్రి,సంగారెడ్డి.**



క్లాసులో మాస్టారు కాసేపు పిల్లల్ని రిలాక్స్ చేయడానికి మధ్యలో పాఠం ఆపి అడిగాడు "పిల్లలూ 50 మైళ్ళ స్పీడుతో ఒక రైలు వస్తుందనుకోండి ! 350 మీటర్ల పొడవుతో ఆ ఊరి రైల్వేస్టేషను ప్లాట్‌ఫాం ఉందనుకోండి ! అలాంటప్పడు నా వయసు ఖచ్చితంగా ఎంతుంటుందో లెక్కేసి చెప్పగల్రా ఎవరన్నా?"

"నలభై ఏళ్ళ సార్" ఠక్కున బదులిచ్చాడు గోపి.

"కరెక్టు... ఇంత ఖచ్చితంగా ఎలా చెప్పగలిగావురా?" అడిగాడు మాస్టారు గోపీని ఆశ్చర్యంగా .

"దాన్దేముంది సార్! మా ఇంటెదురుగ్గా సగం పిచ్చోడొకడున్నాడు. వాడికి ఇరవయ్యేళ్ళు" తడుముకోకుండా జవాబిచ్చాడు గోపి.



" సరోజా ఇక లాభంలేదు. ఈరోజు రాత్రి సరిగ్గా రెండు గంటలకి మనం ఈ ఊరు విడిచి పారిపోవాలి."

"సరే మాధవ్ ! అలాగే చేద్దాం!"

"ఖచ్చితంగా ఆ టైముకి నువు రెడీగా ఉండు. నేను రాగానే పారిపోదాం...."

"నువ్వేమి బెంగపెట్టుకోకు మాధవ్ ! మా నాన్న నిన్ననే లగేజీ ప్యాక్ చేసి పెట్టాడు."



కొడుకుని రూములోకి లాక్కెళ్ళి చితక బాదుతున్నాడు చిదంబరం.

"అయ్యో అయ్యో! ఎందుకండీ వాణ్ణలా ఏ కారణం లేకుండా చావ బాదుతున్నారు" అడ్డు పడింది అలివేలు.

"ఎందుకేమిటి ! వారం రోజులు నాకు టూరు ప్రోగ్రాం వేసాడే మా ఆఫీసరు" అన్నాడు చిదంబరం.

"దానికి ఆ పిల్ల వెధవనెందుకు తంతున్నారండీ పుట్‌బాల్ లాగా " అంది అలివేలు

"మరి వాడి పరీక్ష రిజల్ట్ వచ్చేది నా టూర్ టైమ్ లోనే కదే !" బదులిచ్చాడు చిదంబరం.



"ఈమధ్య ఒకరోజు సింహంతో నాకో భేటీ జరిగిందోయ్" అన్నాడో కోతల్రాయుడు మీసాలు మెలేస్తూ...

"అలాగా... ఏమయిందీ? ఎలాగైందీ ! ?" ఆత్రంగా అడిగాడు అమాయక రావు.

"ఏముందీ దాని కళ్ళలోకి సూటిగా చూసా.... అది గుర్రు మంది.... తల తిప్పకోమని వార్నింగిచ్చా...అయినా మాట విన్లా...మళ్ళీ గుర్రుమంది"

"అప్పడేం చేసావ్?" అడిగాడు అమాయకరావు.

"ఆ...ఏం చేస్తాం..దాని మానాన దాన్నొదిలేసి పక్క బోను వైపు వెళ్ళి పోయా" అన్నాడు కోతల్రాయుడు 'జూ'లో తన అనుభవాల్ని ఎగ్జాజిరేట్ చేసి చెప్తూ.

**ఈ జోకులను పంపించిన వారు: పి. నాగరాజు,జానకంపేట, నిజామాబాద్**

## హ్యూమర్ బాక్స్



ఒక పత్రికా విలేఖరి ఒక మహిళామణిని ఇంటర్వ్యూ చేస్తూ "మీ భర్త పేరు చెప్పండి" అని అడిగాడు.
మహిళామణి విరుచుకుపడింది.
"నీకు బుద్ధుందా లేదా ?భారత స్త్రీ ఎక్కడైనా తననోటితో తన మొగుడి పేరు చెబుతుందా?"
పత్రికా విలేఖరి ఖంగుతిన్నాడు.
"క్షమించండి ! పొరపాటయిపోయింది. మీ పేరు చెప్పండి"
"కామేశ్వరీ రంగనాథ్"



"ఏమండోయ్ ! గుండుకొట్టించారు తిరుపతి పోయి వచ్చారా?"
"మా నాన్నగారు పోయారండీ"
"మీరు భలేవారండీ! మీ నాయన గారు తిరుపతి పోయెస్తే మీరు గుండు కొట్టించుకోవడమెందుకూ?అందుకు బాధపడడమెందుకూ.."



"ఇంటి పేరుతో సొంతపేరు మ్యాచ్ అయ్యేలా పెట్టుకోవడం ఓ కళ. నా వరకు మా పెద్దవాళ్ళు ఆ జాగ్రత్త ముందే తీసుకున్నారు"
"అలాగా మీ పేరేమిటండీ?"
"కుంపట్ల సూర్యభగవాన్. చూశారా రెండు మండి పోయేవే కనుక ఎలా మ్యాచ్ అయ్యాయో"
"ఇదెక్కడి మ్యాచింగండీ... అసలు సూర్య భగవానుడి ముందు కుంపట్లెందుకండీ బాబూ..!?"

**ఈ జోకులను పంపించిన వారు: యన్.బి.కె.ఆర్.ఐ.యస్. టి,విద్యానగర్.**

"ఈ భూమండలం చుట్టూ ఒక్కసారి ఎవరు వేగంగా తిరిగొస్తారో వారికే నాయకత్వం ఇస్తాను" అన్నాడు శివుడు, వినాయకుడిని, కుమారస్వామిని చూస్తూ..



కాస్సేపు ఆలోచించిన కుమారస్వామి అమెరికానుండి అర్జంటుగా ఓ రాకెట్ తెప్పించుకుని ప్రయాణం ప్రారంభించాడు.
తీరా తిరిగొచ్చేసరికి వినాయకుడు.. గణ నాయకుడయ్యాడు.. "అన్నగారూ... మీకీ ఆధిపత్యం ఎలా వచ్చింది?" అని అడిగాడు కూమారస్వామి తేరుకుంటూ..
"ఆఁ ...ఏంలేదు...అదిగో ఆ కంప్యూటర్ చుట్టూ ఓసారి తిరిగేశాను... దానికి ఇంటర్నెట్ కనెక్షన్ ఉందికదా... అలా గెలిచేశా..." అన్నాడు వినాయకుడు నవ్వుతూ.



ప్రయాణం పూర్తయ్యాక రైలు దిగేందుకు ముందు, ఒకాయన వంక చూస్తూ నోరెళ్ళబెట్టిన బామ్మగార్ని చూసి... "ఏమిటే బామ్మా ఆలోచిస్తున్నావ్".. అన్నాడు సుబ్బారావ్.
"ఏం లేదురా అబ్బీ... పదేళ్ళ కిందట... నీళ్ళు మిగిలితే వొంపేసి, చెంబు ఇంటికి తెచ్చుకునే వాళ్ళం... ఆయన చూడు మిగిలిపోయిన నీళ్ళు తాగేసి బాటిల్ బయట పడేస్తున్నాడు" అంటూ బుగ్గలు నొక్కుకుంది బామ్మగారు.

చేసిన అప్పులు తీర్చలేక... ఆత్మహత్య చేసేసుకున్నాడు అప్పారావు. "హమ్మయ్య... ఇంక అప్పుల వాళ్ళెవరూ వెంటపడరు.." అనుకొంటూ నరకం వేపు నడుస్తూంటే .. "ఇదిగో ...నా బాకీ సంగతేంజేశావ్" అంటూ పిలిచాడు సుబ్బారావ్ వెనుకనుండి.




"ఇదేంటీ..నేను చచ్చిపోయాగా" అన్నాడు అప్పారావ్.
"నా బాకీ తీర్చకుండా నువ్వు చచ్చిపోయావన్న వార్తవిని నా గుండె ఆగిపోయింది...నీ వెనకాలే వచ్చేశా.."అన్నాడు సుబ్బారావ్.

**ఈజోకులనుపంపించినవారు:గరిమెళ్ళ నాగేశ్వరరావు,కొమ్మావి**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన రమణశాస్త్రి, సంగారెడ్డి, పి. నాగరాజు, జానకంపేట, నిజామాబాద్,యన్.బి.కె.ఆర్.ఐ.యస్. టి, విద్యానగర్, గరిమెళ్ళ నాగేశ్వరరావు,కొమ్మావి గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' రీమిక్స్ పాటల ఆడియో సి.డి.నిబహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.



తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 7



- ఇంద్రగంటి జానకీబాల



# చక్కదనాల రాణి సి.కృష్ణవేణి

1936లో 'అనసూయ,' 'ధ్రువ' అనే జంట కథల సినిమా వచ్చినప్పుడు, అందులో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను చంటి పాపలుగా జేసి వుయ్యాలలో వేసి ఊపి,ఒళ్ళో లాలిం చిన పాత్రలో పన్నెండేళ్ళ చిన్నది అందర్నీ ఆకట్టుకుంది. ప్రత్యేకం 'అనసూయ' పిల్లలతో తియ్యాలని దర్శకులు సి. పుల్లయ్య నిర్ణయించుకున్నప్పుడు రాజమండ్రి సొంత వూరుగా వున్న చిత్తజల్లు కృష్ణవేణి ఆయన దృష్టినాకర్షించింది. ఆమెను మద్రాసు పిలిపించారు. ఆమె ఆ చిత్రంలో చక్కగా నటించి పేరు తెచ్చుకుంది.

రాజమండ్రిలో చదువుకుంటూ స్కూలు నాటకాల్లో మంచి మంచి బహుమతులు సంపాదించుకుంటూ నట జీవితానికి పునాదులేసుకున్నారు కృష్ణవేణి. 'తులాభారం' నాటకంలో కృష్ణవేణి నటన చూసి, ఆమెను 'అనసూయ 'కోసం పిలిపించుకున్నారు. కానీ శృంగారం నటించడానికి చాలా చిన్న వయసు. అయినా పుల్లయ్యగారు చెప్పినట్టుగా చేసి, రక్తి కట్టించిన దిట్ట కృష్ణవేణి.

'అనసూయ' తర్వాత రాజమండ్రి వచ్చేశారు కృష్ణవేణి. నాటకాల్లో నటిస్తూ కాలం గడుపుతున్న ఆమెకి తండ్రి మరణం ఒక దెబ్బయింది. అమ్మమ్మ,బాబయ్యల దగ్గర వుండగా 'తుకారాం' చిత్రంలో నటించే అవకాశం వచ్చింది.

నెమ్మదిగా 'కచదేవయాని', 'కాళిదాసు' మొదలైన సినిమాల్లో నటించి,మంచి నటిగా శ్రుతిపక్వమున్న గాయనిగా అందరి మన్ననలు పొందారు.

1938లో 'కచదేవయాని'లో చిన్న వయస్సులోనే నటనలోని మెలకువలు గ్రహించుకుని దేవయానిగా చక్కగా నటించి, అందర్నీ మెప్పించారు. అటు తమిళంలో ఇటు తెలుగులో సమానంగా నటిస్తూ, మంచి పేరు సంపాదించుకున్నారు. 'మహానంద' సినిమా తయారవుతున్న రోజుల్లో (1938-39) ఈమెకు మీర్జాపురం రాజావారితో పరిచయమై అది పరిణయంగా మారింది. రాజాగారిని వివాహమాడి, ఆయన అర్ధాంగై ఆయనకున్న శోభనాచల స్టూడియోకి మాత్రమే అంకితమై పోయారు కృష్ణవేణి.

ఆమెకి అప్పట్లో ఎన్నో అవకాశాలు వచ్చాయి. మంచి కథ దొరికిన వెంటనే ముందుగా ఆమెను సంప్రదించేవారట సినిమా పెద్దలు.

"ప్రతీ మంచి స్క్రిప్ట్ నా దగ్గరకొచ్చేది. బి.ఎన్.గారు, కెవి.గారు కూడా నన్ను అడిగేవారు. నువ్వు చెయ్యమ్మా, చేస్తే బాగుంటుంది అనేవారు. కానీ నాకు బయట కంపెనీల్లో చేయడానికి రాజాగారి అనుమతి వుండేది కాదు" అంటారామె.

"నేనెప్పుడూ శోభనాచలవారు చేసిన సినిమాలు తప్పవేరే సినిమాలు చెయ్యలేదు. ఆ స్టూడియో దాటి నేను అడుగు బయట పెట్టలేదు. మా శోభనాచల స్టూడియోకి, ఇంటికీ మధ్య తిరుగుతూండేదాన్ని" అంటున్నప్పుడు ఆమె గొంతులో బాధ, దాచినా దాగకుండా వలుకుతుంది. బయటవారికి 'కాదావల్లి'(తమిళం) చేసింది.

'కీలుగుర్రం' తీస్తున్నప్పుడు కృష్ణవేణిని, అంజలీదేవి పోషించిన పాత్ర వేయమని అడిగారట. కథ మళ్ళీ మామూలే. ఆపాత్ర అంజలీదేవికి వెళ్ళింది. అప్పుడు అంజలి ఈమెని కలిసి మాట్లాడారు.

"అక్కా ! ఇంత దుష్టపాత్ర వేస్తే, నాకుండే ఇమేజ్ పోతుందేమో" అంటూ భయం వ్యక్తపరచారుట అంజలి.

"లేదమ్మా ! అది నటనా శక్తిని నిరూపించు

కోగల పాత్ర. ఏ పాత్ర పోషించినా అందులో లీనమై అదే నువ్వుగా మారిపోవాలి. అప్పుడా పాత్ర జీవిస్తుంది. ప్రేక్షకులు అలాంటి పాత్రను, నటనను గుర్తిస్తారు. ఈ పాత్ర తీసుకో-బాగా చెయ్యి. నీకు మంచి పేరొస్తుంది" అని చెప్పారు కృష్ణవేణి.

అప్పుడు అంజమ్మగా చనువుగా పిలువబడే అంజలీదేవి కీలుగుర్రంలో తనకి పాటలు ప్లేబ్యాక్ పాడమని కోరారు.

"అక్కా! నువ్వు నాకు పాటలు పాడు. నేనా పాత్ర తీసుకుని నటిస్తాను" అంది.

"నేను ఆమెకు రెండు పాటలు పాడాను. అందులో అంజలికీ ఎంతో పేరొచ్చింది'' అన్నారామె.

'లక్ష్మమ్మ'లో కృష్ణవేణి పరమసాధ్విగా, భర్త నిరాదరణకుగురై,అత్త, ఆడబిడ్డల ఆరడులు భరిచి అమాయకురాలిగా,అష్టకష్టాలు పడే పాత్రను ఎంతో గొప్పగా పోషించారు. కంటనీరు పెట్టించారు.

అదే కృష్ణవేణి 'తిరుగుబాటు'లో వేంప్‌గా (ఇదీ బయటి చిత్రమే)దర్శనమిచ్చారు.

తను నటిగా, గాయకురాలుగా, స్టూడియో నిర్వహణాధికారిణిగా, తనకున్న శక్తి సామర్థ్యాల ను నిరూపించుకున్నారు. ఎక్కడ చక్కని ప్రతిభ, కళ, నటన వున్నా గ్రహించగలిగే నేర్పు, వారికి అవకాశం యిచ్చి ప్రోత్సహించగల విశాల హృదయం ఆమెకున్నాయని చెప్పాలి.

తెలుగువారికి సాటిలేని మేటి నటుడిగా, తెలుగు సినిమా పరిశ్రమనేలిన నందమూరి తారక రామారావుని తెరకి పరిచయం చేసింది ఆమె తీసిన 'మనదేశం'. ఘంటసాలకి, రమేశ్‌నాయుడికి సంగీత దర్శకత్వానికి అవకాశం యిచ్చింది ఈమే. తెలుగువారిని తన గాన మాధుర్యంతో ఉర్రూతలూగించిన పి.లీలను కూడా పరిచయం చేసింది శోభనాచల వారే. అంటే కృష్ణవేణి.

మిర్జాపూర్ రాజావారి భార్యగా ఆమె ఆయన నిర్మించిన చిత్రాలను మాత్రమే చేశారు. తనకున్న ప్రతిభను మరింతగా నిరూపించుకోవాలని ప్రయత్నించలేదు. ఆమె మొత్తం చేసినవి 17 సినిమాలు మాత్రమే.

చిత్తజిల్లు కృష్ణవేణి 1924డిసెంబరు 24న పుట్టారు. ఇప్పుడామెను చూస్తే, వృద్ధాప్యపుఛ్ఛాయలుంటే వుండవచ్చుగానీ, ఎంతో కళతో చక్కగా వుంటుంది. దానికి కారణం ఆమె సౌమ్యంగా మాట్లాడే తీరు, ఎదుటివారికిచ్చే గౌరవ మర్యాదలేనేమో అనిపించకమానదు.

1949లో 'మనదేశం'సినిమా తీశారు. స్వాతంత్ర్య ఉద్యమకాలం నేపథ్యంగా కథ నడుస్తుంది. అందులో హీరో నారాయణరావు. అందులో ఎమ్.ఎస్.రామారావుతో కలిసి 'చలో చలో రాజా' అనే పాట హుషారుగా వుంటుంది. అలాగే 'ఏమిటో ఈ అనుబంధం -ఎందుకో ఈ బంధం' పాట కూడ చక్కగా వుంటుంది.

'లక్ష్మమ్మ కథ' (1950)

**ఊగాలోయ్ ఉయ్యాలా**
**చందమామతో - చుక్కలతో**
**అందాల పోటీ చెయ్యాలోయ్**
...............
ఏమనీ..ఏమేమనీ...
**నా హృది లోపల కోరిక ఏదో**
**నాట్యము సేయు తీయని పాటై...**

అలాగే ఎమ్.ఎస్.రామారావుతో కలిసి పాడిన యుగళగీతం.

**ఊయల ఊపనా -సఖీ**
**తీయగ పాడనా - ఈ**
**ఊయల ఊపగా- ఊగనా..**

అనే పాటలు అప్పట్లో బాగానే వున్నప్పటికీ మరీ పాప్యులరై, చిరస్థాయిగా నిలిచిపోలేదు. పేరంటాలు (1951)లో పాటలు కూడా బాగా ప్రజాదరణ పొందలేదు. సినిమా బాగా పోకపోవడం వల్ల చాలామందికి ఆ పాటలు తెలియనే తెలియవు.

''నేను చెయ్యగలిగినన్ని సినిమాలు చెయ్యలేదు, పాడగలిగినన్ని పాటలు పాడలేదు. కారణం..చెప్పాను కదా '' అంటూ బాధగా నవ్వుతారామె.

ఆమె మొత్తం పదిహేడు చిత్రాలు మాత్రమే చేశారన్నప్పుడు ఆమె మీద, ఆమె కెరీర్ మీద ఎంత ఒత్తిడి, నిఘా వుందో అర్థమవుతుంది.

ఆమెకి చిత్ర పటాలంటే ఎంతో యిష్టం. కళాత్మకమైన పెయింటింగ్స్‌ని ఆమె ఎంతో అపురూపంగా అమర్చుకున్నారు. అందులో కౌతా రామమోహన్, దామెర్ల రామారావు, దేవీప్రసాద్‌రాయ్ చౌదరి. రంజిత్ సింగ్ వంటి గొప్ప గొప్ప పెయింటర్స్ గీసిన కళాఖండాలు కనిపిస్తాయి. వాటినన్నిటినీ ఎంతో అపురూపంగా యింట్లో అలంకరించుకుని చూసుకుంటారామె.

''ఈ పెయింటింగ్స్ ఎంతో యిష్టంతో సంపాదించుకున్నాను. వీటిని ముందు ముందు మెయిన్‌టేన్ చెయ్యగలనో లేదో'' అంటారామె.

1952 తర్వాత దాదాపు ఆమె నటించటం మానేశారు. ఆమె అంజలీదేవికి ప్లేబ్యాక్ పాడటమే కాకుండా 1952లో తను చేసిన 'సాహసం' సినిమాలో తన గొంతు పలకడం మీద అసంతృప్తి కలిగి ఆర్.బాలసరస్వతీదేవి చేత ప్లేబ్యాక్ పాడించుకున్నారు. అంటే 'తను' అనే మాట కాకుండా అక్కడ పాట బాగుండాలని ఆమె భావించారు. ఆమె వ్యక్తికంటే 'కళ' ముఖ్యంగా భావించారనిపిస్తుంది.

ఆమె సినిమాలు మానుకున్నాక 'సక్కుబాయి' నాటకంతో ఆంధ్రదేశమంతా తిరిగి కళ కళ కోసమే అని నిరూపించారు. "కథానాయిక మొల్ల సినిమాగా తియ్యాలనీ, ఆ పాత్ర నేను ధరించాలనీ నాకు చాల ఆశగా, యిష్టంగా వుడేది. ఎన్నాళ్ళో ఆ స్క్రిప్ట్ నా దగ్గరే పెట్టుకున్నాను. కానీ ..కాలం కలిసిరాలేదు. చివరికది పద్మనాభం గారు సినిమాగా తీశారు. కొన్ని సినిమాలు ఎంత ప్రయత్నించినా తీయడం సాధ్యపడదు" అన్నారామె ఎన్నో కబుర్లు చెప్తూ.

"నా సినిమాలు 'లేడీ డాక్టర్' -గుడ్ ఈవినింగ్' లాంటివి మధ్యలోనే ఆగిపోవడం కూడా జరిగింది. అనుకున్న ఆలోచనలన్నీ కార్యరూపం దాల్చవు".

ఆమె కూతురు, అల్లుడు సినీ నిర్మాతలుగా ఎన్నో సినిమాలు తీశారు. వారికి మొదట్లో ఆమె అండగా నిలిచి సాధక బాధకాలనెరిగించారు. తాను తీసిన 'దాంపత్యం'(1957)చిత్రం ద్వారా రమేష్‌నాయుడిని సంగీత దర్శకులుగా పరిచయం చేశారు. ఎందరో కళాకారుల్ని చిత్ర పరిశ్రమకి పరిచయం చేసిన ఘనత సి. కృష్ణవేణికి దక్కుతుంది.

**చిత్రం : మనదేశం(1949)**
**రచన : సముద్రాల రాఘవాచార్య**
**గానం : సి.కృష్ణవేణి**
**సంగీతం : ఘంటసాల**

ఇది వెరపో..మతిమరుపో
ఏలనో -మనోవ్యధా
తెలివితేటలు మలగిపోయి మూగవారిపోవగా
గతమేమో చెడుకలగా
బ్రతుకుగతే మారెనా॥ఏలనో॥
రూపు వేరాయె - చూపు మారె పలుకు లేనేలేదే
గెలుపు నాసించు మా జాతి
జయపతాక జారిపోవునా
కదనసీమ కెదురుపోయి ॥ఏలనో॥
తలమోసీ కనిన మహో
ఫలమిదేనా -ఇదేనా
ఇది వెరపో - మతిమరపో
ఏలనో మనోవ్యధా

ఆమె నటించిన 'గొల్లభామ', తిరుగుబాటు', 'మనదేశం', 'సాహసం','లక్ష్మమ్మ'అప్పట్లో అందర్నీ అలరించాయి. ఆమె చాలా నిరాడంబరంగా వుండేవారట. ఎప్పుడూ లేత గులాబీరంగు చీరలు ఎక్కువగా ధరించేవారట. మనిషి సౌమ్యంగా, చిరునవ్వుతో ఎదుటివారిని ప్రేమగా పలకరించే తీరు చూస్తే ఆమె వ్యక్తిత్వం అర్థమవుతుంది. ■

# 'హాసం' క్లబ్

## రాజమండ్రి

జూన్ 20 సాయంత్రం శ్రీ అప్పారావు గారింటి ప్రాంగణంలో జరిగిన 'హాసం క్లబ్' 4వ కార్యక్రమం కృష్ణారావుగారి హాస్యప్రియుడైన గణపతి ప్రార్థనతో ప్రారంభమై చి॥మాధురి ప్యారడీ పాటతో ముందుకు సాగింది. ఆమె పాడిన 'అట్టేమో పెనంమీంచి రానన్నదీ - అట్లకాడేమో వంకరలు పోతున్నదీ' ('రాముడు-భీముడు'లోని పాటకు ప్యారడీ) ఆమె తల్లి వ్రాసినదే! కన్వీనర్లలో ఒకరైన హనుమంతరావు 'చల్దికన్న ఊరుగాయ ఘనము' అన్న సామెతకు భారతపరంగా చమత్కారమైన అర్థాన్ని వివరించడంతో బాటు 'హాసప్రపంచం పిలిచింది' అనే గీతం వ్రాసి వినిపించారు. జిత్‌మోహన్‌మిత్ర 'ప్రేమలేఖలు' (రాజ్‌కపూర్), 'దేవదాసు' నుండి పల్లవులు పాడుతూ వాటి మాధుర్యాన్ని, ఆర్ద్రతనూ హృద్యంగా వివరించారు. మాటూరు రంగారావు 'ప్రేమలేఖలు' పాటల్లోని అనువాద విశిష్టతను వివరించారు. 'చార్ దిన్‌కీ కహానీ'ను 'మూడునాళ్ల ముచ్చట' అంటూ తెలుగునుడికారంతో వాడారనీ, 'పందిట్లో పెళ్లవుతున్నాదీ' విషాదగీతమైనా సరేనని పెళ్లిపందిళ్లలో వేసేవారనీ చెప్పారు. కృష్ణమాచారి పాతపాటల పల్లవులు పాడుతూ అనేక విశేషాలు ప్రస్తావించారు.

జూన్ 28న పుట్టినరోజు జరుపుకుంటున్న ముళ్లపూడి వెంకటరమణ జీవితవిశేషాలను కన్వీనర్లలో ఒకరైన అప్పారావు వివరించారు. జూన్ 4 న జన్మదినోత్సవం జరువుకుంటున్న ఎస్.పి.బాలును అభినందిస్తూ కృష్ణారావు 'మెరిసే తారల దే రూపం - విరిసే నవ్వుల దే రూపం' (సిరివెన్నెల) పాడి వినిపించారు. వీరికేకాక జూన్‌లో పుట్టినరోజు పండుగలు జరుపుకుంటున్న ఇళయరాజా, భాస్కరభట్ల రవికుమార్‌లకు కూడా సభ శుభాకాంక్షలు తెలిపింది.

వ్యాపారాన్ని వృత్తిగా, వైదికగణితం ప్రవృత్తిగా చేనుకున్న గమిని రంగయ్య వైదికగణిత అంశాలను బాలలకు ఆసక్తికరంగా వివరించారు. దువ్వూరి ఉషా కిరణ్మయి 'ఏడే అల్లరి వనమాలీ' అన్నమాచార్య కీర్తన పాడగా, జోరాశర్మ కార్టూన్ కవితలు వినిపించగా, శ్రీపాద



'హాసం క్లబ్' ప్రారంభించినదాది పేరడీ పాటలతో అలరిస్తున్న బేబీ మాధురి

## చిట్కాలు

### స్కిట్

**టీవీ యాంకర్ సీత :** నమస్కారమండీ పద్మగారూ! మా వి ఛానెల్ ప్రేక్షకుల తరపున మీకు స్వాగతం. వి ఫర్ విమెన్ అని మీకు తెలుసుగా. ఆడవాళ్లకు ఉపయోగపడే మంచి చిట్కాలు కొన్ని చెప్తారని ఆశించవచ్చా?

**పద్మ :** తప్పకుండానండీ, ముందుగా ఇత్తడి సామానులు, వంటగిన్నెలు ఎలా తోముకోవాలో చెప్తాను.

**సీత :** నిజమేనండి - మహిళలకు ఇది చాలా అవసరం కూడాను. ఈ మధ్య పనిమనుషులు తరచు ఏదో వంకపెట్టి మానేస్తున్నారు. భర్తలు కూడా అప్పుడప్పుడు మొండికేస్తున్నారు. ఈతరం మహిళలకు కరాటేతోబాటు గిన్నెలు తోమడం కూడా.. (చెప్పుకు పోతూంటుంది)

**పద్మ :** (అడ్డువస్తూ) దీనికి యేమేమి వస్తువులు కావాలో చెప్పమంటారా?

**సీత :** (సర్దుకుని) చెప్పండి, చెప్పండి

**పద్మ :** ముందుగా ఒక అరకేజీ కొబ్బరిపీచూ

**సీత :** కొబ్బరి అరకేజీ - పీచు అరకేజీ..

**పద్మ :** కొబ్బరి అక్కరలేదండీ, కొబ్బరికాయమీది పీచు చాలు. అది అరకేజీ తెచ్చుకుని కాస్త నీళ్లు చిలకరించి ఉంచుకోవాలి. పొడిగా ఉందనుకోండి, ముక్కలు ముక్కలుగా గాలిలో ఎగిరి ఇల్లంతా పడుతుంది..

**సీత :** కరక్టుగా చెప్పారండి. అప్పుడు ఇల్లంతా తుడుచుకోవాలి. అసలే ఈ మధ్య పనిమనుషులు తరచు ఏదో వంకపెట్టి మానేస్తున్నారు. భర్తలు కూడా అప్పుడప్పుడు మొండికేస్తు...

**పద్మ :** (సీతమాటలు పట్టించుకోకుండా) తర్వాత రెండు కేజీల చింతపండు - ఇటుకలు రెండు (ఎఫెక్టుకోసం ఆగి జుట్టు సవరించుకుంటుంది)

**సీత :** (అవకాశాన్ని దొరకబుచ్చుకుని) ఇటుకలు అలాగే వాడితే బాగుండదేమోనండి. ఎర్రగా కాలిన ఇటుకలను ఏరుకుని తెచ్చుకుని మిక్సీలో గానీ, గ్రైండరులో కానీ మెత్తగా పొడి చేసుకుని ఓ పక్కన పెట్టుకోవాలి. అంతే కదండీ, పద్మగారూ?

**పద్మ :** (కొరకొర చూస్తూ) అంతే (గబగబా) మరి తోమాలంటే పాత్రలు కూడా ఉండాలిగా, కిలుమెక్కిన రెండు దీపపు సెమ్మెలు - ఇవి దేవుడి గూట్లో రెడీగా దొరుకుతాయి- బాగా నల్లగా మాడిన రెండు మూకిళ్లు - పనిమనిషి ఒకపూట రాకపోయినా ఇవి అమిరిపోతాయి, బాగా పక్కులు పట్టిన అన్నపుగిన్నె - పాలు అడుగంటిన ఇత్తడి గిన్నె! వీటితో బాటు పాలిష్ క్లాతు, మెటల్ పాలిష్ డబ్బా ఒకటి..

**సీత :** (తప్పు పట్టుకున్నట్టు) గిన్నెలు మొత్తం ఎన్నో చెప్పారు కారు

**పద్మ :** చెప్పానుగా - మన దగ్గరున్న చింతపండుకి సరిపడా సేకరించాలి. మొదట గిన్నెలన్నీ బాగా తడిపి పెట్టుకోవాలి. చింతపండు కూడా తడిపి ఆ గిన్నెలమీద బాగా రాయాలి. తర్వాత గ్రైండు చేసిన ఇటుకపొడుం దానిమీద నొక్కి రాయాలి. అలా ఒక అయిదు నిమిషాలు అంటే మనం సీరియల్స్‌లో యాడ్ వచ్చినంత సేపు అలాగే వుంచి ఆ తర్వాత టాప్ నీళ్లతో బాగా కడగాలి.

**సీత :** టాప్‌నీళ్లు రానప్పుడు ఏం చేయాలండి? ఎందుకంటే పనిమనిషి ఉంటే వీధికుళాయినుండి తెస్తుంది. కానీ ఈ మధ్య పనిమనుషులు తరచు ఏదో వంకపెట్టి మానేస్తున్నారు. భర్తలు కూడా అప్పుడప్పుడు మొండికేస్తు...

**పద్మ :** ...టాప్ నీళ్లు లేకపోతే మినరల్ వాటర్ వాడవచ్చు. నిజం చెప్పాలంటే అసలు మినరల్ వాటర్ అయితేనే మంచి ఫలితాలను ఆశించవచ్చు.

**సీత :** మరి పాలిష్‌క్లాతు మెటల్ పాలిష్..అవెందుకు?

**పద్మ :** ఇంతచేసినా మురికి పోలేదనిపిస్తే మెత్తటి పాలిష్ క్లాతుతో తుడిచి - బాగా మెటల్ పాలిష్ పట్టించండి. మీ ఆయనగార్ని పిలిచి మెత్తటి బట్టతో గట్టిగా రుద్దమనండి. గిన్నెలు తళతళా మెరుస్తాయి.

**సీత :** చాలా బాగా చెప్పారండి, చిన్న బ్రేక్ తర్వాత ఇంకో చిట్కా చెబుదారు గాని..

రచన - డి.వి.హనుమంతరావు

పద్మ, డి.విజయలక్ష్మి 'చిట్కాలు' స్కిట్ ప్రదర్శించారు. వీరితోబాటు రమణమూర్తి, శివప్రసాద్, రవికాంత్, రాధాకృష్ణప్రసాద్, శ్రీనివాస్, సత్యబాబు, అవధాని, వీర్రాజు, రాయుడు, వేంకటేశ్వరరావు, రమణశ్రీ, మాధురి చక్కటి జోక్స్ వినిపించారు. సుభద్రమ్మ అనే 70 యేళ్ల మహిళ కూడా జోకు చెప్పి అందర్నీ నవ్వించడం విశేషం. ఆడవాళ్ల సుదీర్ఘ టెలిఫోన్ సంభాషణల గురించి హనుమంతరావు దంపతులు సమర్పించిన స్కిట్ ప్రేక్షకులను నవ్వులతో ముంచెత్తింది. విజయలక్ష్మి, మాధురిలకు 'హాసం క్లబ్' బహుమతులు ప్రదానం చేయబడ్డాయి.

జూలై నెల కార్యక్రమం జూలై 18 ఆదివారం సాయంత్రం 6 గంIIలకు శ్రీ అప్పారావు గారింటి ఆవరణలోనే నిర్వహించబడుతుందని తెలియజేశారు. స్థానిక సిటీఛానెల్‌లో ఈ కార్యక్రమ విశేషాలు ప్రసారం చేశారు.



'ప్రేమలేఖలు' పాటలను విశ్లేషిస్తున్న మాటూరి రంగారావు

## విశాఖపట్టణం

విశాఖపట్టణం జిల్లా కేంద్ర గ్రంథాలయంలో జూన్ 20 సాయంత్రం జరిగిన 'హాసం క్లబ్' తృతీయ కార్యక్రమం ప్యారడీ పాటలకు పెద్దపీట వేయడం జరిగింది. ప్రఖ్యాత రచయిత, విమర్శకుడు, నటుడు గొల్లపూడి మారుతీరావు సభలో ప్రియ అతిథిగా పాల్గొనడం ఒక హైలైట్ కాగా, రాగతి పండరి కార్టూన్ ప్రదర్శన మరొక హైలైట్. కన్వీనర్లలో ఒకరైన టి.యల్.ప్రసాద్ సభను నిర్వహిస్తూ విడిగానూ, ఇతరులతోనూ కలిసి అనేక పేరడీపాటలు పాడగా, మరొక కన్వీనరు మస్తాన్ రెడ్డి కార్యక్రమం ఆద్యంతమూ చెణుకులతో, జోక్స్‌తో సభను ఆకట్టుకున్నారు. వి.రామ్‌కుమార్ కిశోర్‌కుమార్, రఫీల గాత్రవైవిధ్యాన్ని సోదాహరణంగా వివరించారు. భానోజీరావు, పి.సిహెచ్.నాయుడు స్కిట్‌తో, ఖాజా మిమిక్రీ ప్రదర్శించగా డాII రాగతి రమ హాస్యకవిత వినిపించారు. చిII జగదీశ్ సినీనటుల ఇళ్లలో కుక్కల అరుపులను మిమిక్రీచేసి వినిపించాడు. రామ్‌కుమార్, జగన్, రాజేశ్వరి, భాగ్యలక్ష్మి, చక్రంధర, రమణాచారి, కలీముల్లా, శ్రీమన్నారాయణ, డివి శర్మ, క్రిష్ణవేణి పాడినపాటలకు జగన్ కీబోర్డుతో, కృష్ణసాయి తబలాతో వాద్యసహకారం అందించారు.

గొల్లపూడి మాట్లాడుతూ "నవ్వించడం మాట అటుంచి, నవ్వడం అనే సహజగుణాన్ని మరిచిపోతోన్న తరుణంలో నవ్వించడమే ధ్యేయంగా పెట్టుకుని వెలసిన 'హాసం క్లబ్'ను అభినందిచడంతో బాటు తనదైన శైలిలో 'సినీతార-ఏరో ప్లెయిన్' జోక్ చెప్పి అందర్నీ నవ్వించారు. జిల్లా సాంస్కృతిక మండలి సభ్యులు కొ.స.నా. 'హాసం క్లబ్'ను అభినందిస్తూ తదుపరి కార్యక్రమాలకు సహకరిస్తానన్నారు. తమ ఐటమ్స్‌తో ప్రేక్షకులను అలరించిన చిIIజగదీష్, చక్రంధర, రంగారావు, రాజేశ్వరి గార్లకు బహుమతిగా 'వేణుమాధవ్ మిమిక్రీ కళ', అవసరాల రామకృష్ణారావు 'పేకముక్కలు' పుస్తకాలు అందజేశారు.

ఆనాటి కార్యక్రమాన్ని స్పాన్సర్ చేయడమే కాక అల్పాహారం విందు ఏర్పాటు చేసిన 'ఆంధ్రాహోటల్' శివకుమార్ రెడ్డికి ధన్యవాదాలు తెలుపుతూ జూలై కార్యక్రమం 18-7-2004 సాయంత్రం 6-30కు ద్వారకానగర్‌లోని బి.వి.కె.కాలేజీ ఎదురుగా ఉన్న విశాఖ పౌర గ్రంథాలయంలో నిర్వహించబోతున్నట్లు కన్వీనర్లు తెలియజేశారు.

## జగ్గంపేట

నైస్' కోచింగ్ సెంటర్లో జరిగిన 'హాసం క్లబ్' ద్వితీయ కార్యక్రమంలో ముఖ్యఅతిథి కె.యస్.రామచంద్రరావు హాస్యం గురించి ప్రసంగించారు. ఎమ్.వి.మూర్తి 'సిరిగలవానికి..' వంటి శ్రీనాథుని చాటువులలో గల చమత్కారాన్ని వివరించడంతో బాటు హరిహరనాథునిపై హాస్యస్తుతి చేసి సభికులను రంజింప జేశారు. అత్తివిల్లి సాయి 'హే మాతా ఇదే వందనం' పాడగా, చిII సాయి మణికంఠ సినిమాలలో కామెడీబిట్స్ వినిపించాడు. కన్వీనర్లలో ఒకరైన సూర్యనారాయణ 'శ్రీ రఘురాం..' పాటను వినిపించారు.

సిటీకేబుల్ ఎం.డి. అడపా వెంకట్రావు మాట్లాడుతూ "మనిషికి హాస్యం అనేది నేటి అవసరం. ఆ అవసరాన్ని దృష్టిలో వుంచుకుని 'హాసం' పత్రిక అభిమానులతో ఏర్పడిన 'హాసం క్లబ్' ఇంకా ఎదగాలని ఆకాంక్షించారు. కళ్యాణి, భవాని, శ్రీనివాస రావు, వెంకన్న, శ్రీనివాసు తదితరులు జోక్స్, పాటలతో సభను రక్తి కట్టించారు. వచ్చే కార్యక్రమం జూలై మొదటి ఆదివారం 4న సాయంత్రం జరవబడుతుందని తెలియజేశారు.



హాస్యం ప్రాముఖ్యంపై ప్రసంగిస్తున్న అడపా వెంకట్రావు, వేదికపై ముఖ్య అతిథి రామచంద్రరావు, కన్వీనర్ సూర్యనారాయణ

### జగ్గంపేట తృతీయ కార్యక్రమం 4-7-04 సాయంత్రం

**వినబడిన జోక్స్**

ఫోను మోగింది. "డాక్టరు గారూ, మా కుక్క మా ఆయన్ని కరిచిందండీ. రక్తం కూడా వస్తోంది. ఏం చేయాలి?" అడిగిందో ఆడకంఠం.

"వెంటనే తీసుకురండి. బొడ్డుచుట్టూ ఇంజక్షన్లు వేస్తే అపాయం ఉండదు."

"కుక్కకు బొడ్డెక్కడుంటుందండీ?"

"కుక్కకు ఎక్కడుంటే నీకెందుకమ్మా? మీ ఆయన్ని తీసుకురా."

"మా ఆయన గురించి ఎవడేడ్చాడండి? మీరు పశువుల డాక్టరు కాదా?"

"కాదమ్మా, మామూలు డాక్టరుని. మనుషుల డాక్టరుని."

"సారీ, రాంగ్ నంబర్. పొరబాటున మీకు చేశాను."



'హాసం క్లబ్'ను అభినందిస్తున్న గొల్లపూడికి అటూ ఇటూ కన్వీనర్లు

'హాసం క్లబ్స్' ప్రారంభించదలచిన వారు సంప్రదించవలసినది -
శ్రీ ఎస్.వి.రామారావు,
040-2416 0279, 98491 39030

# జంధ్యా మారుతం





(2)

## తెలుగు అందాలతో ముద్దొచ్చేలా విరిసిన



# ముద్దమందారం

ఓ చేత్తో 'సిరిసిరిమువ్వ'లాంటి క్లాస్ సినిమాకి, మరో చేత్తో 'అడవిరాముడు' లాంటి మాస్ సినిమాకి ఏక కాలంలో మాటలు రాసి 'శభాష్' అనిపించుకున్న జంధ్యాలకి సినీరంగప్రవేశం చేసిన నాటినుండి దర్శకత్వ శాఖ మీద ఎనలేని ప్రేమానురాగాలున్నాయి. 1976లో 'దేవుడు చేసిన బొమ్మలు' చిత్రం ద్వారా సంభాషణల రచయితగా తొలిసారిగా కలం ఝుళిపించిన జంధ్యాల... ఐదేళ్ళలోనే దాదాపు 85 చిత్రాలకు మాటలు రాయగా,అందులో 80 శాతం సినిమాలు ఘనవిజయాన్నందుకున్నాయి.

దర్శకత్వ శాఖలో ఎలాంటి అనుభవం లేకున్నా, కేవలం పరిశీలనా సామర్థ్యంతోనే దర్శకునిగా మారారు. దర్శకునిగా తన తొలి సినిమాని ఆయన ఏ తరహాలో చేస్తారోనని సినీపరిశ్రమలోని వ్యక్తులు, ప్రేక్షకులూ ఆసక్తిగా ఎదురు చూసారు. 'శంకరాభరణం' లాంటి క్లాసిక్‌నో, 'వేటగాడు' లాంటి కమర్షియల్ మూవీనో టచ్ చేస్తారని అందరూ భావిస్తే,ఆయన మాత్రం ఓ టీనేజ్ లవ్ స్టోరీని ఎంచుకున్నారు. అది కూడా కొత్త ఆర్టిస్టులతో.

"అనేక చలన చిత్రోత్సవాల్లో పాల్గొన్న నన్ను కొన్ని పాశ్చాత్య చిత్రాలు విపరీతంగా ఆకట్టుకున్నాయి. జీవితానికి, వాస్తవానికి దగ్గరగా ఎంతో గొప్పగా వున్నాయా చిత్రాలు. 'మనం మాత్రం అలా ఎందుకు నిర్మించకూడదు?' అనిపించింది. ఆలోచన వచ్చిన దగ్గర్నుంచీ సినిమా డైరక్ట్ చేయటానికి ప్రయత్నాలు ప్రారంభించాను" అని జంధ్యాల చెప్పుకున్నారు.

జంధ్యాల దర్శకత్వం చేపడుతున్నానని చెప్పినప్పుడు చాలామంది స్నేహితులు వారించారు. 'రైటర్‌గా పెద్ద పేరున్న నీకు...

డైరెక్షన్ ఎందుకు?' అని కొందరంటే, 'రచయితలెవ్వరూ దర్శకులుగా సక్సెస్ కాలేదు' అని మరికొందరు కొన్ని ఉదాహరణలు చెప్పుకొచ్చారు. దర్శకత్వం మీద బాగా మమకారం వున్న జంధ్యాల నవ్వుతూనే ముందడుగు వేసారు.

జంధ్యాలకి రంగస్థలం మీద గురువు శ్రీ విన్నకోట రామన్నపంతులు. చిన్నతనంలో వాళ్ళింట్లోనే ఎక్కువ పెరిగారాయన. గురుపుత్రుడు విజయరామ్, జంధ్యాల మంచి స్నేహితులు. విజయవాడ యస్సారార్ కాలేజీలో జంధ్యాల, విన్నకోట విజయరాం, అశ్వనీదత్, సుత్తి వీరభద్రరావు, సుబ్బరాయ శర్మ, మాధవపెద్ది రమేష్, ఎం.వి.రఘు

## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| ప్రదీప్ | - ప్రదీప్ |
| దుర్గ | - పూర్ణిమ |
| రావు | - శంకర్ |
| మాలక్ష్మి | - అన్నపూర్ణ |
| మేనేజర్ మూర్తి | - కృష్ణచైతన్య |
| ఇందు | - తులసి |
| దుర్గ తాత | - విన్నకోట రామన్నపంతులు |
| క్షురకుడు | - నరసింగరావు |
| కొండడు | - శ్రీనివాసమూర్తి |

మరియు థమ్, విన్నకోట విజయరామ్, యమ్.సి.వాప్, ఎ.వి. రామారావు, సుబ్రహ్మణ్యం, నరసింహారావు, రవి, బాబన్న, వేలూ, బాబురావు, జ్వెలియర్, జి.శ్రీనివాసమూర్తి, ఎస్.విజయకుమార్, జి.రాధాకృష్ణమూర్తి సుధాకర్, ఇవటూరి సరోజిని మరియు విశాఖ రంగస్థల కళాకారులు.





చదువుకున్నారు.

జంధ్యాల మదిలో దర్శకత్వపు ఆలోచనలు మొగ్గ తొడిగిన సమయంలో...విజయరామ్ మేనల్లుడు ప్రదీప్ చేసిన స్టేజ్‌ప్లే ఒకటి చూడటం జరిగింది. 'నిన్ను సినిమా హీరోని చేస్తాన్రా' అని ఆ కుర్రాడితో అన్నారు జంధ్యాల. డిగ్రీ సెకండియర్ చదువుతున్న ప్రదీప్ మాత్రం జంధ్యాల జోక్ చేసారనుకున్నాడు. చదువుకోవడం, అప్పుడప్పుడూ డ్రామాలు వేయడం తప్ప ప్రదీప్‌కి సినిమాల్లో కెళ్ళాలనే పెద్ద ఆలోచనలు లేవు. అయితే చిన్నతనంలో 'ఇదెక్కడి న్యాయం' అనే సినిమాలో ఓ చిన్న పాత్రను పోషించటం జరిగింది. జంధ్యాల అలా అన్న ఆరు నెలల తర్వాత ప్రదీప్‌కి మద్రాసు నుండి పిలుపొచ్చింది. ఆయన జోక్ చేయలేదని అప్పుడు అర్థమైందతనికి.

మద్రాస్‌లో తన ఇంట్లోనే వుంచుకుని ప్రదీప్‌కి డాన్సులు, ఫైట్లు, హార్స్‌రైడింగ్, కార్ డ్రైవింగ్... అన్నీ నేర్పించారు జంధ్యాల. కుర్రాడు కొంచెం బక్కపలుచగా వుండటంతో ప్రతిరోజూ ఐస్‌క్రీమ్‌లు బాగా తినమని చెప్పేవారు. అలాగే రిలీజైన ప్రతి తెలుగు సినిమాని చూసి, అందులో హీరోలు ఎలా నటిస్తున్నారో గమనించమనేవారు.

మరో పక్క కథానాయిక కోసం అన్వేషణ మొదలైంది. వందల ఫోటోలు...జంధ్యాలకు ఒక్కరూ నచ్చరాయె! వరలక్ష్మి, డబ్బింగ్ జానకి చెల్లెలు లక్ష్మి తదితరులు ఇందులో అవకాశం కోసం ప్రయత్నించారు. చివరికా అదృష్టం పూర్ణిమకు దక్కింది. మద్రాసులో స్థిరపడిన తెలుగు కుటుంబం వాళ్ళది. ఈ అమ్మాయికి సింగర్ అవ్వాలన్నది చిన్ననాటి కోరిక. 'హరిశ్చంద్రుడు' సినిమాలో పాట అడగటానికి వెళ్ళి అనుకోకుండా అందులో చిన్నవేషం వేయాల్సి వచ్చింది. మహానటి సావిత్రి (ఇదే ఆమె చివరి చిత్రం) కూతురుగా నటించింది పూర్ణిమ.

పూర్ణిమ నాన్నగారికి సినిమాఫీల్డ్ అంటే ఇష్టం లేదు. జంధ్యాల ఆయన భయాన్ని పోగొట్టి 'మేము విశ్వనాథ్ గారి శిష్యులం. అసభ్యత అనేది మా నిఘంటువులో లేదు. ఆ దృక్పథాన్ని అనుసరించే మా చిత్రాలు ఉంటాయి' అని హామీ ఇచ్చారు. దాంతో పూర్ణిమ నటించడానికి వాళ్ల నాన్నగారు పచ్చజెండా ఊపారు.

ఇందులో హీరో, హీరోయిన్లే కాదు, మిగతా ఆర్టిస్టులు కూడా కొత్తవాళ్ళే. థమ్ ఒక్కడికే అప్పటికి కొన్ని సినిమాలు చేసిన అనుభవం వుంది.

నటనాలయం బేనర్‌లో కోనేరు రవీంద్రనాథ్ సమర్పణలో ఈ చిత్రం షూటింగ్ ప్రారంభోత్సవం ఫిబ్రవరి23,1981న మద్రాసులోని గిరి హౌస్‌లో (తర్వాత జయసుధ కొని అమ్మేసారు) జరిగింది. పూర్ణిమను ప్రదీప్ తన భవంతికి తీసుకెళ్ళి దేవుడి గదిని చూపటాన్ని ముహుర్తపు షాట్‌గా చిత్రీకరించారు.

ఏవో కొన్ని సీన్స్ మినహా మొత్తం సినిమా

అంతా వైజాగ్‌లోనే తీసారు. సింగిల్ షెడ్యూల్ ప్లాన్ చేసి టాకీపార్ట్, సాంగ్స్ అక్కడే పూర్తి చేసారు. 1,2 రోజులు ఆప్టికల్ వర్క్ మాత్రం మద్రాసులో చేసారు.

యూనిట్ మొత్తం వైజాగ్‌లోని మువ్వలవాని పాలెం(ఇప్పుడు ఎం.వి.పి. కాలనీ)లో బస చేసారు. అప్పుడే అక్కడ క్వార్టర్స్ నిర్మాణం జరుగుతోంది. అక్కడ 30-40 ఇళ్ళు అద్దెకు తీసుకుని ఒక ఇంట్లో కాస్ట్యూమ్స్‌కి,ఒక ఇంట్లో మేకప్‌కి, ఒక ఇంట్లో మెస్‌కి, అసిస్టెంట్ డైరెక్టర్స్ ఒకదాంట్లో, ప్రొడక్షన్ వాళ్ళు ఒక దాంట్లో, ఆర్టిస్టులు కొన్ని ఇళ్ళల్లో...వుండడం జరిగింది. జంధ్యాల దగ్గర్నుంచీ ప్రొడక్షన్ బాయ్ వరకూ అందరికీ అక్కడే బస. వనభోజనాలకో, పిక్నిక్‌కో వచ్చినట్టుగా యూనిట్ సభ్యులు ఫీలయ్యేవారంటే, ఆ షూటింగ్ ఎంతటి ఆత్మీయపూర్వక వాతావరణంలో జరిగిందో అర్థమవుతుంది. 'ఒక ఫ్యామిలీ మొత్తం 60 రోజులు పిక్నిక్‌గా వెళ్ళినట్టు అనిపించింది' అన్నారు ప్రదీప్ ఆ రోజుల్ని గుర్తు కు తెచ్చుకుంటూ.

ఈ సినిమాకి ఏదైనా తెలుగుదనం వున్న పువ్వు పేరు పెట్టాలనుకున్నారు జంధ్యాల. 'సన్నజాజి','ముద్దమందారం' రెండు ఆప్షన్స్. అమాయకత్వానికి, స్వచ్ఛతకి ప్రతిరూపంగా వుంటుందని భావించి చివరికి 'ముద్దమందారం' టైటిల్ పెట్టారాయన. ఇందులో హీరోయిన్ జళ్ళో ఎప్పుడూ ముద్దమందారమే కనిపిస్తుంది. ఈ ముద్దమందార పువ్వే హీరో, హీరోయిన్ల మధ్య ప్రేమ మొగ్గ తొడగడానికి కారణమవుతుంది.

ప్రదీప్ తాతగారైన







విన్నకోట రామన్న పంతులు, మేనమామ విన్నకోట విజయరామ్ లు కూడా ఈ చిత్రంలో నటించారు. తాత- మేనమామ-మనవడు ఒకే చిత్రంలో నటించడాన్ని ఓ ప్రత్యేకాంశంగా చెప్పుకోవాలి. హీరోయిన్ తాతగా విన్నకోట రామన్నపంతులు, పోలీస్ కానిస్టేబుల్‌గా విన్నకోట విజయరామ్‌లు ఇందులో కనిపిస్తారు. రంగస్థలంపై ఎంతో పేరు ప్రఖ్యాతులు గడించిన రామన్న పంతులు, గతంలో బాటసారి, కన్యాశుల్కం, చదువుకున్న అమ్మాయిలు,సాక్షి, బంగారు పిచ్చుక తదితర చిత్రాల్లో నటించారు. 'ముద్దమందారం' విడుదలైన ఏడాది తర్వాత ఆయన కన్నుమూసారు.

ఈ సినిమాకి డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ నిర్వహించిన ఎస్.గోపాలరెడ్డికిది రెండో చిత్రం. ఆయన తొలి చిత్రం 'సంధ్య' ద్వారా ఎ.కోదండరామిరెడ్డి దర్శకునిగా పరిచయమైతే, రెండో చిత్రం 'ముద్దమందారం' ద్వారా జంధ్యాల దర్శకునిగా పరిచయమయ్యారు. ప్రముఖ ఛాయాగ్రాహకుడు ఎం.వి.రఘు ఈ చిత్రానికి ఆపరేటివ్ కెమెరామెన్ కాగా, ఆయన దగ్గర దివాకర్ ('పడమటి సంధ్యారాగం'కెమెరామెన్) సహాయకునిగా పనిచేసారు. ఇప్పుడు వాణీ అవుట్‌డోర్ యూనిట్ నిర్వహిస్తున్న సుబ్బరాజు, ప్రముఖ కెమెరామెన్, నిర్మాత, వి.శ్రీనివాసరెడ్డిలు ఈ చిత్రానికి కెమెరా అసిస్టెంట్లుగా పనిచేసారు.

ఈ చిత్రం మొదలు పెట్టేముందు తన క్లాస్‌మేట్ మాధవపెద్ది సురేష్(అప్పటికి ఆయన చాలామంది సంగీతదర్శకుల దగ్గర కీ బోర్డ్ ప్లేయర్‌గా పనిచేస్తున్నారు)ను మంచి మ్యూజిక్ డైరెక్టర్‌ను సజెస్ట్ చేయమని అడిగారు జంధ్యాల. రమేష్‌నాయుడు, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంల పేర్లు సజెస్ట్ చేశారు సురేష్. రమేష్‌నాయుడు లాంటి సంగీత ఉద్యానవనం నుంచి మనసారా

## సాంకేతిక బృందం

| | |
|---|---|
| బేనర్ | : నటనాలయ |
| సమర్పణ | : కోనేరు రవీంద్రనాథ్ |
| కథ | : జంధ్యాల |
| పాటలు | : వేటూరి |
| సంగీతం | : రమేష్‌నాయుడు |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : ఎస్.గోపాలరెడ్డి |
| ఎడిటింగ్ | : జి.జి. కృష్ణారావు |
| కళ | : తోట తరణి |
| కో-డైరెక్టర్ | : యు.వి.పాణి |
| నేపథ్యగానం | : బాలు,జానకి, జిత్‌మోహన్ మిత్రా |
| నృత్యం | : శివసుబ్రహ్మణ్యం |
| అసోసియేట్ డైరెక్టర్ | : బి.యస్.నిష్ఠల |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : బత్తుల రామకృష్ణ |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : యమ్.వి.రఘు |
| సహాయకుడు | : దివాకర్ |
| నిర్మాతలు | : రంజిత్-ప్రశాంత్ |
| రచన-దర్శకత్వం | : జంధ్యాల |

| | |
|---|---|
| రిలీజ్ | : 11-9-1981 |
| నిర్మాణప్రాంతాలు | : వైజాగ్,శ్రీకాకుళం, భీమిలి, అరకులోయ, కోటపాడు, శృంగవరపుకోట తదితర ప్రాంతాలు. |
| నిర్మాణవ్యయం | : సుమారు 17 లక్షల రూపాయలు |
| షూటింగ్ వర్కింగ్ డేస్ | : సుమారు 60 రోజులు. |



పూర్ణిమ, విన్నకోట రామన్న పంతులు, ప్రదీప్

'ముద్దమందారం' లాంటి గీతాలను ఏరుకున్నారు జంధ్యాల. 'ముద్దమందారం' మ్యూజిక్ సిట్టింగ్స్ కృష్ణవేణమ్మ తీరాన గల నాగార్జున సాగర్‌లోని అశోక్‌విహార్ అతిథి గృహంలో వారం రోజులపాటు జరిగాయి. తిరుగు ప్రయాణమయ్యే సమయంలో కృష్ణవేణమ్మను స్మరిస్తూ ఓ అందమైన పాట కావాలని అడిగారు జంధ్యాల. అలా ఒక పూటలో 'అలివేణీ ఆణిముత్యమా' పాట సిద్ధమైంది. పాటల చిత్రీకరణలో కూడా జంధ్యాల తనదైన శైలిని కనబరచడానికి ప్రయత్నించారు. ఇందులో మొత్తం ఎనిమిది పాటలున్నాయి. వేటూరి 7 పాటలు రాయగా, 'నా షోలాపూర్ చెప్పులు పెళ్లిలో పోయాయి' పాటను బాబన్న-సుబ్బారావు జంట రాశారు. వీళ్లే జంధ్యాల రెండో సినిమా 'మల్లెపందిరి'లో కూడా 'లాగడానికెందుకురా తొందరా...' అనే పేకాట పాటను రాశారు. ఎస్.పి.బాల సుబ్రహ్మణ్యం, ఎస్.జానకి ఈ 'ముద్దమందారం' చిత్రంలోని పాటల్ని ఆలపించగా, 'నా షోలాపూర్ చెప్పులు పెళ్ళిలో పోయాయి' పాటను మాత్రం జిత్‌మోహన్ మిత్రా పాడారు.

యూనిట్‌కి చేదోడు వాదోడుగా ఉండే బాబన్న(జంధ్యాల స్నేహితుడు) ఓ రోజు బి.సుబ్బారావు అనే రచయితను జంధ్యాలకు పరిచయం చేశారు. ఆయన ఓ 15 పేరడీ సాంగ్స్‌ను వినిపించారు. 'పెళ్లాడి తీరాలన్నారు మా నాన్నారు' అనే పాటకి పేరడీగా రాసిన 'నా షోలాపూర్ చెప్పులు...' పాట జంధ్యాలకు బాగా నచ్చేసింది. మ్యారేజ్ సీన్‌లో కామెడీ సీన్స్‌కన్నా ఈ సాంగ్ పెడితే బాగుంటుందని అనుకున్నారు. రాజమండ్రికి చెందిన జిత్‌మోహన్ మిత్రా తన ఆర్కెస్ట్రాలో 'పెళ్లాడి తీరాలన్నారు మా నాన్నారు' అనే పాటను ఎక్కువసార్లు పాడి ఉన్నారు. అందుకే 'నా షోలాపూర్ చెప్పులు' పాటను ఆయనతోనే పాడించి, ఆయన మీదనే చిత్రీకరించాలనుకున్నారు జంధ్యాల. కారణాంతరాల వల్ల మిత్రా ఆ షూటింగ్‌కు వెళ్లలేకపోయారు. దాంతో వేరే వాళ్లమీద తీసేశారు.

ఈ 'పెళ్లాడి తీరాలన్నారు మా నాన్నారు' పాటను ఇటీవల సురేష్ ప్రొడక్షన్స్ వాళ్లు ఉదయ్‌కిరణ్, శ్రియలతో నిర్మించిన 'నీకు నేను-నాకు నువ్వు' చిత్రంలో ఉపయోగించటం జరిగింది.

'ముద్దమందారం'లో పాటల బాణీలు, సాహిత్యం, చిత్రీకరణ ఉన్నత స్థాయిలో ఉంటాయి. వేటూరితో ఈ చిత్రంలోని పాటలను నాగార్జునసాగర్‌కు తీసుకెళ్లి మరీ రాయించుకున్నారు జంధ్యాల. పాటల చిత్రీకరణ కోసం ముందుగా లొకేషన్ల ఎంపిక చేయలేదు. జంధ్యాల కారు ముందు బయలుదేరితే ఆ వెనుకే మిగతా వ్యాన్లు,కార్లు, జనరేటర్ వెళ్ళేవి. జంధ్యాల కారులో ఎస్. గోపాల రెడ్డి, ప్రదీప్, పూర్ణిమ కూర్చునేవారు. దారిలో ఎక్కడైనా మంచి లొకేషన్ కనబడితే, అక్కడాపి పాట తీసేవారు జంధ్యాల.

"ఆయన పాటల్లోని భావుకతకు, చిత్రీకరణ శైలికి నా ఒళ్ళు పులకరించిపోయేది" అని చెప్పారు ప్రదీప్.

'కలకంఠి కొలకుల్లో' పాటను తొమ్మిది

అ: షోలాపూర్.... చెప్పులు పోయాయి....
నా షోలాపూర్ చెప్పులు పెళ్లిలో పోయాయి
అవి కొత్తవి మెత్తవి కాలికి హత్తుకుపోయేవి ॥నా షోలాపూర్॥
మన రమణమూర్తి పెళ్ళి ఇది రాదు మళ్ళి మళ్ళి
నవ్వాలి తుళ్లి తుళ్లి అని పాడేను మళ్లీ మళ్లీ ॥మన రమణమూర్తి॥
ఆ సందట్లో కన్నేసి కనిపెట్టి కాజేసాడెవడో
నా షోలాపూర్ చెప్పులు పెళ్లిలో పోయాయి
అవి కొత్తవి మెత్తవి కాలికి హత్తుకుపోయేవి
నా షోలా...షోలా..షోలా..షోలా..
షోలాపూర్ పెళ్లిలో చెప్పులు పోయాయి
ఇది షోలాపూర్ లెదరు ఎన్ లైట్ ఎయిర్ బ్రదరు
చూసేటి ఎనీ వెదరు దీన్ని తొడిగి చూడు బ్రదరు ॥ఇది షోలాపూర్॥
అని మురిపించి మురిపించి కొనిపించాడా కొట్టోడు ॥ షోలాపూర్॥
చ: జత నెంబరేమో 6 వెలచూస్తే 26
తొడిగేను ఒక్కమారు వెళ్ళేను పాతవూరు ॥జత నెంబరేమో॥
ఒకసారయినా పాలీషుకొట్టందే కొట్టేశాడెవడో ॥నా షోలాపూర్॥

రచన : బాబన్న - సుబ్బారావు
గానం : జిత్‌మోహన్ మిత్రా
ఒరిజనల్ ట్యూన్ : గుమ్‌నామ్ చిత్రంలోని 'హమ్ కాలే హై తో క్యా హువా దిల్ వాలే హై' అనే హిందీ పాట




ఏ.వీ.యస్., ప్రదీప్

సంగీతం : రమేష్‌నాయుడు
రచన : వేటూరి సుందరరామ్మూర్తి
గానం : యస్పీ బాలసుబ్రహ్మణ్యం, యస్.జానకి

అ: అలివేణీ ..ఆణిముత్యమా
నీ కంట నీటి ముత్యమా
ఆవిరి చిగురో యిది ఊపిరి కబురో
స్వాతివాన లేత ఎండలో జాలి నవ్వా జాజి ఎండలో
ఆ: అలివేణీ..ఆణిముత్యమా
నా పరువాల ప్రాణ ముత్యమా
జాబిలి చలువో యిది వెన్నెల కొలువో
స్వాతివాన లేత ఎండలో
జాజిమల్లె పూల గుండెలో
అ: అలివేణీ ఆణిముత్యమా
అ: కుదురైన బొమ్మకి కులుకు మల్లె రెమ్మకి ॥2॥
నుదుట ముద్దు పెట్టనా... బొట్టుగా
ఆ: వద్దంటే ఒట్టుగా
అ: అందాల అమ్మకి కుందనాల కొమ్మకి
అందాల అమ్మకి కుందనాల కొమ్మకి
అడుగు మడుగులొత్తనా... మెత్తగా..
ఆ: ఔనంటే తప్పుగా
అ: అలివేణీ ఆణిముత్యమా
ఆ: నా పరువాల ప్రాణ ముత్యమా
పొగడలేని ప్రేమకి పొన్నచెట్టు నీడకి ॥2॥
పొగడ దండలల్లుకోనా పూజగా
అ: పులకింతలు పూజగా
ఆ: తొలిజన్మలకి నోముకి దొరనవ్వుల సామికి ॥2॥
చెలిమై నే ఉండిపోనా చల్లగా
అ: మరుమల్లెలు చల్లగా
ఆ: అలివేణీ....ఆణిముత్యమా
అ: నీ కంట నీటి ముత్యమా
ఆ: జాబిలి చలువో యిది వెన్నెల కొలువో
ఇ: స్వాతివాన లేత ఎండలో జాజిమల్లె పూల గుండెలో
ఇ: అలివేణీ ఆణిముత్యమా...అలివేణీ ఆణిముత్యమా

రోజుల పాటు చిత్రీకరించారు. పాటలోని ప్రతి లైనుకి తగట్టుగా సూక్ష్మంగా చాలా విశ్లేషణాత్మకంగా చిత్రీకరించారు.

అప్పటికి 'మరో చరిత్ర' లాంటి ఏవో కొన్ని సినిమాలు మాత్రమే వైజాగ్‌లో రూపొందాయి. కాని విశాఖ పరిసరాల్లోని కొత్త అందాల్ని, అరకులోయ సౌందర్యాన్ని రమణీయంగా తెరకెక్కించిన ఘనత మాత్రం జంధ్యాలకే తొలిసారిగా దక్కుతుంది.

జంధ్యాలపై కె.విశ్వనాథ్ ప్రభావం చాలా వుండేది. సెట్లో ఏ మాత్రం క్రమశిక్షణ తప్పినా సహించేవారు కాదు. విశ్వనాథ్ గారు సెట్లో ఖాకీ బట్టలు వేసుకున్నట్టుగానే,ఈయన కూడా వైట్ డ్రెస్ వేసుకునేవారు. సెట్లో టైగర్‌లా కనిపించే జంధ్యాల షూటింగ్ పూర్తి కాగానే మాత్రం బాల్య మిత్రునిలా అందరితో కలిసిపోయేవారు.

ఓ రోజు కోటపాడులో షూటింగ్ జరుగుతోంది. ప్రదీప్,పూర్ణిమలు చాపమీద పడుకుని 'ఇవాళ్టికి కడుపునిండా భోంచేసి ఐదురోజులైంది'అని నంభాషించడాన్ని చిత్రీకరిస్తున్నారు. ఈ లోగా లంచ్‌బ్రేక్ వచ్చింది. ఓ పక్క భోంచేస్తూనే, మరోపక్క జోక్స్‌తో అందర్నీ తెగ నవ్వించేసారు జంధ్యాల. షాట్ రెడీ అయ్యింది. డైలాగ్ చెప్పడానికి ప్రదీప్ చాలా టేకులు తీసుకున్నారు. దాంతో ఒళ్లు మండిపోయింది జంధ్యాలకి. 'ఏం ఆడుకోవడానికి వచ్చావా? సినిమా అంటే లక్షలతో వ్యాపారం. నీ మీద లక్షలు పెడుతున్నాం. చిన్న డైలాగ్ కూడా చెప్పలేకపోతే ఎలా...?' అని చెడామడా తిట్టేసారు జంధ్యాల. ఎప్పుడూ ప్రేమగా చూసుకునే ఆయన తొలిసారి అలా కసురుకునే సరికి ప్రదీప్ కళ్ళవెంబడి నీళ్ళు వచ్చేసాయి. వెంటనే జంధ్యాల 'రెడీ..టేక్' అన్నారు. షాట్ బాగా వచ్చింది. వెంటనే చిన్నపిల్లాడిలా ఆనందంతో క్లాప్స్ కొట్టారు జంధ్యాల. 'ఇందుకోసమే నిన్ను తిట్టాను' అన్నారు ప్రదీప్‌తో ఆ తర్వాత.

ఆ వయసులో పూర్ణిమ చాలా అమాయకంగా ఉండేది. నటనలో ఏ మాత్రం అనుభవం లేకపోయినా చిలుక మాటలు నేర్చినట్టుగా జంధ్యాల ఎలా చెబితే అలా చేసేది. ఓ సన్నివేశంలో ప్రదీప్, పూర్ణిమ హోటల్‌లో రూమ్ తీసుకుని స్వేచ్ఛా ప్రపంచంలో విహరిస్తారు. ఆ సన్నివేశంలో - 'పూర్ణిమా! ఇన్నాళ్లూ మీరిద్దరూ ప్రేమించుకున్నారు. ఇక్కడ మీ ప్రేమకు అడ్డు చెప్పే వాళ్లెవరూ లేరు. ఇప్పుడు

ప: నీలాలు కారేనా కాలాలు మారేనా
నీ జాలి నే పంచుకోనా నీ లాలి నే పాడలేనా
జాజి పూసే వేళ జాబిల్లి వేళ పూలడోల నేను కానా ॥నీలాలు॥
చ: సూరీడు నెలరేడు సిరిగల దొరలే కారులే
పూరి గుడిసెల్లో పేద మనసుల్లో వెలిగేటి దీపాలులే
ఆ నింగి ఈ నేల కొనగల సిరులే లేవులే
కలిమి లేముల్లో కరిగె ప్రేమల్లో నిరుపేద లోగిళ్ళులే ॥నీలాలు॥
చ: ఈ గాలిలో తేలి వెతలను మరిచే వేళలో
కలికి వెన్నెలలో కలల కన్నుల్లో కలకారి పోవాలిలే
ఆ తారలో తేలి తళ తళ మెరిసే రేయిలో
ఒడిలో నువ్వుంటే ఒదిగి పోతుంటే కడతేరి పోవాలిలే ॥నీలాలు॥

రచన
వేటూరి సుందరరామ్మూర్తి
గానం
యస్పీ బాలసుబ్రహ్మణ్యం

నీ మొఖంలో తృప్తి కనిపించాలి' అన్నారు జంధ్యాల. వెంటనే పూర్ణిమ -'అంకుల్! తృప్తి అంటే ఏమిటి?' అని అడిగింది. దానికి జంధ్యాల ఏమి సమాధానం చెబుతారు?

ఓ పక్క 'ముద్దమందారం'డైరెక్ట్ చేస్తూనే మరో పక్క 'జే గంటలు', 'సీతాకోక చిలక', 'సప్తపది' చిత్రాలకు సంభాషణలు రాసారు. ఈ నాలుగూ లవ్‌స్టోరీలే. ఈ నాలుగూ దాదాపుగా ఒకే సమయంలో విడుదలయ్యాయి. నాలుగూ హిట్టయ్యాయి. దటీజ్ జంధ్యాల.

ఈ సినిమాలో జె.వి. సోమయాజులు ట్రూప్ 'మనిషి నూతిలో పడ్డాడు' నాటకం వేసే సీన్ వుంది. హీరో, హీరోయిన్లు ఇంట్లోంచి పారిపోతూ, దార్లో ఈ నాటకం చూస్తారు. ఈ నాటకాన్ని సినిమా కోసం ప్రదర్శిస్తున్నారు. ఈ నాటకంలో నటించడానికి వచ్చిన ఓ బక్కపలుచని వ్యక్తి జంధ్యాలను ఆకర్షించాడు.

## సాంగ్స్

| పల్లవి | - అభినయించినవారు |
|---|---|
| 1. ముద్దుకే ముద్దొచ్చే మందారం | - ప్రదీప్,పూర్ణిమ |
| 2. కలకంఠి కొలకుల్లో | - ప్రదీప్,పూర్ణిమ |
| 3. ఆ రెండు దొండపండు పెదవుల్లో | - ప్రదీప్, పూర్ణిమ, విన్నకోట రామన్న పంతులు |
| 4. నా షోలాపూర్ చెప్పులు పెళ్ళిలో పోయాయి | - గ్రూప్ |
| 5. జొన్న చేలో జున్ను అన్నుల మిన్న | - ప్రదీప్,పూర్ణిమ |
| 6. అలివేణి ఆణిముత్యమా | - ప్రదీప్,పూర్ణిమ |
| 7. నీలాలు కారేనా | - ప్రదీప్,పూర్ణిమ |
| 8. జో..లాలీ....జో లాలీ | - ప్రదీప్, పూర్ణిమ |

జంధ్యాల దృష్టిలో పడటానికి ఆ నాటకం మాత్రం అలా ఉపయోగపడింది.

ప్రముఖ హాస్యనటుడు ఏ.వి.యస్ ఈ చిత్రంలో చిన్న పాత్ర వేశారు. హీరోయిన్ గర్భవతి అయ్యిందన్న విషయం ఓ ఉత్తరం ద్వారా వాళ్ళ తాతయ్యకి రాస్తాడు హీరో. ఆ ఉత్తరాన్ని తాతకి

మహారాజుగా నటిస్తున్నారు. శంకర్‌గారి పెద్దబ్బాయ్ శ్రీ కృష్ణకౌశిక్, ఇ.వి.వి. తీసిన 'ఆరుగురు ప్రతివ్రతలు' మొదలైన సినిమాలోనూ, అనేక టీవి సీరియల్స్ లోనూ నటించాడు. చిన్నబ్బాయ్ బాలాదిత్య 'చంటిగాడు' సినిమాలో హీరోగా చేసాడు.

దుర్గను ప్రేమించి పెళ్ళాడలేకపోయిన క్షురకునిగా నరసింగరావు నటన ఎంతో మంది ప్రశంసలను అందుకొంది.

అతి మామూలు ప్రేమకథను సహజంగా, అందంగా మలిచేందుకు జంధ్యాల చాలా శ్రమ పడ్డారు. ఈ సినిమా జంధ్యాలకి ఎంతో గుర్తింపుని తీసుకువచ్చింది. అలాగే హీరో ప్రదీప్‌కు కూడా విపరీతమైన క్రేజ్‌ని తీసుకువచ్చింది. "యూత్‌లో నాకు చాలా పెద్ద క్రేజ్ వచ్చింది. అందరూ నన్ను 'ముద్దమందారం' ప్రదీప్ అనే పిలిచేవారు. సినిమా ఇండస్ట్రీ ఇక్కడ షిఫ్ట్ కాకముందు, హైదరాబాద్‌లో వున్న హీరోలు అక్కినేనిగారు,

## కథాంశం

ప్రదీప్ ఓ గొప్పింటి కుర్రాడు. విదేశాల్లో చదువుకుని వచ్చిన ప్రదీప్‌కి తమ అమ్మాయినిచ్చి పెళ్ళి చెయ్యాలని చాలామంది సంపన్నులు ఆశపడతారు. దేవాలయం దగ్గర పూలమ్ముకునే దుర్గ, ప్రదీప్ గాఢంగా ప్రేమించుకుంటారు. తండ్రి కుదిర్చిన ఇందుతో పెళ్ళిని తెలివిగా కేన్సిల్ చేయిస్తాడు ప్రదీప్. వీళ్ళ ప్రేమని ప్రదీప్ తండ్రి రావు అంగీకరించడు. దుర్గ ప్రేమకి ఖరీదు కట్టాలని ప్రయత్నిస్తాడు. దాంతో ప్రదీప్, దుర్గ లేచిపోయి పెళ్ళి చేసుకుంటారు. ఇద్దరూ పనులు చేసుకుంటూ సంసారాన్ని నెట్టుకొస్తుంటారు. దుర్గ గర్భవతి అవుతుంది. ఈ విషయం దుర్గ తాతకి ఉత్తరం రాస్తాడు ప్రదీప్. వీళ్ళ ఆచూకి తెలుసుకున్న దుర్గ సవతితల్లి తమ్ముడు కొండడు దుర్గను బలవంతంగా ఈడ్చుకుపోతుంటే, ప్రదీప్ అడ్డుపడతాడు. దుర్గ ఓ మగబిడ్డని ప్రసవిస్తుంది. దుర్గ పిన్ని మాలక్ష్మి,ప్రదీప్ నాన్న రావు తమ దగ్గరకు రావడం గమనించి ప్రదీప్, దుర్గ ఆత్మహత్య చేసుకోవాలనుకుంటారు. చివరికి పసిబిడ్డ సాక్షిగా ప్రదీప్,దుర్గలకు మళ్ళీ పెళ్ళి జరిపించి ప్రేమ గొప్పతనాన్ని అంగీకరిస్తాడు రావు.

అతనికి ఇందులో చిన్న వేషం ఇచ్చారు.

హీరో, హీరోయిన్లు దొంగచాటుగా పెళ్ళి చేసుకుని వేరే ఊరు పారిపోతారు. అక్కడ ఓ హోటల్‌లో రూమ్ తీసుకుని మూడ్రోజులు తలుపులు మూసేసుకుని, అన్నపానాల సంగతి కూడా మరిచిపోయి దంపతులుగా సౌఖ్యాన్ని


పూర్ణిమ, ప్రదీప్, వేలు

అనుభవిస్తారు. ఆ హోటల్ మేనేజర్ పాత్రను ఆ బక్క పలుచని వ్యక్తితో చేయించారు జంధ్యాల. అతనే ఆ తర్వాత 'నాలుగు స్తంభాలాట' తో పాపులరైన సుత్తివేలు. వేలూ అసలు పేరు కురుమద్దాలి లక్ష్మీనరసింహారావు.

అయితే జె.వి. సోమయాజులు సీన్స్‌ని ఎడిటింగ్‌లో తొలగించేసారు. సుత్తివేలు, చదివి వినిపించిన వ్యక్తిని కాస్త జాగ్రత్తగా గమనించండి. మొలకి టవల్ చుట్టుకుని, ముఖానికి నూనె రాసుకుని ఆ వ్యక్తి కొన్ని చోట్ల నత్తిగా మాట్లాడుతుంటాడు. అలాగే హీరో ప్రదీప్, హీరోయిన్ పూలకొట్టు ఎదురుగా వున్న టీస్టాల్‌లో కూర్చొని ఆమెనే చూస్తుంటాడు. ఆ టీస్టాల్ ఓనరే ఏ.వి.యస్. టైటిల్స్‌లో మాత్రం ఆయన పేరు సుబ్రహ్మణ్యం గా వస్తుంది. ఏ.వి.యస్. పూర్తిపేరు ఏ.వి. సుబ్రమణ్యం. మిమిక్రీ ఆర్టిస్ట్‌గా అప్పటికే పేరు తెచ్చుకున్న ఏ.వి.యస్‌ని ఎవరో స్నేహితుడు జంధ్యాలకు పరిచయం చేయడంతో ఈ వేషమిచ్చారు.

బాపు 'స్నేహం'లో హీరోగానూ 'సీతామాలక్ష్మి, వంశవృక్షం' సినిమాల్లో గెస్ట్‌రోల్స్ చేసిన శంకర్ ఈ చిత్రంలో ప్రదీప్ తండ్రిగా నటించారు. ఆయనకు జంధ్యాలే డబ్బింగ్ చెప్పారు. ఈ శంకర్ ఇద్దరబ్బాయిలు ఇప్పుడు ఆర్టిస్టులు. ఈ శంకర్ ఇప్పుడు ఈటీవీలో ప్రసారమవుతున్న బాపూ గారి 'శ్రీ భాగవతం' టీవీ సీరియల్‌లో పరీక్షిత్తు

నేనే. తెలంగాణాలో ఏ ఫంక్షన్ జరిగినా నన్ను పిలిచేవారు. లెక్కలేనన్ని ఫంక్షన్స్‌కి అటెండ్ అయ్యాను" అని ఆనాటి మధురానుభూతులను గుర్తుకు తెచ్చుకున్నారు ప్రదీప్. 'ముద్దమందారం' రిలీజైన తర్వాత కూడా ప్రదీప్ సిటీబస్‌లోనే తిరిగేవారు. చాలామంది ప్రదీప్‌ని ఆశ్చర్యంగా


ప్రదీప్, వేలు

చూసేవారు.

ఈ సినిమా చేసేటప్పుడు ప్రదీప్ వయసు 20 ఏళ్ళు. ఓ పక్క షూటింగ్ చేస్తూనే, మరోపక్క బి.కాం ఫైనలియర్ ఎగ్జామ్స్‌కి ప్రిపేర్ అయ్యారు. ఈ సినిమా రిలీజయ్యేదాకా తాను సినిమా

హీరోనన్నది కలగానే భావించేవారు ప్రదీప్. జంధ్యాల స్క్రిప్ట్ మొదలు పెట్టిన దగ్గర్నుంచీ, సినిమా ఫస్ట్‌కాపీ వచ్చేవరకూ జంధ్యాల టీమ్‌లో ఓ సభ్యుడిలాగానే వున్నారాయన.

ఈ సినిమాలో హీరోగా నటించినందుకు ఆయనకు 2500/- రూపాయలు పారితోషిక మిచ్చారు. "హీరోగా అవకాశం ఇవ్వడమే చాలా ఎక్కువ. అలాంటిది జంధ్యాల గారు తన ఇంట్లోనే ఏడాది పాటు వుంచుకున్నారు. అన్ని ఖర్చులూ ఆయనవే. అలాంటిది రెమ్యునరేషన్ కూడా ఇప్పించారు" అని తెలిపారు ప్రదీప్.

ఇందులో ప్రదీప్‌కి డబ్బింగ్ చెప్పింది ప్రముఖ నేపథ్య గాయకుడు ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం. "తొలుత ఈ విషయంలో చాలా బాధపడ్డాను. కానీ సినిమా రిలీజయ్యాక బాలుగారి వాయిస్ వల్ల నా పాత్రకి మంచి డెప్త్ వచ్చిందని అర్థమైంది. నాది టీనేజ్ కాబట్టి వాయిస్ సరిగా వుండదని జంధ్యాల గారు బాలుతో చెప్పించారు" అని వివరించారు ప్రదీప్.

'ముద్దమందారం' పెద్ద సక్సెస్ అయినా - ప్రదీప్‌కి ఎంతో క్రేజ్ వచ్చినా - ఎందుకనో ప్రదీప్‌కి సరైన అవకాశాలు రాలేదు. మద్రాస్‌కి షిఫ్ట్ కాకపోవడం,చదువు కంటిన్యూ చేయాలనుకోవడం, ఎవరినీ అవకాశాలు అడగకపోవటమే ఇందుకు కారణమంటారు ప్రదీప్.

ఈ సినిమా టైటిల్స్‌ని కూడా జంధ్యాల డిఫరెంట్‌గా ప్రజెంట్ చేసారు. తన టైటిల్‌కి మాత్రం బ్యాక్ డ్రాప్‌లో చేతులు జోడించడాన్ని వేసుకున్నారు. తన తొలి సినిమా కాబట్టి అందరికి వినయంగా నమస్కరించారనుకోవాలి.

'లేచిపోయిన ఆడది-పాచిపోయిన కూడు అట్టేకాలం నిల్వవుండవు' లాంటి జంధ్యాల మార్కు డైలాగ్స్ ఈ సినిమాలో చాలానే వున్నాయి.

ఈ సినిమా రిలీజ్‌కు ముందు థియేటర్స్‌లో ట్రైలర్స్ రిలీజ్ చేశారు. వేటూరి పాట మొదలు పెట్టడం, దానికి రమేష్‌నాయుడు ట్యూన్ కట్టడం, ఆ పాటను బాలు ఆలపించడం, పాట చిత్రీకరణకు రిహార్సల్స్ చేయడం, ఓ పల్లెటూళ్ళో పాటను షూట్ చేయడం... ఈ షాట్స్ అన్నీ చూపించి ఫైనల్‌గా 'అలివేణీ ఆణిముత్యమా' పాట చూపిస్తారు. ఈ ఎపిసోడ్ మొత్తాన్ని థియేటర్స్‌లో ట్రైలర్‌గా ప్రదర్శించటాన్ని అప్పట్లో కొత్తగా చెప్పుకున్నారు.

టీనేజ్ లవ్‌స్టోరీ కావడంతో అప్పటి రూల్స్ ప్రకారం ఈ చిత్రానికి 'ఎ' సర్టిఫికేట్ నిచ్చారు సెన్సారు వారు.

ఈ చిత్రాన్ని పద్మినీకొల్హాపురి హీరోయిన్‌గా, జంధ్యాల దర్శకత్వంలోనే హిందీలో తీయాలని ఓ నిర్మాత ముచ్చట పడ్డాడు కూడా !

ఈ చిత్ర శతదినోత్సవ వేడుకలు మద్రాస్‌లోని పామ్‌గ్రోవ్ హోటల్‌లో జరిగాయి. ప్రముఖ దర్శకుడు కె.బాలచందర్ ముఖ్య అతిథిగా విచ్చేసారు. గుమ్మడి, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం తదితరులు అతిథులుగా పాల్గొన్నారు.

తమ ఊళ్లో షూటింగ్ జరుపుకున్న 'ముద్దమందారం' శతదినోత్సవం జరుపుకోవటంతో తెగ సంబరపడ్డ కె.కోటపాడు గ్రామ ప్రజలు జనవరి 22, 1982 నాడు జంధ్యాలకు భారీ ఎత్తున పౌరసన్మానం చేశారు. ఈ సందర్భంగా ప్రసంగించిన జంధ్యాల "జయమాలిని డ్యాన్స్ ఉంటేనే గానీ హిట్ కాని నేటి క్యాబరే యుగంలో, నటనంటే తెలియని నటులతో నిర్మించిన 'ముద్దమందారం' ప్రజాదరణ పొంది నా దర్శకత్వ కీర్తి పెంచింది" అని పేర్కొన్నారు.

నిజంగానే 'ముద్దమందారం' జంధ్యాల కీర్తికిరీటంలో ఓ కలికితురాయిలా నిలిచిపోయింది.

**- పులగం చిన్నారాయణ**

జూలై 14 రోషన్ జయంతిని పురస్కరించుకొని....

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : భిగీరాత్
రచన : మజ్రూహ్‌సుల్తాన్‌పురి
సంగీతం : రోషన్



గానం
లతా మంగేష్కర్

అభినయం
మీనా కుమారి,
ప్రదీప్ కుమార్

## 'దిల్ జో న కెహ్ సకా'

దిల్ జో న కెహ్ సకా
వహీ రాజ్-ఎ-దిల్ కెహెనే కీ రాత్ ఆయీ
దిల్ జో న కెహ్ సకా
నగ్మా సా కోయీ జాగ్ ఉఠా బదన్ మేఁ
ఝుంకార్ కీ సీ థర్-థరీ హై తన్ మేఁ (2)
ప్యార్ కీ ఇన్హీ ధడక్ తీ
ధడక్‌తీ ఫిజావోం మేఁ రెహనే కీ రాత్ ఆయీ ॥దిల్ జో॥
అబ్ తక్ దబీ థీ ఇక్ మౌజ్-ఎ-అర్మాఁ
లబ్ తక్ జో ఆయీ బన్ గయీ హై తూఫాఁ (2)
ఓ....బాత్ ప్యార్ కీ బహక్‌తీ
బహక్‌తీ నిగాహోం సే కెహనే కీ రాత్ ఆయీ ॥దిల్ జో॥
గుజ్‌రే న యే షబ్, ఖోల్‌దూఁ యే జుల్ఫేఁ
తుమ్‌కో ఛుపాలూఁ మూంద్‌కే యే పల్‌కేఁ (2)
ఓ....బేకరార్ సీ లరజ్‌తీ
లరజ్‌తీ సీ ఛాఁవ్ మేఁ రెహనే కీ రాత్ ఆయీ ॥దిల్ జో॥



శాస్త్రీయ సంగీత పద్ధతిని ఆధారంగా చేసుకుని మధురమైన సినీగీతాలు అందించిన సంగీత దర్శకుడు రోషన్. శాస్త్రీయ పద్ధతిలోని సూక్ష్మాలు తెలియనివారిని కూడా ఆ పాటలు ఆకట్టుకునే విధంగా వాద్యపరికరాలను ఎంచుకుని పాటలు రూపొందించటం ఆయన ప్రత్యేకత. డబ్బు కోసం కానీ,పేరు కోసం కానీ ఆయనెప్పుడూ తన నిబద్ధతను విడువలేదు. విజయాలెన్నో సొంతం చేసుకున్నా ఆయన ఏడాదికి రెండో మూడో చిత్రాలు మాత్రమే చేయటం ఇందుకు నిదర్శనం.

రోషన్ అసలు పేరు రోషన్ లాల్ నాగ్‌రథ్. ఆయన చిన్నప్పటి నుంచి సంగీతం నేర్చుకోవటం మొదలుపెట్టారు. లక్నోలోని మారిస్ కాలేజ్ ఆఫ్ మ్యూజిక్‌లో ఆయన సంగీతం అభ్యసించారు. 40 దశకంలో ఆయన ఢిల్లీ ఆలిండియా రేడియోలో చేరి క్రమంగా ఆస్థాన విద్వాంసుడి స్థాయికి ఎదిగారు. ఆ సమయంలో ఓసారి బొంబాయి వచ్చినా చిత్రపరిశ్రమ వాతావరణం నచ్చక ఢిల్లీ వెళ్ళిపోయారు. తన బొటాబొటీ ఆదాయంతో అసంతృప్తి చెంది మళ్ళీ బొంబాయి వచ్చారు. కిదార్ శర్మ ఆయనకు 'నేకీ ఔర్ బదీ' (1950)లో మరో అవకాశం ఇచ్చారు. అందులోని 'ఖయాలోం మేఁ కిసీకే','సున్ బైరీ బలమ్' పాటలు హిట్ కావటం ఆయనకు ఊరట కలిగించింది

50వ దశకం మొదట్లో కొన్ని సరదా పాటలు కిశోర్ కుమార్‌తో పాడించినా-తర్వాత తలత్ మెహమూద్, ముకేశ్‌లనే ఎక్కువ ఎంచుకున్నా -60వ దశకంలో మహాగాయకుడు రఫీకే ప్రాధాన్యమిచ్చారు రోషన్. మాధుర్యానికి పెద్దపీట వేసే రోషన్ పాటలు ఆ మధురగాయకుడి గొంతులో అద్భుతంగా పలికేవి. ఇక లతామంగేష్కర్ అయితే తాను నిర్మించదలచిన సంగీతప్రధాన చిత్రం 'భైరవి'కి రోషన్ సంగీతం అందించాలని పట్టుబట్టారు. ఆ చిత్రం నిర్మాణానికి నోచుకోకపోవటం సంగీతప్రియుల దురదృష్టం. రోషన్ బ్రేక్ ఇచ్చిన గీతరచయితల్లో ఇందీవర్, ఆనంద్‌బక్షీ ప్రముఖులు. సమకాలికులైన సంగీత దర్శకులు కూడా రోషన్‌ని ఎంతో గౌరవించేవారు.

'భీగీ రాత్' చిత్రం కోసం రోషన్ చేసిన 'దిల్ జో న కెహ సకా' ఒక అద్భుతమైన మెలొడీ. లతా,రఫీ గళాల్లో రెండు వెర్షన్లలో ఈ పాట ప్రేమ పరవశాన్ని,విషాదాన్ని ఎంతో ప్రభావవంతంగా ఆవిష్కరిస్తుంది. నాయిక(మీనాకుమారి) నాయకుడి(ప్రదీప్ కుమార్) ప్రేమలో సర్వం మరచి పాడేది మొదటి వెర్షనయితే ఆమె తన ప్రేమ కన్నా మరొకరి (అశోక్‌కుమార్) ఐశ్వర్యానికి ప్రాధాన్యతనిచ్చి అతణ్ని పెళ్ళాడుతోందని భావించినపుడు నాయకుడు బాధతో పాడేది రెండవ వెర్షన్.

కెహనా అంటే చెప్పటం. రాజ్-ఎ-దిల్ అంటే మదిలోని రహస్యం.

'మది ఇన్నాళ్ళూ చెప్పలేకపోయినది
ఆ రహస్యం చెప్పే రేయి ఇది'

ఏకాంతంలో ప్రియుని సరసన ఉన్న ఆమెకు ఇన్నాళ్ళూ చెప్పలేని మదిలోని గుట్టును విప్పాలనుకుంటోంది. ఆ గుట్టేమిటో అతనికి తెలుసు.

నగ్మా అంటే గీతం. 'జాగ్ ఉఠా' అంటే 'నిద్రలేచింది'అని. ఝంకార్ అంటే ఝుమ్మనే శబ్దం. థర్-థరీ అంటే జలదరింపు. ధడ్‌కన్ అంటే స్పందన. ఫిజా అంటే సమయం, వేళ.

'ఈ తనువులో గీతమేదో పలికింది



ఝుమ్మనే నాదంతో పులకరించింది
ప్రేమతో ఊపిరిపోసుకున్న ఈ వేళలోనే మైమరచే రేయి ఇది'

అతని చేరువలో ఆమె మేనులో గీతమేదో పలికింది. తనువు ఝల్లుంది. ప్రేమమయమైన ఆ ఏకాంతం ఎప్పటికీ నిలిచిపోవాలని కోరుకుంటోందామె.

దబీ అంటే నొక్కిపెట్టినది. మౌజ్ అంటే అల. అర్ మాఁ అంటే ఆశ. లబ్ అంటే పెదవులు. బహక్‌నా అంటే కట్టుతప్పటం. నిగాహ్ అంటే చూపు.

'ఇంతవరకు అదిమిపెట్టిన ఆశల అల
పెదాల వరకు వచ్చాక తుఫానయింది
ప్రేమ ముచ్చట్లు నిషా కళ్ళతో చెప్పే రేయి ఇది'

ఇన్నాళ్ళు మదిలో దాచుకున్న ఆశలను ఇపుడు చెబుదామంటే ఆ ఉధృతి తుఫానులా అనిపించింది. పెదవులతో చెప్పలేని భావాలవి. కంటి చూపుతో మాత్రమే చెప్పగలిగేవి. అల తుఫానవటం,ఆ తుఫానులో కళ్ళు కట్టుతప్పటం వంటి చమత్కారాలు మజ్రూహ్ సాబ్ అవలీలగా చేసేశారిక్కడ.

గుజర్‌నా అంటే దాటిపోవటం. షబ్ అంటే రాత్రి . జుల్ఫ్ అంటే కురులు. మూంద్‌నా అంటే మూసుకోవటం. పల్‌కేఁ అంటే కనురెప్పలు. బేకరార్ అంటే అశాంతి,అసహనం. లరజ్‌నా అంటే ఊగటం,కదలటం, ఛాఁవ్ అంటే నీడ.

'ఈ రేయి తెలవారకుండా నా కురులు విప్పనీ
నిను నా కనురెప్పల మాటున దాచనీ
అసహనంగా కదిలే నీడలలో నిలిచే రేయి ఇది'

ఆ రేయి గడిచిపోకుండా తన నల్లని కురులు విప్పి ఆ నీడలో తమ ఏకాంతం ఎప్పటికీ ఉండిపోయేలా చేస్తానంటోంది ఆమె. అతన్ని తన కనురెప్పల మాటున దాచుకుంటానని అంటోంది. కురుల నీడలో, కనురెప్పల నీడలో వారు లోకానికి కనపడకుండా ఉండాలని ఆమె కోరిక.

చిత్రీకరణ పరంగా ఇక్కడో మాట అనుకోవాలి. ఈ సినిమా ఛానల్స్‌లో వచ్చినపుడుకానీ,వీసీడీ దొరికినపుడు గానీ చూడండి. ఈపాటలో మీనాకుమారి తన వ్యక్తిత్వాన్ని ఎంతగా నిలబెట్టుకుందో తెలుస్తుంది! కథనానుసరించి ఈ సన్నివేశంలో వర్షంలో తడవటం చేత,కట్టుకున్న దుస్తులను విడిచి, దొరికిన వేరే దుస్తులతో నటించాలి. విచిత్రమేమిటంటే ఈ నియమం స్త్రీపాత్రలకే వర్తిస్తుంది. ఎందుకంటే బాక్సాఫీసు సూత్రాల ప్రకారం గ్లామర్ పేరిట బోలెడంత ఎక్స్‌పోజింగ్ చేయించేసుకోవచ్చు. కానీ ఇక్కడ నటించబోయేది ఎవరు? మీనాకుమారి...ఎడంచేతి చిటికెన వేలు కూడా చూపించని అతిజాగ్రత్తైన నటి...విపరీతంగా ఎక్స్‌పోజ్ చేసినా, ఇలా జాగ్రత్తగా మ్యానేజ్ చేసినా సన్నివేశం ప్రేక్షకుడికి అర్థమయ్యే తీరుతుందని నమ్మే నటి...అంచేత ఆమె వ్యక్తిత్వానికి తగ్గట్టే కాస్ట్యూమ్స్ రూపొందాయి. ఆ విషయం తెలుసుకోవటం ఇప్పటితరానికి చాలా అవసరం. మనసుకి ఇటువంటి చికిత్సను అందించడానికి ఇటువంటి పాటల్ని చూస్తూ మనమిపుడు ఎక్కడ ఉన్నామో ఆత్మపరిశీలన చేసుకుంటూ ఉండాలి. అటువంటి వ్యక్తిత్వం కలిగిన నటిమీద చిత్రీకరించబోయే పాట స్థాయి పెరిగేది కూడా అప్పుడే !

గానం : మహమ్మద్ రఫీ
అభినయం : మీనా కుమారి,ప్రదీప్ కుమార్,అశోక్ కుమార్

దిల్ జో న కెహ్ సకా
వహీ రాజ్-ఎ-దిల్ కెహెనే కీ రాత్ ఆయీ
దిల్ జో న కెహ్ సకా
నగ్మా సా కోయీ జాగ్ ఉఠా బదన్ మేఁ
ఝుంకార్ కీ సీ థర్-థరీ హై తన్ మేఁ
ఓ...ముబారక్ తుమ్హే కిసీ కీ
లరజీతీ సీ బాహోం మేఁ రెహనే కీ రాత్ ఆయీ ॥దిల్ జో॥
తౌబా యే కిస్‌నే అంజుమన్ సజాకే
టుక్‌డే కియే హైఁ గుంచా-ఏ-వఫా కే (2)
ఉఛాలో గులోఁ కే టుక్‌డే
కి రంగీఁ ఫిజావోం మేఁ రెహనే కీ రాత్ ఆయీ ॥దిల్ జో॥
చలియే ముబారక్ యే జష్న్ దోస్తీ కా
దామన్ తో థామా ఆప్‌నే కిసీకా (2)
హమేఁ తో ఖుషీ యహీ హై
తుమ్హే భీ కిసీ కో అప్‌నా కెహనే కీ రాత్ ఆయీ ॥దిల్ జో॥
సాగర్ ఉఠావో దిల్ కా కిస్‌కో గమ్ హై
ఆజ్ దిల్ కీ కీమత్ జామ్ సే భీ కమ్ హై (2)
పియో చాహే ఖూన్-ఎ-దిల్ ...హో
కి పీతే పిలాతే హీ రెహనే కీ రాత్ ఆయీ ॥దిల్ జో॥



నాయిక తనను మోసం చేసిందనే భావనతో నాయకుడు పాడే పాట కూడా మొదటి పాట పల్లవితోనే మొదలవుతుంది. కొన్నాళ్ళుగా ఆమెపై అనుమానం ఉన్నా ఎంతో కొంత ఆశ ఉంది అతనికి. నేడు ఆ ఆశ అడుగంటి మదిలో దాచుకున్న బాధ బైటికి చెబుతున్నాడు. యాక్సిడెంట్‌లో కాళ్ళు పోగొట్టుకున్న నాయిక అతనికి భారం కాకూడదని అతనికి దూరమయింది. ఆ మాట అతనికి చెప్పలేని పరిస్థితి ఆమెది. ఆమెకు యాక్సిడెంట్ అయిందని అతనికి తెలియదు.

తనకు ఆశ్రయం ఇచ్చిన వ్యక్తి (అశోక్ కుమార్) కి చెడుపేరు రాకూడదని అతనితో పెళ్ళికి ఒప్పుకుంటుంది నాయిక. ఆ ఎంగేజ్‌మెంట్ పార్టీలో పాడతాడు నాయకుడు. మొదటి చరణంలోని మొదటి రెండు లైన్లు రెండు పాటల్లోను ఒకటే.

'ఈ తనువులో గీతమేదో పలికింది
ఝుమ్మనే నాదంతో జలదరించింది
అభినందనలు నీకు
ఊయలూపే ఓ కౌగిలి చేరే రేయి ఇది'

తనదృష్టిలో ఆమె చేసిన వంచనకు అక్కసుతో ఈ పాటపుట్టింది. తనువంతా జలదరించింది. నీవు వేరొకరి కౌగిలి చేరే రేయి ఇది. నీకు అభినందనలు అని కసిగా అంటున్నాడు. పరవశాన్ని తెలిపే లైన్లలోనే ద్వేషాన్ని తెలపటంలో మజ్రూహ్‌సాబ్ పటిమ ఎంత ఉందో రఫీ పాటవం కూడా అంతే ఉంది.

తౌబా అనే మాట ఆశ్చర్యార్థకంలో వాడతారు - మంచికైనా చెడుకైనా. ఇక్కడ 'అయ్యో' అనే భావం వస్తుంది. అంజుమన్ అంటే కలయిక. టుక్‌డే అంటే ముక్కలు. గుంచా అంటే మొగ్గ....వఫా అంటే విశ్వాసం. ప్రేమ అనే అర్థంలోకూడా వాడతారు. గుల్ అంటే పూలు. రంగీన్ అంటే రంగులమయమైనది.

'ఈ కలయిక కల్పించి, ఆపై
ప్రేమ మొగ్గను తుంచి వేశిన వారెవరో!
తుంచిన పూలను వెదజల్లండి
రంగులతో నిండాల్సిన రేయి కదా మరి!

తన ప్రేమను ఆమె మొగ్గలోనే తుంచేసిందని అంటున్నాడతను. ఆ తుంచిన పూలను వెదజల్లి అందరూ సంబరం చేసుకోండని ఒక భగ్న ప్రేమికుడి బాధను వెలిబుచ్చాడు.

'ముబారక్' అంటే 'అభినందన'. జష్న్ అంటే ఉత్సవం. దోస్తీ అంటే స్నేహం. దామన్ అంటే ఆసరా,తోడు అనే అర్థం వస్తుందిక్కడ. థామ్‌నా అంటే అందిపుచ్చుకోవటం. ఖుషీ అంటే ఆనందం.

'ఈ సంగమోత్సవాన అభినందనలందుకో
ఎవరో ఒకరిని తోడు చేసుకొన్నావిన్నాళ్లకు
నాకు సంతోషం కలిగించేదొకటే
తనవారంటూ ఉన్నారని నువ్వు సైతం అనే రోజొచ్చింది'

వారిద్దరి కలయిక కోసం జరిగే ఆ ఉత్సవంతో ఆమెకు అభినందనలు తెలుపుతున్నాడు. 'ఇన్నాళ్ళకైనా ఒక తోడు చూసుకున్నావు' అని వ్యంగ్యంగా అంటున్నాడు. ఈ సన్నివేశంలో ఆమె బాధ అర్థం చేసుకున్న అశోక్ కుమార్ ఆమెను ఊరడిస్తుంటే ఆమె అతని చేయి పట్టుకుని విలపిస్తుంది. అది చూసిన నాయకుడు 'ఇన్నాళ్ళకు ఒకరి ఆసరా తీసుకున్నావు' అనటం సన్నివేశ చిత్రీకరణలో దర్శకుడు కాళిదాస్ ప్రతిభను తెలియజేస్తుంది. 'నువ్వు నా దానివని నేనెప్పుడో అన్నాను. ఇప్పుడు నువ్వు నావారొకరున్నారని అనగలుతున్నావు. నా కదే సంతోషం' అని సూటిపోటి మాటలతో ఆమెను బాధపెడుతున్నాడు అతను.

'సాగర్' అంటే మధుపాత్ర అనే అర్థం ఉంది. (కోయీ సాగర్ దిల్ కో బహలాతా నహీఁ పాట వినే ఉంటారు.) సాగర్ ఉఠానా అనే 'టోస్టింగ్'. ఆనంద సమయంలో మధుపాత్రలనెత్తి తాకిస్తారు కదా! గమ్ అంటే బాధ. కీమత్ అంటే విలువ. ఖూన్-ఎ-దిల్ అంటే హృదయపు రక్తం. జామ్ అంటే మధువు నిండిన పాత్ర.

'మనసు గురించి ఆవేదనెవరికి,మధుపాత్ర నందుకో
మధువుకున్న విలువ నేడు మనసుకు లేదు కదా
కావాలంటే నా హృదయపు రుధిరాన్ని సేవించు
ఈరేయి తాగడానికి,తాగించడానికే యే కదా!

తన మదినే మధుపాత్రనుకుని తన హృదయపు రక్తాన్ని తాగమని ఆహ్వానిస్తున్నాడు. తన మది విలువ మధుపాత్ర కన్నా తక్కువగా భావించి ఆమె తన ప్రేమను పరిహసించి ఉత్సవం చేసుకుంటోందని అతని అభిప్రాయం. అందరూ తాగి ఆనందించే రేయి కదా,నువ్వు నా మది పిండి ఆనందించు అని అక్కసు వెళ్ళగక్కుతున్నాడు.

రోషన్ పాటలలో హైలైట్‌గా నిలిచిపోయిన ఈ పాటలో ముఖ్యంగా 'రా ఆ.....ఆ...త్.....ఆ ఆ ఆ యి యి యీ..అనే చోట జతపడిన ట్యూన్ మరో లోకానికి తీసుకువెళుతుంది. లతా,రఫీ గళాల్లో అది ఎంత బాగా పలికిందో వింటే మది పులకించిపోతుంది.

- పి.వి.సత్యనారాయణరాజు




# పెద్దల్ని అలరించిన 'పిల్ల' గాయని

# 'ఎలీసియా కీస్'



ఇవాళ అంతర్జాతీయ స్థాయిలో గాయనీ గాయకులుగా పేరు తెచ్చుకున్న వాళ్ళు ఎందరో ఉన్నారు. ఉదయం ఒక దేశంలో మధ్యాహ్నం మరో దేశంలో రాత్రికి ఇంకో దేశంలో ప్రదర్శనలిస్తూ ప్రత్యక్ష,పరోక్షంగా వేలాది లక్షలాది అభిమానుల్ని అలరిస్తున్న వారు వున్నారు. అయితే ఈ స్థాయికి వారు చేరడం వెనుక ఎంతో కృషి,మరెంతో పట్టుదల వున్నాయన్నది నిర్వివాదాంశం. కొందరికి ఈ గానకళ పుట్టుకతో అబ్బితే-మరికొందరు అవహేళనల్ని అధిగమించి తమని తాము మలుచుకున్నారు. ఇవాళ అగ్రస్థానంలో వున్న వాళ్ళందరి జీవితాలు 'వడ్డించిన విస్తర్లు' అనుకుంటే పొరపాటే! గాయని ఎలీసియా కీస్ జీవితం కూడా అందుకు మినహాయింపు కాదు.

1981 జనవరి 25న న్యూయార్క్‌లోని మన్‌హట్టన్‌లో జన్మించిన ఎలీసియా జె.అగెల్లో కుక్ తల్లిదండ్రులు రెండు భిన్న సంస్కృతులకి చెందినవారు. తల్లి టెర్రి అగెల్లా ఇటాలియన్-ఐరిస్‌కు చెందినదైతే-తండ్రి క్రైగ్ కుక్ ఆఫ్రికన్ అమెరికన్. దురదృష్టకర విషయం ఏమిటంటే ఈ దంపతులిద్దరూ ఎలీసియాకు రెండేళ్ళ వయస్సులో విడిపోయారు. అప్పటినుండి ఎలీసియా తల్లి సంరక్షణలోనే పెరిగింది. తల్లికి నాటకరంగంలో పరిచయం,నటిగా అనుభవం వుండటంలో ఎలీసియా తప్పటడుగులు వేస్తూ మాటలతో పాటే పాటని నేర్చుకొంది. నాలుగేళ్ళ వయసులోనే గాయనిగా తొలి ప్రదర్శన ఇచ్చింది. కళాకారులలో దాగుండే తృష్ణ ప్రతికూల పరిస్థితుల్లో సైతం ముందుకే నడిపిస్తుందనే దానికి ఎలీసియా జీవితం ఓ ఉదాహరణ. అలవోకగా పాడటం నేర్చిన ఎలీసియా 14 సం॥రాల వయసులో 'బట్టర్ ఫ్లైస్...' అనే పాట రాసింది. దానికి ముందే ఏడు సంవత్సరాల వయసులో న్యూయార్క్ ప్రొఫెనల్ పెర్ఫార్మింగ్ ఆర్ట్స్ స్కూల్‌లో చేరింది. ఒక పక్క గానం....మరోపక్క పియానో సాధన....ఈ రెండింటికీ తగ్గట్టుగా నృత్యం.. మధ్యలో గీత రచన.. ఇలా సంగీత ప్రపంచానికి అంకితమవ్వడం మొదలు పెట్టింది. కెరీర్‌ను ఎంచుకున్న తర్వాత ఎలీసియా ఇక వెనుదిరిగి చూడలేదు. 1996 లోనే, తనతోటి వారికన్నా రెండేళ్ళ ముందే ఎలీసియా గ్రాడ్యుయేషన్ పూర్తి చేసింది, అదీ క్లాస్ ఫస్ట్! 16సం॥ల వయసులో కొలంబియా యూనివర్శిటిలో స్కాలర్‌షిప్‌ని పొందింది. అయితే కొలంబియా రికార్డ్స్ సంస్థలో ఉద్యోగావకాశం రావటంతో చదువుకు ఫుల్‌స్టాప్ పెట్టింది. కానీ తొలి ఉద్యోగంలో ఎలీసియా ఎక్కువ కాలం నిలువలేక పోయింది. బ్రాండ్ నేమ్ వున్న కంపెనీ అయినా ఇమడలేక రాజీనామా చేసింది. అరిస్టాలో చేరింది. జనిస్ జాప్లిన్, విట్నీ హోస్టన్ వంటి గాయకుల్ని

పరిచయం చేసిన క్లిల్ డేలిస్ ఆ కంపెనీ వ్యవస్థాపకుడు, అధ్యక్షుడు. ఆయన కొత్త గాయనీగాయకుల్ని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో జెరికార్డ్స్ సంస్థని స్థాపించాడు. ఎలీసియా జెరికార్డ్స్‌లోకి అడుగుపెట్టింది.

'మెన్ ఇన్ బ్లాక్', 'షఫ్ట్' రీమేక్‌ల సౌండ్ ట్రాక్స్‌కు ఎలీసియా గొంతునిచ్చింది. 20సం॥రాల వయసులో అంటే 2001 జూన్‌లో ఎలీసియా 'సాంగ్స్ ఇన్ ఏ మైనర్' ఆల్బమ్‌ను విడుదల చేసింది. విడుదలైన తొలివారంలోనే 50వేల ఆల్బమ్స్ అమ్ముడుపోయాయి. అమెరికాలో ఈ ఆల్బమ్ కౌంట్ డౌన్ చార్ట్స్‌లో నెంబర్‌వన్ స్థానాన్ని పొందింది. ఆ తర్వాతి నెలలోనే ఎలీసియా బ్రిటన్‌లో 'సాంగ్స్ ఇన్ ఏ మైనర్' ను విడుదల చేసింది. అక్కడ ఈ ఆల్బమ్‌ని పాటలేవీ రేడియోలోనూ,టీవీలోను ప్రసారం కాకముందే -కేవలం మౌత్ పబ్లిసిటీ కారణంగా 'టాప్40' స్థానంలోకి చేరాయి ఈ పాటలు. తొలి ఆల్బమ్‌ని మరిపిస్తూ-కాస్త సమయం తీసుకుని ఎలీసియా రెండో ఆల్బమ్ 'ద డైరీ ఆఫ్ ఎలీసియా కీస్' ను 2003 డిసెంబర్‌లో విడుదల చేసింది. మొదటి వారంలో ఈ ఆల్బమ్ 6,18,000 కాపీలు అమ్ముడు పోయింది. తన మొదటి ఆల్బమ్ 'సాంగ్స్ ఇన్ ఏ మైనర్' మొదటి సంవత్సరం అమ్మకాలకి ఇది రెట్టింపు అని ఎలీసియా చెబుతుంది.

ఈ ఆల్బమ్‌లోని 'యు డోన్ట్‌నో మైనేమ్', 'స్టేట్స్ ఆఫ్ న్యూయార్క్' పాటలు యువతను అమితంగా ఆకట్టుకున్నాయి. జోసఫ్ వైట్ అనే హైస్కూల్ విద్యార్థి ఈ పాటల గురించి వ్యాఖ్యానిస్తూ "ఎలీసీయా మొదటి ఆల్బమ్ పాటల్నీ నేను విన్నాను. కానీ అవి నన్నంతగా ఆకట్టుకోలేదు. ఈ కొత్త ఆల్బమ్‌ని వినకుండా వుండలేకపోతున్నాను. సహజంగా ఇతరుల డైరీలను చదవటం నేరం. కానీ ఎలీసియా మనసుతో పాడిన ఈ 'ద డైరీ ఆఫ్ ఎలీసియా కీస్' ను ఎవరికంటా పడకుండా దాచిపెట్టడం నేరం" అంటున్నాడు సరదాగా. ఈ ఆల్బమ్‌కు విడుదల అయిన వెంటనే యు.ఎస్.బిల్ బోర్డ్ ఛార్ట్స్‌లోనెంబర్ వన్ స్థానాన్ని దక్కించుకుంది. తన ఆల్బమ్‌కి లభిస్తున్న ఆదరణ గురించి ఎలీసియా మాట్లాడుతూ "ఇది వెలకట్టలేని సమయం ప్రపంచ వ్యాప్తంగా సంగీతాభిమానులు నన్ను ఆదరిస్తున్నారంటే ఎంతో ఆనందంగా వుంది. కెరీర్ ప్రారంభ దినాల్లోనే ఇలాంటి స్పందన రావడం మర్చిపోలేనిది. ఇది 'తొలిముద్దు' లాంటిది. మళ్ళీ మరోసారి ఈ అనుభవం దొరకదు" అని అంటోంది.

గాయనిగా తనకింత పేరు ప్రఖ్యాతులు రావడానికి తన తల్లి, స్కూల్‌లోని మ్యూజిక్ టీచర్ కావడమని చెబుతూ "నువ్వు ఏపని చేయటం అయినా మానేయ్....నాకభ్యంతరం లేదు కానీ సంగీతాన్ని వదలకు" అని మా అమ్మ చెబుతుండేది. అలానే మా మ్యూజిక్ టీచర్ గాయనిగా నన్ను తీర్చిదిద్దటం కోసం ఎంతో సమయాన్ని నా కోసం ఓర్పుగా వెచ్చించేది. వాళ్ళిద్దరి శ్రద్ధ, కృషి ఫలితమే ఈవాళ్టి నా విషయం" అంటోంది ఎలీసియా.



అందం... అభినయం... చక్కటి గాత్రం వున్న ఎలీసియా ప్రస్తుతం విస్తృతంగా ప్రపంచ పర్యటన చేస్తోంది. దేశ దేశాల్లోనూ మ్యూజికల్ నైట్స్‌లో పాల్గొంటుంది. 23 సం॥రాల ఆమె అందచందాలను హాలీవుడ్ తెరపైన ఆవిష్కరించడానికి అనేకమంది దర్శక నిర్మాతలు తహతహలాడుతున్నారు. సినిమాల్లో నటించే విషయంలో అచితూచి నిర్ణయం తీసుకుంటోంది ఎలీసియా. మా అమ్మ రంగస్థల నటి. నాకు నటించాలనే వుంది. నటనను వృత్తిగా స్వీకరించి గానాన్ని వదులు కోవటం ఇష్టంలేదు. అయితే మంచి అవకాశాలు వస్తున్నాయి కాబట్టి త్వరలోనే ఓ నిర్ణయం తీసుకుంటాను "అని చెప్పింది. స్వతహాగా గీత రచయిత్రి కూడా అయిన ఎలీసియా త్వరలో రెండు పుస్తకాలు రాయబోతోంది. ఒకటి తన గీతాల సంపుటి కాగా, మరొకటి జీవిత రచన.

చిక్కటి చీకటి గదిలోంచి చొచ్చుకు వచ్చిన కాంతి పుంజపు జీవితావిష్కరణ ఎలా వుంటుందో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు కదా!

**- వి.అరుణ సత్యవతి**

## 1200 టిక్కెట్లు 16 నిమిషాలు

ఎలీసియా కీస్ కి ఇవాళ ప్రపంచ వ్యాప్తంగా అభిమానులున్నారు. తోటి కళాకారులతో కలిసి ఆమె నిర్వహిస్తున్న మ్యూజికల్ నైట్‌కి విపరీతమైన స్పందన ఉంది. 1200 సీట్ల కెపాసిటీ గల కోప్‌హెగన్ లోని రాయల్ థియేటర్‌లో (18వ శతాబ్దానికి చెందిన థియేటర్ ఇది) ఎలీసియా మ్యూజికల్ నైట్స్‌ను ఏర్పాటు చేస్తే కేవలం 16 నిమిషాల్లో ఆన్‌లైన్ ద్వారా టిక్కెట్లు అన్నీ అమ్ముడు పోయాయని నిర్వాహకులు చెబుతున్నారు.

## ఎలీసియా గురించి...

పూర్తిపేరు
**ఎలీసియా జె.అగెల్లో-కుక్**

జన్మదినం
**25 జనవరి,1981, మన్‌హట్టన్,న్యూయార్క్**

చదువు
**కొలంబియా యూనివర్శిటీ**

జన్మరాశి
**కుంభరాశి**

ఇష్టమైన ఐస్‌క్రీమ్
**వెనీల-చాక్లెట్‌తో కలిపి**

మొదటి ప్రదర్శన
**విజర్డ్ ఆఫ్ ఓజ్(నాలుగేళ్ళ వయసులో)**

తొలి గీత రచన
**14 సం॥రాల వయసులో**

మరవలేనని సంఘటన
**తొలి ఆల్బమ్ 'సాంగ్స్ ఇన్ ఏ మైనర్' కి ఐదు గ్రామి అవార్డులు పొందటం..**

కలిసిపనిచేయాలనే కోరిక
**లూరీహిల్, ఆర్.కెల్లీ**

## రాజా ఆడియో రివ్యూ




**విడుదల : హెచ్.ఎం.వి**
**వెల : రూ 80/- (డబుల్ ప్యాక్)**

**య**స్పీ బాలసుబ్రహ్మణ్యం,పి.సుశీల పాడిన 26 యుగళగీతాలను రెండు క్యాసెట్ల రూపంలో ఓ డబుల్ ప్యాక్‌గా హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు. ఇందులో ఉన్న 26 యుగళగీతాలూ హిట్ సాంగ్స్‌గా పేరుతెచ్చుకున్నవే. చుక్కలతో చెప్పాలని (ఉండమ్మా బొట్టు పెడతా)ఒకటై పోదామా ఊహల వాహినిలో(ఆస్తులు -అంతస్తులు), తూరుపు సిందూరపు మందారపు వన్నెలలో (మనుషులు మారాలి),తనువా హరిచందనమే ( కథానాయకురాలు), తొలిచూపు చూసింది హృదయాన్ని (అమ్మాయిగారు-అబ్బాయిగారు), ఓ....కలలు కనే కమ్మని చిన్నారీ (టక్కరి దొంగ-చక్కని చుక్క) వంటి ఎప్పుడు విన్నా బాగుండే పాటలు.....

ఎందుకె ఎందుకె ఎందుకె ఎందుకె చందమామ (అగ్గిమీద గుగ్గిలం), అలకలు తీరిన కన్నులు ఏమనె ప్రియా(మా నాన్న నిర్దోషి) కనుల ముందు నీవుంటే (చెల్లెలి కాపురం), సెలయేటి గలగలా (తులసి), బుగ్గ గిల్లగానే సరిపోయిందా (ముహూర్త బలం), ఏ రాగమో యిది ఏ తాళమో (అమరదీపం) ,కళ్ళలో ఎన్నెన్ని కలలో(మనస్సాక్షి) వంటి అప్పుడప్పుడు వినిపించే పాటలు....

చిలిపి నవ్వుల నిను చూడగానే (అమాయకురాలు), చెలీ నీ కోరికా( సుగుణసుందరి కథ) ఈ రేయి తీయనిది (చిట్టి చెల్లెలు), ఎలా తెలుపను (చిన్ననాటి కలలు),కుశలమా నీకు కుశలమేనా (బలిపీఠం), ఓ బంగరు రంగుల చిలుకా పలుకవే(తోటరాముడు), కొండపైన వెండి వాన(ఇంటి దొంగలు),నీ మాటంటే నాకు అదే వేదము (దేవుడమ్మ),ఏమంటున్నది ఈ గాలి (మేమూ మనుషులమే), సరిగమలూ గలగలలూ (ఇది కథ కాదు), ఇలాగవచ్చి అలాగవచ్చి (గోరింటాకు) వంటి పదేపదే వినిపించిన పాటలు....

చూసేనులే నా కనులే చూడనివింత(నేను మనిషినే),నయనాలు కలిసె తొలిసారి(ఛైర్మన్ చలమయ్య), వంటి అరుదుగా లభించే పాటలు ఇవన్నీ ఏక మొత్తంగా లభించటం-సినీ సంగీత కార్యక్రమాలు నిర్వహించే వారికి - పాటలను కేవలం కాలక్షేపం కోసం మాత్రమే వినేవారి అభిరుచిలో కొంత మార్పు తీసుకురావటానికి - వీలుగా ఉంటుంది. ఆ కోణంలో ఈ డబుల్ ప్యాక్ ఉపకరిస్తుంది. ఇన్ లే కవర్ డిజైన్ విషయంలో కాస్త ఆకర్షణ, కలర్ కాంబినేషన్ పట్ల ఒకింత శ్రద్ధ కన్పించి ఉంటే ఈ క్యాసెట్ మరి కొంతమంది దృష్టిలో పడే అవకాశం ఉండేది.

---




**విడుదల : హెచ్.ఎం.వి**
**వెల : రూ80/-(డబుల్ ప్యాక్)**

**ఒ**కానొక సమయంలో మహిళలు ఎక్కువగా ఇష్టపడే కథానాయకుడు శోభన్‌బాబు నటించిన కొన్ని చిత్రాలలోని పాటలను తీసుకొని 'మనోరంజని' అనే మకుటంపై హిట్స్ ఆఫ్ శోభన్‌బాబు పేరిట హెచ్.ఎం.వి. వారు రెండు ఆడియో క్యాసెట్లను ఓ డబుల్ ప్యాక్‌గా విడుదల చేశారు. ఇందులో 26 పాటలున్నాయి. అన్నీ ఆల్మోస్ట్ అందరికీ బాగా తెలిసినవే!

ఎవ్వరి కోసం ఈ మందహాసం (నర్తనశాల), రంభ ఊర్వశి తలదన్నే (వీరాభిమన్యు),నన్ను ఎవరో తాకిరి (సత్తెకాలపు సత్తెయ్య),చిగురులు వేసిన కలలన్నీ సిగలో పూలుగా మారినవి (పూలరంగడు), చరణ కింకిణులు ఘల్లుఘల్లుమన (చెల్లెలి కాపురం),నీ మనసు నా మనసు ఏకమై (ఇదా లోకం)వంటి ఎప్పుడు విన్నా బాగుండే పాటలు...

ఈ అందానికి బందం వేశానొకనాడు (జీవనతరంగాలు)కన్నె వధువుగా మారేది జీవితంలో ఒకేసారి (శారద),నీవనుకున్నది నే కలగన్నది (డాక్టర్ బాబు), నీకున్నది నేననీ(తాహశిల్దారు గారమ్మాయి), పెళ్ళిమాట వింటే (మాతృదేవత), తొలివలపులలో ఏ చెలికైనా అలక ఉండునని విన్నాను (గంగ-మంగ),ఏదీ ఆ చిరునవ్వు(దేవుడు చేసిన పెళ్ళి),ఎలా ఎలా దాచావో (గోరింటాకు) వంటి రెగ్యులర్‌గా వినిపించే పాటలు....

సన్నజాజి సొగసుంది (కాలం మారింది), పచ్చ జొన్న చేను కాడ చూశానమ్మి (జగజ్జెంత్రీలు), పాపాయి నవ్వాలి పండగే రావాలి (మనుషులు మారాలి),ఇదే పాట ప్రతీ చోటా ఇలాగే పాడుకుంటాను(పుట్టినిల్లు- మెట్టినిల్లు),అణువూ అణువున వెలసిన దేవా(మానవుడు-దానవుడు), ఓ రబ్బీ చెబుతాను (ఖైదీ బాబాయ్), అడగాలని వుంది (చిన్ననాటి స్నేహితులు),ఒకనాటి మాట కాదు(కన్నవారి కలలు), నిత్యసుమంగళి నీవమ్మా (ఇదాలోకం) వంటి పలుమార్లు వినిపించిన పాటలు...

నాలో కలిసిపో(కోడెనాగు),అక్కడ కాదు ఇక్కడ (ఓ అమ్మాయ్ బుల్లెమ్మాయ్ నత్తా చూస్తాడీ అబ్బాయ్...ఈ వాక్యంతో పాట మొదలవుతుంది), (నా తమ్ముడు) నానీ నా పేరుని నిలపాలి (వంశోద్ధారకుడు) వంటి అరుదుగా లభ్యమయ్యే పాటలు ఈ రెండు క్యాసెట్లలో వున్నాయి.

మోము చూడ వేడుకా (భక్తశబరి),చీటికి మాటికి చిటపటలాడే చిన్నది ఇపుడేమన్నది (భార్య), ఒక్కక్షణం(కలసిన మనసులు) వంటి పాటలు హెచ్.ఎం.వి. వారి దగ్గర ఉన్నాయి. ఒకవేళ వెంటనే దొరికే పరిస్థితి లేకపోయినా ఎక్కడ లభిస్తాయో వారికి తెలుసు. అవసరమైతే నిడివి కోసం కొన్ని పాటల్ని తగ్గించుకొని ఈ పాటలను ఉపయోగించుకుని ఉంటే ఈ డబుల్ ప్యాక్ స్థాయి మరింత పెరిగేది.

ఇదిలా ఉండగా ఇన్ లే కవరు లోపలి భాగంలో వాల్యూమ్ -2 కి సంబంధించిన సమాచారంలో కొన్ని తప్పులు దొర్లాయి. అందులో మొదటిది - 'చిగురులు వేసిన కలలన్నీ' పాటకు సంగీత దర్శకుడు పెండ్యాల కాదు. యస్. రాజేశ్వరరావు. రెండవది 'నానీ నా పేరుని నిలపాలి' పాట ఎక్కువ శాతం యస్వీ రంగారావుపై చిత్రీకరించబడింది. దాన్ని శోభన్‌బాబు క్రెడిట్ లో వెయ్యడం సబబుకాదు. అలాగే 'తాహశిల్దార్ గారమ్మాయి' లోని పాట 'నీకున్నది నేననీ' అనే వాక్యంతో మొదలైతే, రెండో వాక్యమైన 'నాకున్నది నీవని' అని ప్రింట్ చేశారు. ఇక ఇవన్నీ ఇలా వుండగా ఇన్ లే కవర్ డిజైన్ ఏ మాత్రం ఆకట్టుకునేలా లేదు. ఈ వాల్యూమ్ 2 లో గల 13 పాటలలో 8 పాటలు సి.నా.రె. రాసినవి. మిగిలిన అయిదూ దాశరథి,దేవులపల్లి, ఆత్రేయ రాసినవి. ఈమాత్రం దానికి విడివిడిగా పేర్కొన కుండా పైన సి.నా.రె. పేరును సింగిల్ కార్డ్‌లా పేర్కొనడం కొంత కన్‌ఫ్యూజన్‌కి తావిస్తుంది. ■


మధుమురళి సమర్పించు
యస్.వి.యస్.వి.ఫిలింస్
పల్లకిలో... పెళ్ళికూతురు
పాటల ప్రత్యేకం
కె.రాఘవేంద్రరావు B.A. దర్శకత్వ పర్యవేక్షణలో
సుచిత్ర చంద్రబోస్ • యం.యం.కీరవాణి • డి.యస్.ప్రసాద్

రచన: చంద్రబోస్ (1) గానం: బాలు, చిత్ర,బృందం

అ: చెంపకి చుక్కను పెట్టి
పాదాలకి పారాణి పూసి
చేతికి గాజులు వేసి
కస్తూరి నుదుట దిద్ది
ముత్యానికి ముస్తాబే చేసి
మా హృదయాలను బోయీలుగా మలచిన ఈ పల్లకిలో..
అ: పల్లకిలో.....పల్లకిలో పెళ్ళికూతురు రాణిలా వుంది
మహరాణిలా వుంది
రాణిగారికి సిగ్గులు వచ్చె
రాజుగారికి చిరునవ్వొచ్చె
ఈ యిద్దరి పెళ్లికి
ఆనందం అతిథిగ వచ్చే ॥పల్లకి॥
చ: మా గూటిలో ఎదిగిన బంగరు బొమ్మా
మా నీడలో వెలిగిన వెన్నెల బొమ్మా
పరిమళాల గంధపుబొమ్మా
సున్నితాల గాజుబొమ్మా
పుట్టినింట లేత బొమ్మా
మెట్టినింట సీత బొమ్మా
ఈ బొమ్మని అత్తింటికి పంపించే ఆనందంలో
మాటరాని బొమ్మలమయ్యాము
మాటరాని బొమ్మలమయ్యాము ॥పల్లకిలో॥
ఆ: నా పెళ్లిలో అతిథులు మీరే కదా
అతిథులంటే దేవుళ్లనే అర్థం కదా
ఈ పందిరి మీ రాకతో
మందిరమే అయ్యింది
నాపై మీ చల్లనిచూపే
వరముల వరదయ్యింది
అ: ఈ అతిథి దేవుడు-ఆ దేవుడ్నే కోరేది
సౌఖ్యంగా నువ్వుండాలనీ
నీ బ్రతుకంతా బాగుండాలనీ ॥పల్లకిలో॥

రచన: చంద్రబోస్ (3) గానం: కళ్యాణిమాలిక్, సుమంగళి

అ: ముద్దులేని ప్రేమ-ప్రేమ కాదనీ
ఆ: ప్రేమలేని ముద్దు-ముద్దు కాదనీ
అ: ముద్దు ముద్దు ప్రేమలో
ఆ: ప్రేమకోరు ముద్దులో
అ: ముద్దు ముద్దు ప్రేమలో
ఆ: ప్రేమకోరు ముద్దులో
అ: ముద్దులన్ని బంతి చెయ్యనీ
ఆ: ముద్దబంతి చేతికివ్వనీ ॥ముద్దు॥
అ: దా పదా ఇలా అనే-పదాల కన్న సైగ గొప్పది
ఆ: ఛీ - ఛీ ఛీ - ఛీపో అనే- జవాబు కన్న నవ్వు గొప్పది
అ: చిలిపి లోకాన్ని సృష్టించగా-బ్రహ్మ కన్న భామ గొప్పది
ఆ: కలల స్వర్గాన్ని చూపించగా - నింగి కన్న నేల గొప్పది
ఆ: నిన్న నువ్వుగొప్ప-నేనుగొప్ప-నేటి నుంచి ప్రేమ గొప్ప
ప్రేమ మూగదైన వేళ ముద్దుచప్పుడెంత గొప్పది..... ॥ముద్దు॥
అ: ఏయ్ మనోహరా అనే -పొగడ్త కన్న తిట్టు తియ్యన
ఆ: ఏయ్ సఖీ చెలి అనే-సుఖాని కన్న తగవు తియ్యన
అ: అసలు అందాల వడ్డింపులో
అవును కన్న కాదు తియ్యన
ఆ: సిసలు వయ్యారి సయ్యాటలో
గెలుపుకన్న అలుపు తియ్యన
అ: అడిగి పుచ్చుకున్న ముద్దుకన్న
గుంజుకున్న ముద్దులోన
తీపివున్నదన్న మాట ఘాటు ముద్దుతోనే చెప్పనా ॥ముద్దు॥

రచన: చంద్రబోస్ (2) గానం : చక్రి, గంగ

అ: స - ఒక చినుకు
రి - ఒక చినుకు
గా - ఒక చినుకు
చినుకు చినుకు కలిసి కలిసి చిటికెలోన వానైతే
వ వావా వావావావా
వానకు తడిసిన ఒళ్లు
గుండెకు పెట్టెను చిల్లు, గుండెకు పెట్టను చిల్లు
ఆ: I - ఒక చినుకు
Love - ఒక చినుకు
U - ఒక చినుకు
చినుకు చినుకు కలిసి కలిసి చిటికెలోన వానైతే
వ వావా వావావావా
వానకు తడిసిన ఒళ్లు మనసుకు ఇచ్చెను కళ్లు
మనసుకు ఇచ్చెను కళ్లు
ఆ: మేఘాల చెట్టునుండి రాలుతున్న నీటిమొగ్గలు
చినుకులు చినుకులు
ఆకాశ భాషలోన అందుతున్న నీటి లేఖలు
చినుకులు చినుకులు
అ: నీలోని సిగ్గులన్ని దోచుకున్న నీటి దొంగలు - చి ను కు లు
ఆవిరులు రేపుతున్న చల్లనైన నీటి నిప్పులు
చినుకులు చినుకులు
ఆ: నా మేని మెలికలోన మునుగుతున్న
చిన్ని చిన్ని పడవలు -చినుకులు
ఆ: ఈ నేలమీది జాబిలికై
నింగినుంచి జారుతున్న కోటి కోటి నీటి తారలు
కొ - ఒక చినుకు
గి - ఒక చినుకు
లి - ఒక చినుకు
చినుకు చినుకు కలిసి కలిసి చిటికెలోన వానైతే.......
ఆ: వ వావా వావావావా
వానకు తడిసిన ఒళ్లు కమ్మని కవితలు అల్లు
కమ్మని కవితలు అల్లు
అ: ఆ వానదేవుడొచ్చి తొడుగుతున్న
నీటి దుస్తులు -చినుకులు చినుకులు
నీ వన్నె చిన్నెలన్ని తడుముతున్న
నీటి చేతులు - చినుకులు చినుకులు
ఆ: బాణాలు మాని మదనుడొదులుతున్న
నీటి ఈటెలు - చి ను కు లు
అందాల కడ్డుగోడ కట్టలేని
నీటి ఇటికెలు -చినుకులు చినుకులు
అ: నా ముందు బారు తీరి నిలిచివున్న
నీటి రాయబారులు - చినుకులు
ఆ: ఉత్సాహం వుప్పొంగిపోగా దోసిలిలో
చిక్కుతున్న సప్తసాగరాలు చినుకులూ
ఆ: చి
అ: ఒక చినుకు
ఆ: ను
అ: ఒక చినుకు
ఆ: కు
అ: ఒక చినుకు
ఇ: చినుకు చినుకు కలిసి కలిసి చిటికెలోన వానైతే.......
వ వావా వావావావా
వానకు తడిసిన ఒళ్లు సిగ్గుకు సిగ్గులు చెల్లు
సిగ్గుకు సిగ్గులు చెల్లు ॥వానకు॥

రచన: చంద్రబోస్ (4) గానం : సునీత, కీరవాణి

ప: నా పేరు చెప్పుకోండి మీలో ఎవరైనా
నా పేరు చెప్పుకోండి మీలో ఒకరైనా
చల్లగాలి చందమామ మల్లెతీగ చిలకమ్మ మీలో ఒకరైనా ॥నా పేరు॥
అ: కవిత...సరిత...మమత...నిఖిత...రెండు జెళ్ళ సీత
ప్రతిమా...ఫాతిమా...మహిమా...ఉమా...సత్యభామా
చ: నీలి మేఘాలతోటి ఆడుకుంటానుగానీ - నా పేరు నీలిమ కాదు
అన్నిరాగాల బాణీ పాడుకుంటానుగానీ
నా పేరు రాగిణి కాదు
బంగారమంటి మనసుందికానీ - నా పేరు కనకం కాదు
భోగాలు పంచే సొగసుందికానీ - నా పేరు భాగ్యం కాదు
ఒహ్హో హ్హో...ఒహో హ్హో హ్హో
ఓటమంటె ఒప్పుకోను విజయను కాను
వట్టిమాట చెప్పలేను సత్యను కాను
మీ ఊహతే వదిలేస్తున్నాను ఊహను కాను... కల్పన కాను
నా పేరు ....నా...నా...నా పేరు చెప్పుకోండి మీలో ఎవరైనా
నా పేరు చెప్పుకోండి మీలో ఒకరైనా
చ: చిన్ని చెక్కిళ్ళలోన కొన్ని గులాబిలున్నా - నా పేరు రోజా కాదు
అన్ని పుష్పాలు చేరి నన్ను అర్చించుతున్నా
నా పేరు పూజిత కాదు
ఏ కన్ను సోకని కన్నెను అయినా - నా పేరు సుకన్య కాదు
అమవాస్య చీకటి అంటదు ఎపుడు -నా పేరు పూర్ణిమ కాదు
ఒహ్హో హ్హో...ఒహో హ్హో హ్హో
బోలెడంత జాలివుంది కరుణను కాను
అంతులేని పేరు వుంది కీర్తిని కాను
మీరే మీరే తేల్చాలండి మీరానసలే కానే కాను
నా పేరు ....నా...నా...నా పేరు చెప్పుకోండి మీలో ఎవరైనా
నా పేరు చెప్పుకోండి మీలో ఒకరైనా
చల్లగాలి చందమామ మల్లెతీగ చిలకమ్మ మీలో ఒకరైనా ॥నా పేరు॥
కో: రాణి రాణి....రాణి రాణి...రాణి రాణి

రచన: చంద్రబోస్ (5) గానం: కీరవాణి,పద్మలత

అ: చీరలోని గొప్పతనం తెలుసుకో
ఈ చీరకట్టి ఆడతనం పెంచుకో
సింగారమనే దారంతో చేసింది చీర
ఆనందమనే రంగులనే అద్దింది చీర
మమకారమనే మగ్గంపై నేసింది చీర... ॥చీర॥
మడికట్టుతో నువ్వు పూజచేస్తే
గుడి వదిలి దిగివచ్చును దేవుడు
ఎంకికట్టుతో పొలం పనులుచేస్తే
సిరిలక్ష్మిని కురిపించును పంటలు
జారు కట్టుతో పడకటింట చేరితే
గుండెజారి చూస్తాడు పురుషుడు
నిండు కట్టుతో నువు నడిచెలుతుంటే
దండాలే పెడతారు అందరూ
అన్నం తిన్న తదుపరి నీ మూతిని తుడిచేది
కన్నీరై వున్నప్పుడు నీ చెంపను తడిమేది
చిన్న చీర కొంగులోన కన్నతల్లి వున్నది ॥చీర॥
పసిపాపలా నిదరపోయినప్పుడు
అమ్మ చీరే మారేను వూయలగా
పువ్వై నువ్వు విచ్చుకున్నప్పుడు
ఈ చీరేగా అందాలకు అడ్డు తెర
గాలి ఆడక ఉక్కపోసినప్పుడు
ఆ పైటెగా నీ పాలిట వింజామర
ఎండావానా నీకు తగిలినప్పుడు
ఆ కడకొంగే నీ తలపై గొడుగు
విదేశాల వనితలకు సారెపోసి పంపేది
భారతీయ సంస్కృతిని సగర్వంగా చాటేది
మన జాతీయ జెండాకు సమానంగా నిలిచేది ॥చీర॥
ఆ: చీరలోని గొప్పతనం తెలుసుకో
ఈ చీరకట్టి ఆడతనం పెంచుకో

రచన: చంద్రబోస్ (6) గానం : యస్.పి.చరణ్. నిత్యసంతోషిణి

ఆ: తం నం నననన
నం నం తననన
నం నం నననన నం
నననన
నం నం నననన
నం నం నననన
నం నం నన నం
అ: ఎంతమాట ఎంతెంత మాట ఎద గంతులు వేసే మాట
చిన్నమాట బహు చిలిపి మాట నువ్వు చెవిలో పూదిన మాట
అరెరెరె రెరెరెరెరె....రెరెరెరెరెరె
నువు ప్రే -నే మా
మనమే ప్రేమా
ప్రేమే మనం-అయ్యే క్షణం- మనకింకేం కావాలి
ఆ: అరెరెరె రెరెరెరెరె....రెరెరెరెరెరె
నువు ప్రే -నే మా
మనమే ప్రేమా
ప్రేమే మనం-అయ్యే క్షణం- మనకింకేం కావాలి
మాటాకావాలా? మనసు కావాలా?
అ: మనసందించే మాట కావాలి
ఆ: నవ్వుకావాలా? నడక కావాలా?
అ: నాతో నడిచే నవ్వు కావాలి
ఆ: పువ్వు కావాలా? మువ్వ కావాలా?
అ: రెండిటి నడుమన నడుము కావాలి
ఆ: నువ్వు కావాలా ? నేను కావాలా?
అ: నువ్వు నేనొక జంట కావాలి
ఆ: నాకున్నవి నీకివ్వగా-యిక నేనేం కావాలి...
అ: అరెరెరె రెరెరెరెరె....రెరెరెరెరెరె
నువు ప్రే -నే మా
మనమే ప్రేమా
ప్రేమే మనం-అయ్యే క్షణం- మనకింకేం కావాలి
ఆ: తం నం నననన
నం నం తననన
నం నం నననన నం
నననన
నం నం నననన
నం నం నననన
నం నం నన నం
తేనె కావాలా? చెఱుకు కావాలా?
అ: చెఱుకో తేనో చెలిమి కావాలి
ఆ: కొంత కావాలా? అంతా కావాలా?
అ: అంతకు మించి ఏమి కావాలి
ఆ: యిపుడు కావాలా? రేపు కావాలా?
అ: యిప్పటిలాగే రోజూ కావాలి
ఆ: యీడు కావాలా? తోడు కావాలా?
అ: యిద్దరి అడుగులు ఏడు కావాలి
ఈ ప్రేమకి -ప్రతిజన్మకి నే కావలి కావాలి
అరెరెరె రెరెరెరెరె....రెరెరెరెరెరె
నువు ప్రే -నే మా
మనమే ప్రేమా
ప్రేమే మనం-అయ్యే క్షణం- మనకింకేం కావాలి
ఇ: తం నం నననన
నం నం తననన
నం నం నననన నం
నననన
నం నం నననన
నం నం నననన
నం నం నన నం

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

మధుమురళి సమర్పించు
యస్.వి.యస్.వి.ఫిలింస్



## తారాగణం

గౌతమ్, రతి, గిరిబాబు, తనికెళ్ళ భరణి, బ్రహ్మానందం, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, యం.యస్.నారాయణ, సునీల్, వేణుమాధవ్, బాలయ్య, రవిబాబు, కొండవలస లక్ష్మణరావు, ముస్తాఫా, రమాప్రభ, తెలంగాణా శకుంతల, సుధ, హేమ, శిరీష, షకీల, సునయన, అశ్వినీశర్మ, సత్తిపండు.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : యం.యం. కీరవాణి |
| ఫోటోగ్రఫీ | : వి. శ్రీనివాసరెడ్డి |
| ఎడిటింగ్ | : మార్తాండ్. కె.వెంకటేష్ |
| మాటలు | : అబ్బూరి రవి |
| పాటలు | : చంద్రబోస్ |
| కొరియో గ్రఫీ | : సుచిత్ర చంద్రబోస్ |
| ఆర్ట్ | : డి. వై. సత్యనారాయణ |
| ఫైట్స్ | : రామ్, లక్ష్మణ్ |
| కాస్ట్యూమ్స్ | : లోకేష్ |
| మేకప్ | : శ్రీను |
| పి.ఆర్.ఓ. | : ఎల్.వేణుగోపాల్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : జె. సాంబశివరావు |
| నిర్మాత | : ప్రసాద్.దేవినేని |
| సమర్పణ | : యస్.మధుమురళి |
| కథ,దర్శకత్వం స్క్రీన్ ప్లే, | : సుచిత్రా చంద్రబోస్ |
| దర్శకత్వ పర్యవేక్షణ | : కె.రాఘవేంద్రరావు |

# పల్లకిలో... పెళ్లికూతురు

కె.రాఘవేంద్రరావు B.A. దర్శకత్వ పర్యవేక్షణలో
సుచిత్ర చంద్రబోస్ • యం.యం.కీరవాణి • డి.యస్.ప్రసాద్


సుంకర మధుమురళి


డి.యస్.ప్రసాద్


కె.రాఘవేంద్రరావు


సుచిత్ర చంద్రబోస్


యం.యం.కీరవాణి


చంద్రబోస్

జులై 11 మణిశర్మ పుట్టినరోజు సందర్భంగా....

# మణిశర్మ ఫీలింగ్స్



నాకు మైసూర్ పాక్ అంటే ఇష్టం అని పుట్టినరోజు నాడు మైసూర్ పాక్ తప్పనిసరిగా చేస్తారు. కారాల్లో ఇష్టమైనది ఆవకాయే.

తెల్లటి సన్నటి బియ్యంతో వండిన అన్నం, చూడగానే నోట్లో నీళ్లూరించే ఎర్రటి ఆవకాయ, ఘుమఘుమలాడే నెయ్యి, వీటి కాంబినేషన్‌తో శుభ్రమైన పళ్ళెంలో కలుపుకున్న ఆవకాయ అన్నం రుచి తెలియాలంటే నోట్లోనే పెట్టుకోవాలి. కంట్లోనో, చెవిలోను పెట్టుకోలేం కదా... అలాగే చక్కగా తయారైన పాటకి తగిన సిట్యుయేషన్ ఉండి తీరాలి.

అన్నిరకాల మ్యూజిక్కూ వింటాను. పొద్దున్న ఆధ్యాత్మికపరమైన సంగీతం వింటాను. ఈ మధ్య ఫ్యూజన్‌లో చేసిన సేక్రెడ్ ఛాంట్స్ కొన్ని సీడీలుగా వచ్చాయి. అవి వింటున్నాను. రాత్రిళ్లు గజల్స్... ముఖ్యంగా గులాం ఆలీ గారివి, వెస్టర్న్ క్లాసిక్స్ వింటాను.

ఎంత గొప్పగాయకుడు పాడినా నేను అనుకున్నట్టుగా నా పాట రానప్పుడు ఇంకొకరితో మళ్లీ పాడించడం విషయంలో నేనెటువంటి మొహమాటాన్నీ ఫీలవను.

టీవీ ఛానల్స్ చూసేది పొద్దున్న ట్రెడ్‌మిల్ మీద ఎక్సర్‌సైజులు చేసేటప్పుడు మాత్రమే.

మన మ్యూజిక్ వల్ల ప్రొడ్యూసర్‌కి నాలుగు డబ్బులు రావటం ముఖ్యం. మన టాలెంట్ ప్రూవ్ చేసుకోవటం ఓ క్రయిటీరియా కాదు. ఆ దృష్టి ఏ హీరో ఇమేజ్‌కి తగ్గట్టుగా ఆ టైప్ సాంగ్స్ చేసి ఇవ్వడం క్రెడిట్ అనే అనుకుంటున్నాను. అంతేగాని నాదైన ముద్రని రుద్దడం భావ్యం కాదు. నాకు నచ్చిన పాటలు మాత్రమే చెయ్యాలనుకుంటే శాస్త్రీయ సంగీత కచ్చేరీలు చేసుకుంటాను.

లంచ్ తర్వాత నిద్రపోకూడదని మధ్యాహ్నం హోమ్ థియేటర్‌లో రోజూ ఏదో ఓ సినిమా చూస్తాను.

నా మొట్టమొదటి ఇంటర్వ్యూ నుంచి ఈ ఇంటర్వ్యూ దాకా తప్పనిసరిగా చెబుతున్నది ఒకటే మాట - ఏ పిక్చర్‌లోని సంగీతానికైనా 50% బాధ్యత దర్శకునిదే......

పుట్టినరోజు నాడు నా ఫ్యామిలీతోనూ, నా మ్యూజిక్ ఫ్యామిలీ (అంటే రెగ్యులర్‌గా నాతో పనిచేసే నా సాంకేతిక బృందం)తోనూ మాత్రమే గడుపుతాను.

నాకు తెలిసి ఇళయరాజా గారిది ఓ ప్రత్యేకమైన పుట్టుక. అందుకే మ్యూజిక్ విషయంలో ఆయన అనుకున్నది చెయ్యగలిగారు.

'మెరుపుకలలు' దర్శకుడు రాజీవ్‌మీనన్ నాకు మంచి ఫ్రెండు. 'నీ ఫోటో నేను తప్ప ఇంకెవరూ తియ్యకూడదు' అని ఓ ఫోటో తీశాడు. ఇవాళ అన్ని క్యాసెట్ కవర్‌ల పైనా, పత్రికల్లో ఇంటర్వ్యూలకి నేనిచ్చే ఫోటో అదే..! అదొక సెంటిమెంటయి కూచుంది. మరొకటి తీయించుకుందాం అంటే అతను దొరకడు. ఎక్కడ చూసినా ఆ ఒక్కఫోటోయే కనిపించడానికి కారణం అదే !

# మణిశర్మ మధురగీతాలు

**చిత్రం : కళ్యాణరాముడు**

రచన: చంద్రబోస్ గానం : శంకర్ మహదేవన్, సుజాత బృందం

అ:గుత్తొంకాయా గుత్తొంకాయా
గుంతలకిడి గుమ్మపేరు గుత్తొంకాయా
గుమ్మడికాయా గుమ్మడికాయా
కొంటెదాని ఒంటిపేరు గుమ్మడికాయా
కోపమె ఎంతున్నా కత్తికే లొంగాలి
వన్నెలే ఎన్నున్నా నూనెలో వేగాలి
గీరగా చూస్తున్నా కూరలా మారాలి
నీటుగా ఆ పైనా నోటికే అందాలి
బుద్ధిగా మాటే వింటూ వంటింట్లోనే నువ్వుండాలి ॥గుత్తొం॥
ఆ:అందంగా వండి వార్చు కలియుగ భీమా
కో: పమప పమద గమపామ గరిగ సా
కళ్యాణం అంటె నీకు తెలియదు లేమ్మా
పమప పమద పమప పాపపా
అ:వధువే వయ్యారాలా తాజా టమాటా
వరుడే ఘాటు మసాలా
మంత్రం వంటింట్లోనే తాలింపు చిటపట
హోమం గ్యాస్ స్టౌ జ్వాలా
ఆ:మండపం ఏదంటా పండితుడు ఎవరంటా
బంధువులు చుట్టాలా సంగతులు ఏంటంటా
అ:బాండీ మండపము గరిటే పండితుడు
అల్లం వెల్లుల్లి అందరూ బంధువులు
పచ్చని పసుపు రంగే వధువు మెళ్ళో మాంగల్యమేగా ॥గుత్తొం॥
ఆ:అప్పడమూ దప్పళమూ అన్నిటికన్నా
కో : ఓ....
ఆ:కాపురమే చెయ్యడమూ తెలుసా కన్నా
కో : ఓ....
అ:మనసే పుచ్చుల్లేని కాయే అవ్వాలి
మమతే పొంగుతుండాలి....హో.....
జతగా ఉప్పు కారం రెండూ కలవాలి
బ్రతుకున రుచి పెరగాలి.....హో...
ఆ:కలతలు కష్టాలా చేదును సహించి
కులుకుల సుఖాలా తీపిని గ్రహించి
అ:గొడవలు పంతాలా వగరుని త్యజించి
మధురస బంధాలా ఎంగిలి భుజించి
ఇద్దరూ విందులు చేస్తూ
వందేళ్ళుంటే సంసారమేనా
అ:గుత్తొంకాయా గుత్తొంకాయా
గుంతలకిడి గుమ్మపేరు గుత్తొంకాయా
గుమ్మడికాయా గుమ్మడికాయా
కొంటెదాని ఒంటిపేరు గుమ్మడికాయా
కోపమె ఎంతున్నా కత్తికే లొంగాలి
వన్నెలే ఎన్నున్నా నూనెలో వేగాలి
గీరగా చూస్తున్నా కూరలా మారాలి
నీటుగా ఆ పైనా నోటికే అందాలి
బుద్ధిగా మాటే వింటూ వంటింట్లోనే నువ్వుండాలి ॥గుత్తొం॥
కో: భలే భలే చెప్పావోయ్ కళ్యాణరామా
రంజు భలే చెప్పావోయ్ రఘుకులరామా
భలే భలే చెప్పావోయ్ కళ్యాణరామా
రంజు భలే చెప్పావోయ్ రఘుకులరామా

**చిత్రం : మురారి**

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి గానం : చిత్ర

చెప్పమ్మా చెప్పమ్మా చెప్పమ్మా చెప్పమ్మా చెప్పేసేయ్
అంటోంది ఓ ఆరాటం
తప్పమ్మా తప్పమ్మా తప్పమ్మా తప్పమ్మా ఆగమ్మా
అంటోంది ఓ మొహమాటం
నువ్వంటే మరి అదేదో ఇది అనేద్దామనే వున్నది
ఫలానా అని తెలీదే మరి ఇలా నీకు చెప్పాలని ॥చెప్పమ్మా॥
వెంట తరుముతున్నావే ఏంటి ఎంత తప్పుకున్నా
కంటికెదురు పడతావే ఏంటి ఎటు చూసినా
చెంప గిల్లి పోతావే ఏంటి గాలి గిల్లుతున్నా
అంత గొడవ పెడతావే ఏంటి నిద్దరోతువున్నా
అసలు నీకు ఆ చొరవే ఏంటి తెలియకడుగుతున్నా
ఒంటిగా వుండలేవేంటి ఒక్క నిమిషమైనా
ఇదేం అల్లరి భరించేదెలా అంటూ నిన్నెలా కసరనూ
నువ్వేం చేసినా కాదంటుందని నిజం నీకెలా చెప్పనూ ॥చెప్పమ్మా॥
నువ్వు నవ్వుతుంటే ఎంతో చూడముచ్చటైనా
ఏడిపించ బుద్ధౌతుంది ఎంతాగినా
ముద్దుగానే వుంటావేమో మూతి ముడుచుకున్నా
కాస్త కస్సు మనవే ఎంత కవ్వించినా
నిన్ను రెచ్చగొడుతూ నేనే ఓడిపోతువున్నా
లేని పోని ఉక్రోషంతో ఉడుకెత్తనా
ఇదే చూడగా మహా మాయగా ఎటో నువ్వు చూస్తూ వున్నా
అదేంటో మరి ఆ పొగరే నచ్చి పడిఛస్తున్నా హయ్యో రామా
చెప్పమ్మా చెప్పమ్మా చెప్పమ్మా చెప్పమ్మా చెప్పేసేయ్
అంటోంది ఓ ఆరాటం
తప్పమ్మా తప్పమ్మా తప్పమ్మా తప్పమ్మా ఆగమ్మా
అంటోంది ఓ మొహమాటం
నువ్వంటే మరి అదేదో ఇది అనేద్దామనే వున్నది
ఫలానా అని తెలీదే మరి ఇలా నీకు చెప్పాలని
చెప్పమ్మా చెప్పమ్మా చెప్పమ్మా ఐ లవ్ యూ చెప్పేసేయ్
అంటోంది ఓ ఆరాటం
ఐ లవ్ యు ॥౬॥

**చిత్రం : అనగనగా ఓ అమ్మాయి**

రచన: వేటూరి సుందరరామ్మూర్తి గానం : యస్పీ బాలసుబ్రహ్మణ్యం, చిత్ర

ఆ: నేనా నీవే నేనా
అ: నేనే నీలో లేనా
ఆ: నవ్వుతూ నాలో జల్లే పూలేవాన
అ: యవ్వనాలెగసే వేళ రావే మైనా ॥నేనా॥
అ: వయ్యారాల మేన సొగసుయ్యాలూగు దాన
ఆ: జాలువారు జంట తేనె జంట కోరి పారలి పొంగగా
అ: సౌందర్యాల సోల నను సోకే చూపులోనా
ఆ: ప్రాణమల్లె జీవితాన ప్రాయమంతా వెల్లి విరియగా
ఆ: పచ్చగిల్లు నీ పాదాలే పారాణి లేకనేనా
అ: వెచ్చగిల్లు నీ వొళ్ళోనా వేసంగి జల్లు కానా అ : ॥నేనా॥
అ: సాయంకాలాలోనా నీ సాయం కోరుకోనా
ఆ: ఎంకి పాట మీద ఆన నిన్ను చేరి నీడనవ్వనా
అ: పూలే ఇచ్చుకోనా విరబూసే ఈడు కానా
ఆ: అందమంతా హారతైనా శ్రీమతల్లే వచ్చి నిలవనా
అ: నీ కాలి మువ్వనే కాలేనా పెనుగాలి దివ్వెనైనా
ఆ: రాగమైనా ఈ బంధానా నే పల్లవించిపోనా ఆ: ॥నేనా॥

# సెన్సేషన్ ఆమె సెకండ్ నేచర్



పాటలంటే ఇష్టపడేవారికి విజయలక్ష్మి గురించి పరిచయం చెయ్యనక్కర్లేదు. స్టేజ్ ప్రోగ్రామ్‌ల ద్వారా, టీవీ ప్రోగ్రామ్‌ల ద్వారా కొన్నేళ్లుగా కొన్ని లక్షల మంది ప్రేక్షక శ్రోతలలో తనదైన ముద్రను వేసుకుందామె. ఎటువంటి పాటనైనా పాడగలగడం- కొన్ని కొన్ని విలక్షణ కంఠాలను యథాతథంగా అనుకరిస్తూ పాడగలగటం - ముఖ్యంగా స్క్రిప్టును చూడకుండా పాడగలగడం - ఇవన్నీ విజయలక్ష్మి స్థిరాస్తులు. వార్తల్లోని వ్యక్తిగా ఎప్పుడూ ఉండటం కోసం కొత్త కొత్త ఆలోచనలతో కార్యక్రమాలను రూపొందించుకోవటం, వాటిని విజయవంతంగా పూర్తి చేయటం, అందుకు తగ్గ సహాయక సాధనాలను సమకూర్చుకోగలగటం మొదలైనవి ఆమె చరాస్తులు.



ప్రముఖ గాయనీమణులు రావుబాలసరస్వతీ దేవి, సుశీల, ఎల్లారీశ్వరి, జిక్కి లీల చేతులమీదుగా సత్కారాన్ని అందుకుంటున్న విజయలక్ష్మి

ఇరవై నాలుగు గంటల కార్యక్రమమైనా, అయిదు రోజుల పాటు జరిగే కార్యక్రమమైనా, మొదటి రోజు మొదటి పాట పాడుతున్నప్పుడు గొంతు ఎంతఫ్రెష్‌గా ఉంటుందో ఆ యా కార్యక్రమాల ముగింపు రోజున ఆఖరు పాట పాడుతున్నప్పుడు కూడా అలాగే ఉండగలిగే స్వరం భగవంతుడామెకు ఇచ్చిన వరం !!

గతనెల 13 నుంచి 17 వరకూ హైదరాబాద్ రవీంద్రభారతిలో 10 మంది సంగీత దర్శకులు స్వరపరిచిన పాత పాటలను ఆమె పాడినప్పుడు ప్రతిరోజూ థియేటర్ కిక్కిరిసి పోయింది. ఇటీవల ఇంత స్పందన లభించిన కార్యక్రమం ఇదేనని అన్ని పేపర్లూ ప్రముఖంగా పేర్కొన్నాయి.

సెన్సేషన్ సెకండ్ నేచర్‌గా రూపుదిద్దుకున్న విజయలక్ష్మి 'హాసం'తో పంచుకున్న అభిప్రాయాలూ, అందులోనే ప్రశ్నలూ - సమాధానాలూ, వగైరా వగైరా... చిత్తగించండి....

మాఫాదర్ రామకృష్ణ ప్రసాద్ మంచి కర్నాటిక్ సింగర్. మా మదర్ సుగుణ కూడా క్లాసికల్ నేర్చుకుని రేడియోలో ప్రోగ్రామ్స్ ఇచ్చారు. వాళ్లిద్దరూ పాడటం వల్ల పాడటం అనేది నేచురల్‌గా నాకు వచ్చింది. నేను పుట్టింది మచిలీపట్నం. మా ఫాదర్ ఉద్యోగరీత్యా వేర్వేరు ఊళ్లలో ఉన్నప్పుడు స్కూళ్లలో పాడటం... కాంపిటీషన్స్‌కు వెళ్లటం జరిగేది. 74-75 లలో మేం హైదరాబాద్‌కు మకాం మార్చేశాం. అప్పుడు ఇక్కడ కల్చరల్ అసోసియేషన్స్‌తో పరిచయం ఏర్పడింది. మా దూరపు బంధువైన పి.వి.సాయిబాబా గారు నా గొంతు విని బాగా పాడుతున్నానని ఎన్నో పాటలు నేర్పించి ప్రోగ్రామ్స్‌లో పాడించి ఎంకరేజ్ చేశారు. అదే సమయంలో బాల మురళీ గారి శిష్యురాలైన సుబ్బలక్ష్మి గారు... మా కాలనీలోనే, మాకు దగ్గరగా ఉండేవారు. మా అక్క, నేనూ ఆవిడ దగ్గర నాలుగేళ్ల పాటు క్లాసికల్ నేర్చుకున్నాం.



మరీ ఎక్కువ నేర్చుకున్నానని చెప్పలేను. పాడడం నేచురల్‌గా బ్లడ్‌లో ఉంది కాబట్టి శృతి, తాళం తప్పకుండా కరెక్ట్ గా పాడేదాన్ని. దాని తర్వాత చిన్న చిన్న కాంపిటీషన్స్‌కు వెళ్లటం, అంత్యాక్షరి పోటీలకు వెళ్లటం... అలా నా కెరీర్ స్టార్ట్ అయ్యింది.

నా ఎనిమిదో ఏట ఫస్ట్ టైం రవీంద్ర భారతిలో పాడాను.

ఇప్పటివరకూ దాదాపు 6000 స్టేజ్ ప్రోగ్రామ్స్ ఇచ్చాను.

టీవీ యాంకర్‌గా ఒక రకంగా నాది రికార్డ్ అని చెప్పవచ్చు. ఈ టీవీ వారి మనోరంజని ప్రోగ్రామ్‌ని ఒక సంవత్సరం పదినెలలు కంటిన్యుయస్‌గా నేను ఒక్కదాన్నే చేశాను. డెయిలీ రెండు గంటలు. అది నాకు చాలా మంచి పేరు తీసుకువచ్చింది.

17, 18 సినిమాలకు పాడి ఉంటాను. అయితే వాటిలో చెప్పుకోతగ్గవి పిట్టలదొర, ఒహో నా పెళ్లంట, మర్డర్(ఆమని ఫస్ట్ పిక్చర్), తాతామనవడు(సురేష్ ప్రొడక్షన్స్), పసుపు కుంకుమ, ఐతే ఏంటి, ఎక్కడి దొంగలు అక్కడే. ఇవి కాక పాడి విడుదల కావల్సిన సినిమాలు కొన్ని ఉన్నాయి.

ఇదీ సంక్షిప్తంగా నా సింగింగ్ కెరీర్.

✧ **స్టేజ్ ప్రోగ్రామ్స్ అందరూ చేస్తున్నారు. అయితే కాన్సెప్ట్‌లతో పాడాలనే ఐడియా ఎలా వచ్చింది మీకు ?**

24 గంటలు పాడాలనేది సడెన్‌గా వచ్చిన ఐడియా. దానికి ప్రేరణ, స్ఫూర్తి అంటూ ఏమీ లేదు. నాకు ఫస్ట్ వచ్చిన థాట్ ఏమిటంటే చాలా పాటలు పాడుకోవచ్చు అని. స్టేజ్ ప్రోగ్రామ్స్‌లో ప్రేక్షకులకు ఇష్టమైనవి పాడతాం కానీ, మనకు ఇష్టమైనవి పాడటానికి అవకాశం ఉండదు. మన ఇష్టం వాళ్ల మీద రుద్దలేం. నేను పాడాలనుకున్న పాటలు చాలా ఉన్నాయి. సో.... 24 గంటలు పాడితే మనకు ఇష్టమైనవి ఎన్నో పాడుకోవచ్చు కదా అన్న ఊహతో స్టార్ట్ అయింది.

✧ **24 గంటలు పాడటానికి మీరు తీసుకున్న జాగ్రత్తలేమిటి?**

స్టార్ట్ చేసే ముందర నేను పాడగలనా లేనా అన్నది అసలు ఆలోచించలేదు. కానీ ఇన్నేళ్ల నా స్టేజ్ ప్రోగ్రాంల అనుభవంలో నా గురించి నేను అబ్జర్వ్ చేసిందేమిటంటే ప్రేక్షకుల స్పందన ఉన్న కొద్దీ నాకు హుషారు విపరీతంగా పెరిగిపోతుంది. అంటే అలసట అనేది తెలియకుండా 8, 9 గంటలు ఈజీగా చాలా ప్రోగ్రామ్స్‌లో పాడాను. దీనికి స్పెషల్‌గా ప్రికాషన్స్ అంటూ నిజంగానే ఏమీ తీసుకోలేదండీ...కాకపోతే వాయిస్ క్లినిక్‌కి వెళ్లి ఒకసారి టెస్ట్ చేయించుకున్నాను. అంతా ఓకె అన్నారు. లంగ్ పవర్ నాకు కొద్దిగా తక్కువ. కొంచెం జాగ్రత్త తీసుకోమన్నారు. అంటే బ్రీతింగ్ ఎక్సర్‌సైజులన్నమాట...ఇక ప్రోగ్రాం టైమ్‌లో ఫుడ్ అంటే గ్లూకోజ్ వాటర్, ఎలక్ట్రాల్.... కాఫీ, టీ అంతే.

✧ **చేతిలో స్క్రిప్ట్ లేకుండా పాడటం మీ అలవాటా? లేక ఫ్యాషనా?**

ఒక విధంగా అలవాటే.....ఆ అలవాటు కావటానికి ముఖ్య కారణం దూరదర్శన్. నేను దూరదర్శన్‌లో భావవల్లరి, సుమాంజలి యాంకరింగ్ చేశాను. ఇప్పుడైతే మన ముందు టెలి ప్రాంప్టర్ ఉంటుంది. అప్పుడు లేదు. దానికోసం బై హార్ట్ చేయవలసి వచ్చేది. నాకు తదేకంగా రెండు మూడు సార్లు చూస్తే వచ్చేస్తుంది. పాటలంటే నాకు ఎలాగూ ఇంట్రెస్ట్ కాబట్టి ఇంకా తొందరగా రిజిస్టర్ అయిపోతుంది. మరి ఫ్యాషన్ అని మీరు ఎందుకన్నారో అర్థం కాలేదు.

✧ **స్టేజ్‌మీద, కవర్‌చేసే ఛానల్స్‌లోనూ అందంగా కనబడాలి కాబట్టి స్క్రిప్ట్ ఉంటే ముఖానికి అడ్డువస్తుందన్న ఫీలింగుందేమోనని.....**

అలాంటిదేమీ లేదు. స్టేజ్ మీదకు వెళ్లిన తర్వాత నేను పూర్తిగా పాటలో ఇన్‌వాల్వ్ అయిపోతాను. డెఫినెట్‌గా ఆ సమయంలో స్క్రిప్ట్ చూడటం ఓ డిస్ట్రబెన్స్... అంతే తప్ప ఇంకే ఫీలింగ్ ఉండదు.

✧ **సింగర్‌గా రెగ్యులర్ లైఫ్‌లో ఎలాంటి జాగ్రత్తలు తీసుకుంటారు?**

తీసుకోవాల్సినంత జాగ్రత్త తీసుకోవట్లేదనే చెప్పాలి. అది కూడా ఒక్కొక్క సింగర్‌కి వారి వారి గాత్ర ధర్మాల మీద ఆధారపడి ఉంటుంది. బాలూ గారు ఉన్నారు....చల్లని నీళ్లు తాగినా ఆయన వాయిస్ ఏమీ చలించదు. ఆయన గొంతు అలాంటిది. మరికొందరి వోకల్ కార్డ్‌లు సెన్సిటివ్‌గా ఉంటాయి. సింగర్స్ అందరూ తీసుకోవల్సిన జాగ్రత్తలు.. ఎక్కువ వేడి, ఎక్కువ చల్లటి పదార్థాలు తీసుకోకూడదు. అది నేను చెయ్యాలనుకుంటున్నాను. కానీ చెయ్యలేకపోతున్నాను. ఆ విషయంలో నేను కొద్దిగా కేర్‌లెస్. అయితే నా సింగింగ్ కెరీర్‌కు అది ఇప్పటివరకూ పెద్ద ఇబ్బంది కాలేదు.

✧ **5 రోజులకు డిఫరెంట్ మ్యూజిక్ డైరెక్టర్స్‌ను సెలెక్ట్ చేయాలి అన్న కాన్సెప్ట్‌కి బేస్ ఏమైనా ఉందా?**

లాస్ట్ ఇయర్ 24 గంటలు ప్రోగ్రాం చేసిన తర్వాత ప్రేక్షకులలో ఓ ఎక్స్‌పెక్టేషన్ వచ్చింది. విజయలక్ష్మి ప్రోగ్రాం అంటే కొంచెం భారీ ఎత్తున, సమ్‌థింగ్ డిఫరెంట్‌గా కొంచెం గ్రాండ్‌గా ఉంటుందని... సో దాన్ని డెఫినెట్‌గా నిలుపు కోవాల్సిన బాధ్యత నా మీద ఉంది. అందుకని కొత్త కొత్త ఐడియాల కోసం ఆలోచిస్తున్నాను. అదీ ఈ 24 గంటల ప్రోగ్రాం అయిన దగ్గర్నుంచే. మొదట ఓ 'మ్యూజికల్ వీక్' కాన్సెప్ట్ అనుకున్నాం. అయితే రవీంద్రభారతిలో నంది నాటకోత్సవాల వల్ల రెండు రోజులు కట్ అయిపోయింది. అందుకే 5 రోజుల పాటు చేసాం. దానికి రోజుకో ఇద్దరు మ్యూజిక్ డైరెక్టర్స్ సాంగ్స్‌ని పెడితే ఎలా ఉంటుందని అనుకున్నాం. దాంట్లో కూడా సీనియారిటీ ప్రకారం ఎంతమందిని మనం తీసుకోగలమో అంతమందినే తీసుకోగలిగాం.

✧ **ఇలా ఈ రకంగా భారీ ఎత్తున ప్రోగ్రాం అని రేంజ్‌ని పెంచుకుంటూ పోతే భవిష్యత్తులో మీకు మీరే ఇబ్బంది అవుతారేమో ?**

....అంటే 'ఎప్పుడూ ఇలాగే చేస్తాం... చిన్న ప్రోగ్రాం చేయం' అని కాదు. ఏదో ఒక స్పెషాలిటీ చూపించటానికి ట్రై చేస్తున్నాం. అంతకంటే భారీ అని కాదు.

✧ **స్పెషాలిటీ అంటే...ఇక్కడ క్రియేటివిటీయే కదా. ఎన్నో రకాలుగా ప్రోగ్రామ్స్ డిజైన్ చేసుకోవాలి. అప్పుడు సింగింగ్ టాలెంట్ కంటే అడ్మినిస్ట్రేటివ్ టాలెంట్ ఎక్కువ కావల్సి వస్తుంది. మరి ఈ టాలెంట్ మీలో మీకు ఎప్పుడు కనిపించింది? లేక మీకు ఎవరైనా చెప్పున్నారా?**

నా ఓన్‌గా కొన్ని సంవత్సరాల క్రితం ఈవెంట్ మేనేజర్ లాగా కొన్ని ప్రోగ్రామ్స్ ఆర్గనైజ్ చేసాను. తర్వాత హిందీ ప్లేబాక్ సింగర్స్‌ని పిలిచాను. అభిజీత్, ఓ.పి.నయ్యర్, సోనూనిగమ్... వీళ్లందరినీ పిలిచి వారితో షోస్ చేసాను. అది గ్రాడ్యువల్‌గా డెవలప్ అయింది. అంటే...ఇంకొకళ్ల ప్రోగ్రామ్‌లో మనం పాడితే మన రోల్ చాలా తక్కువగా ఉంటుంది. మనకు కావల్సింది మనం చేయలేం. అలా కాకుండా మనమే డిజైన్ చేసుకుని చేస్తే .....!?సో.. ఆ ఉత్సాహం నాలో ఉంది. నేను చేయగలను.

ఎవ్విరిడే మీరు చూస్తూనే ఉంటారు కదా ఎంత మంది కొత్త సింగర్స్ వస్తున్నారో... అంతమందిలో సింగర్‌గా నా ఉనికిని నేను కాపాడుకోవాలంటే ఐ హేవ్ టు బి ఇన్ న్యూస్. ఏదో కొత్తదనం చేయాలి. నన్ను నేను ప్రూవ్ చేసుకోవాల్సిన అవసరం ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. ఇప్పుడు ఈ కాంపిటేటివ్ వరల్డ్‌లో ఇంకా ఎక్కువ ఉంటుంది. అందుకని నేను కొంచెం ఎసర్టివ్‌గా చేస్తున్నాను. అదీగాక ప్రేక్షకుల స్పందన లేకపోతే నేను చేయలేను.

✧ **నగరంలోనే కాకుండా రాష్ట్రంలో, రాష్ట్రేతర ప్రాంతాల్లో, విదేశాల్లో కూడా చాలా ప్రోగ్రామ్స్ ఇచ్చారు కదా మీరు ?**

ఆంధ్రాలో నేను తిరగని ఊరు ఉండదండీ. అంటే 100 ఇళ్లు ఉన్న పల్లెటూరి నుండి అమెరికా, లండన్, సింగపూర్ వరకు ప్రోగ్రామ్‌లు చేశాను.

ఆంధ్రా దాటితే ఆల్ ఓవర్ ఇండియా 50 ప్రోగ్రామ్స్ దాకా చేసాను. అమెరికా 7 సార్లు వెళ్లాను. జులైలో ఎనిమిదోసారి అమెరికాలో ప్రోగ్రామ్ చెయ్యబోతున్నాను. సాధారణంగా అక్కడ రెండు, మాగ్జిమమ్ మూడు సార్లు కన్నా ఎక్కువ ఒక ఆర్టిస్టును చూడరు. మొన్న వచ్చారు కదండీ అనేస్తారు. వాళ్లకు కొత్తదనం కావాలి. ఈ రకంగా నాది ఒక రికార్డే అనుకుంటున్నాను. 6 సార్లు ఆటా, తానా ప్రోగ్రామ్స్‌కు, ఒకసారి హిందీ ప్రోగ్రామ్‌కు వెళ్లాను. లండన్ 3 సార్లు వెళ్లాను. సింగపూర్, మలేషియా 4 సార్లు, దుబాయ్, షార్జాలకు అయిదారు సార్లు వెళ్లాను. ఓ.పి.నయ్యర్, సోనూ నిగమ్, కవితాకృష్ణమూర్తి వీళ్లందరితోనూ ప్రోగ్రామ్స్ చేశాను.

✧ **జీ టీవీ సరిగమ ఫైనల్స్‌లో మీరు ఓడిపోయినా, గెలిచిన అమ్మాయికన్నా ఎక్కువ పేరు రావడానికి కారణం ?**

ప్రోగ్రామ్ చూసిన ప్రతివారూ ప్రోగ్రామ్ జరుగుతున్నంత సేపూ నేనే గెలుస్తానని ఎక్స్‌పెక్ట్ చేయటమే. అంచేత గెలిచిన అమ్మాయికన్నా నాకే విపరీతమైన పబ్లిసిటీ వచ్చేసింది. తర్వాత 'మేరీ ఆవాజ్ సునో ' ఫైనల్స్‌లో నేను గెలిచాను.

✧ **డిఫరెంట్ వాయిస్‌లతో పాడడంలో ఉత్తరాదిన ఆశాభోంస్లే, దక్షిణాదిన యస్.జానకి, స్టేజ్‌మీద మీరు... ఈ టాలెంట్ మీకెలా వచ్చింది...?**

నేను కూడా కరెక్ట్‌గా చెప్పలేను. అది గాడ్ గిఫ్ట్ అంతే. ఒక వాయిస్ వినగానే అది నా మైండ్‌లో ప్రింట్ అయిపోతుంది. అంటే నేను మళ్లీ పాడేటప్పుడు నాకు అదే గుర్తొస్తుంది. సపోజ్ లీల గారి పాట ఉంది. ఆ పాట నేను పాడేటప్పుడు ఆ వాయిసే నాకు మైండ్‌లో వస్తుంది. అలా నేను మిమిక్ చేయగల వాయిస్‌లలో లీల గారి వాయిస్ ఒకటి. భానుమతి గారి వాయిస్ కొన్ని పాటల్లో చేయగలను. జమునారాణి గారి వాయిస్‌కి ఆవిడ గాత్ర ధర్మాన్ని యాడ్ చేసుకోవాలి. సుశీల గారి వాయిస్‌ను ఇమిటేట్ చేయలేం. జానకి గారిని కొంత వరకూ చెయ్యవచ్చు. ఎల్. ఆర్. ఈశ్వరి, మాల్గాడి శుభ హిందీలో నూర్జహాన్, షంషాద్‌బేగం, సల్మా ఆగా, ఇళా అరుణ్.. ఇలా పెక్యులర్ వాయిస్‌లు ఉన్న ప్రతి వారిని ఇమిటేట్ చేయగలను.

✧ **మీ ప్రోగ్రామ్స్‌లో పాత పాటలకు ఎక్కువ రెస్పాన్స్ ఉందా.. కొత్త పాటలకు ఉందా..?**

నేను మాస్ ప్రోగ్రామ్స్ చేశాను. క్లాస్ ప్రోగ్రామ్స్ చేశాను. డెఫినెట్‌గా ఆడియన్స్ డిఫర్ అవుతారు. ప్రోగ్రామ్స్ లో కొత్త పాటలుంటేనే యూత్ ఎంజాయ్ చేస్తారు. అయితే పాత పాటలు పాడకుండా ఏ ప్రోగ్రామ్ కూడా కంప్లీట్ కావట్లేదు. ఓన్లీ కొత్త పాటలు మాత్రమే పాడితే యూత్‌కు కూడా నచ్చదు. ఈ 5 రోజుల ప్రోగ్రామ్ వల్ల మంచి పాటలకు, పాత పాటలను ప్రేక్షకులు మొహంవాచి ఉన్నారని నాకు అర్థమైంది.

✧ **ఈ ప్రోగ్రామ్‌లో మాస్టర్ వేణు గారి పాటలను పాడుతున్నప్పుడు 'ప్రేమించి చూడు' లోని చాలా పాటలను మీరు పాడారు. తమిళమూలం 'కాదలిక్కనేరమిల్లై' లో ఎమ్మెస్ విశ్వనాథం గారు స్వరపరిచిన ఆ పాటల్ని వేణుగారి పాటలుగా - తెలిసికూడా - మీరు పాడటం ఎంత వరకు సబబు?**

దానికి ముఖ్య కారణం ఆ పిక్చర్‌లోని పాటలు నాకు ఇష్టం . మీరన్నట్టే ఆ పాటలు పెట్టాలా, వద్దా అని చాలా ఆలోచించాం. కానీ ఆ విషయం మీలాంటి క్రిటిక్స్‌కు, పాత సంగీతాన్ని బాగా ఫాలో అయ్యేవారికి మాత్రమే తెలుస్తుంది. జనరల్ పబ్లిక్‌కు తెలియదు. 'సిరిమల్లె పువ్వా' అంటే చక్రవర్తి గారి పాట అనే అంటారు. ఇళయరాజా గారి పాట అంటే మన వాళ్లు ఒప్పుకోరు. ఈ ప్రోగ్రామ్‌లో నేను 'సిరిమల్లె పువ్వా' పాట పాడలేదు...కానీ చాలా మంది వచ్చి అడిగారు...'ఏంటండి చక్రవర్తి గారి పాటల్లో ఆ పాట పెట్టలేదని'. అంటే జనరల్ ఒపీనియన్ ఈజ్ డిఫరెంట్.



ఇటీవల జరిగిన ఐదు రోజుల కార్యక్రమంలో సినీ గాయకుడు రవివర్మతో విజయలక్ష్మి

✧ **మీ లాంగ్ స్టాండింగ్ కెరీర్‌లో 'హాసం' మీకు ఏమైనా ఉపయోగపడిందా?**

చాలా... చాలా...! అంటే ఒక ఆథెంటిసిటీ ఉన్న పత్రిక కదా. పాత పాటలు జనరల్‌గా మనకు తెలుస్తాయి. కొన్ని చోట్ల ఏమైనా డౌట్స్ ఉన్నా...ఆ పాట పుట్టు పుర్వోత్తరాలు అన్నీ మీరు రాస్తారు. అది చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉంటుంది. అలాగే గీతకోశం అని మీరు వేశారు. నేను 'హాసం' అన్ని సంచికలు కొని భద్రపరుచుకున్నాను. రిఫర్ చేస్తూ ఉంటాను. కొన్ని ప్రోగ్రామ్స్‌కు నేను యాంకరింగ్ కూడా చేస్తూనే ఉంటాను కాబట్టి 'హాసం' నాకు చాలా ఉపయోగం. నాలాగే సింగర్స్ అందరికీ 'హాసం' చాలా ఉపయోగపడుతుంది. ■

# అనుబంధం ఆత్మీయత అంతా ఒక బూటకం ఆత్మతృప్తికై మనుషులు ఆడుకునే నాటకం...!!

**- కీరవాణి**

**జూలై 4 కీరవాణి పుట్టినరోజు సందర్భంగా...**

'హాసం' వారికి నమస్కారం....

పుట్టినరోజు సందర్భంగా సరదాగా నాలుగు ముక్కలు మాట్లాడమన్నారు. మీరింకా మెలోడీకి కట్టుబడి ఉంటూ ఎలా తట్టుకుని రాగలుగుతున్నారని ఓ ప్రశ్న కూడా అడిగారు, అదీ పుట్టినరోజు సందర్భంగా..

పుట్టినరోజంటే ఓ విషయం గుర్తొస్తుంది. మా గురువుగారు చక్రవర్తి గారు మ్యూజిక్ చేసే రోజుల్లో ఇండస్ట్రీకి 100 సినిమాలు వచ్చేవి తెలుగులో. అందులో 90 సినిమాల వరకూ ఆయనే చేసేవారు. మిగతా 10 వాళ్లూ వీళ్లూ పంచుకునేవారు. ఆయన ప్రతి పుట్టినరోజు (సెప్టెంబరు 8) ఆయన ఇంట్లోనే ఘనంగా జరిపేవారు. ఆ రోజున మా కంపోజింగ్ బ్యాచ్ అందరికీ ఇంక్రిమెంట్స్ ఉండేవి. 200 పేమెంట్ ఉంటే మూడొందలయ్యేది, 300 ఉంటే నాలుగొందలయ్యేది. సో...ఆయన పుట్టినరోజు కొరకు మమ్మల్ని ఎదురుచూసేలా చేయగలిగారాయన. పుట్టినరోజంటే కేక్ కట్ చేయటం, ఇంకోటో కాదు. ఆ రోజునుండీ మాకు మంచి జరుగుతుంది. ఇంక్రిమెంటో, ప్రమోషనో దొరుకుతుందని అనుకునేవాళ్లం, సరదాగా ఉండేవాళ్లం. అది గొప్ప విషయం. అది నిజమైన ఫంక్షన్. ఆయన పుట్టినరోజుకు హీరోలు, హీరోయిన్‌లు, నిర్మాతలు, డైరక్టర్‌లు ఇలా దగ్గర దగ్గర 2000మంది అటెండ్ అయ్యేవారు. భోజనాలు రకరకాల వెరైటీలు. ఖర్చుకు అసలు వెనుకాడే ప్రసక్తే లేదు. లక్షల్లో అయ్యేది.

అటువంటిది వాళ్లబ్బాయి పోయి, వైరాగ్యంతో ప్రొఫెషన్‌మీద పట్టు వదిలివేసి ఏకాంత జీవితం ఆయన గడుపుతున్న రోజుల్లో....అంటే ఆయన ప్రొఫెషన్ మీద పట్టు వదిలివేసింది 89 లో..నేను చెప్పేఇన్సిడెంట్ 93లో...

1993లో నేను ఒక దీక్షలో ఉండి మా అసిస్టెంట్ జెమినీరావుగారిని పిలిచి...'ఏవండీ రేపు సెప్టెంబరు 8. నేను దీక్షలో ఉన్నాను కనుక ఎక్కడికీ వెళ్లకూడదు కాబట్టి రేపు నా తరపున ఒక బొకే కొని మా గురువుగారు చక్రవర్తిగారికి ఇచ్చేసిరండి' అని చెప్పాను. 'ఇలా రాలేకపోతున్నాను' అని కూడా చెప్పమని చెబితే ఆయన వెళ్లారు. జెమినీరావుగారు చక్రవర్తి గారి దగ్గర, రమేష్‌నాయుడు గారి దగ్గర, ఇళయరాజా గారి దగ్గర ఇలా అందరి దగ్గర పనిచేసిన సీనియర్ మోస్ట్ తబలిస్టు. ఆయన వెళితే అక్కడ పిట్టా, కాకి కూడా లేవు. ఎక్కడ 2000 మంది అటెండ్ కావటం.... ఇప్పుడు ఒక్కరు కూడా లేకపోవటం....!

ఉదయం 10 గం॥లకు వెళ్లుంటారాయన. వెళితే....'హమ్మయ్య నీకొక్కడికి గుర్తున్నానురా నేను' అని బాధపడ్డారు చక్రవర్తిగారు. జెమినీరావుగారు గిల్టీగా ఫీల్ అయి.. 'సార్ ఇది నాకు గుర్తొచ్చి కాదు... కీరవాణి గారు



పంపించారు' అని, 'నేను కూడా అసలు రావాలి' అంటూ ఆయన సిగ్గుపడ్డారు. ఇదంతా నేను ఎందుకు చెప్తున్నానంటే.... పుట్టినరోజు వేడుకలు సెట్లో జరిపారని, ఇంకోటని, ఇంకోటని మనం వింటుంటాం, చూస్తుంటాం. అట్లాంటి వార్తలు చూసినప్పుడల్లా వైరాగ్యం కలుగుతుంటుంది. ఎందుకంటే నాకు తెలును...ఒకప్పుడు చక్రవర్తిగారింటికి ఎంత మంది అటెండ్ అయ్యేవాళ్లో...! అంటే ప్రొఫెషన్ ఉన్నంతవరకే రిలేషన్ అన్నమాట.

ముందు దానితో ప్రారంభిద్దాం...ఇది చేదుగా ఉన్నా కూడా సత్యం. అవసరం ఉంది కాబట్టి అన్ని వేల మంది అటెండ్ అయ్యారు ఆయనింటికి. అవసరం లేనప్పుడు పుట్టినరోజూ లేదు...గాడిదగుడ్డూ లేదు. అటువంటి సొసైటీలో...అందులోనూ మాయాజాలమైన నటువంటి ఇండస్ట్రీలో ఉన్నాం.

కానీ అవసరం ఉన్నా లేకపోయినా ఎప్పుడో పోయిన వాళ్ల పుట్టినరోజు దగ్గరనుండి ఇప్పుడున్న వాళ్ల వరకూ అందరినీ స్మరిస్తూ... వాళ్ల గురించి ఎంతోకొంత తలుచుకుంటున్నటువంటి 'హాసం'కు ముందుగా నా ప్రత్యేక అభినందనలు తెలుపుతున్నాను... మీరు చేస్తున్న మంచి ఏమిటో తెలియాలంటే ఒక చెడును స్మరించుకుంటేనే మంచి చెడు రెండూ తెలుస్తాయి. చెడు ఏమిటయ్యా అంటే....అవసరం! అవసరం లేకపోగానే చక్రవర్తి గారు గుర్తులేరు. ఆయన్ని స్మరించుకుంటూ.. ఆ చేదుతో కంపేర్ చేస్తూ ఈ తీపిని కంగ్రాట్యులేట్ చేస్తూ ...మీరడిగిన దానికి సమాధానం చెప్తాను -

మెలోడికి ఎలా కట్టుబడి ఉన్నానంటే..... కొన్ని కొన్ని విషయాలలో సెలెక్టివ్‌గా ఉండటమే కారణమని నేను అంటాను.

చాలా మంది అంటుంటారు....మేము సెలక్టివ్‌గా చేస్తున్నామని. అసలు సెలెక్టివ్‌గా చేస్తున్నామంటే ఏంటి ? దాన్ని డిఫైన్ చేయమని మీరెప్పుడైనా అడిగారా ? అడగక పోయినా నేను చెప్తున్నాను..వినండి. నా ఉద్దేశ్యం సెలెక్టివ్ అంటే రెమ్యూనరేషన్ కాదండీ...నా వరకూ....డీలింగ్ విత్ పీపుల్. ఈ డీలింగ్ విత్ పీపుల్ అనే దాంట్లో నేను సెలక్టివ్‌గా ఉంటాను. ఎట్‌లీస్ట్ వీళ్లను సెలెక్ట్ చేసుకోవటంలో జాగ్రత్తగా ఉంటే మెలోడీ కచ్చితంగా వస్తుంది.

ఈ డీలింగ్ విత్ పీపుల్‌లో మొదట చెప్పుకోవలసింది దర్శకుడి గురించి..... ఫారిన్ సీడీలు బ్యాగులనిండా తీసుకువచ్చేసి 'ఇలా చెయ్యాలి' అనే దర్శకులకు మర్యాదగా నమస్కారం పెట్టేసి 'క్షమించండి సార్' అని మంచిగా తప్పుకోవడం నేను సెలక్టివ్‌గా ఉండే పద్ధతుల్లో ఒకటి.

ఇక స్టోరీ రైటర్ - సినిమా అన్నది విజువల్ మీడియా. విజువల్ టేకింగ్ అంతా రెండు గంటలొస్తుంది. ఉండేదే రెండు గంటల సినిమా. ఓ గంట సేపు స్టోరీ చెబుతానని రైటర్ కూర్చుంటే ఆ స్టోరీలో పసలేదని అర్థం. అనుమానం లేదు. మూడేవాక్యాల్లో స్టోరీ చెప్పాలి. బాగుందనుకున్న తర్వాత నెక్స్ట్ స్టేజ్‌లో దాని గురించి వివరంగా చెప్పాలి తప్ప...ఓపెనింగ్‌లోనే కట్ చేస్తే... కట్ చేస్తే...అని స్టోరీ చెబుతారు....అసలు కట్ చేస్తే అనే మాట ఎంత ఎక్కువ ఉపయోగిస్తే అంత చెత్తగా ఆ స్టోరీ ఉందని అర్థం. మనం ఎంత గొప్ప మ్యూజిక్ ఇచ్చినా సరే ఆ సినిమా ఫ్లాప్ అవుతుంది.



తర్వాత లిరిసిస్ట్-ఈ మధ్యన పాటలు రాస్తామని చెప్పి కుప్పలు కుప్పలుగా వస్తున్నారు. ఇందులో మంచి లిరిసిస్ట్‌ను ఫిల్టర్ చేయటానికి ప్రధానమైన ప్రక్రియ ఏమిటంటే - 25 సంవత్సరాల లోపున్న ఎవరినీ కూడా నేను ఎంకరేజ్ చేయను. పదేళ్ల కుర్రాడు బ్రహ్మాండంగా కీబోర్డ్ వాయించగలడు. అది పెర్ఫార్మెన్స్.... క్రియేషన్ కాదు! పెర్ఫార్మెన్స్ వేరు, క్రియేషన్ వేరు. సాముగరిడీలు, తాడు మీద నడవడాలు చిన్నపిల్లలు కూడా చేయగలరు. దానికి క్రియేషన్ ఏమీ లేదు. క్రియేటివిటీ జాబ్ అనేది డైరక్షన్, స్టోరీ, మ్యూజిక్, లిరిక్స్! ఈ క్రియేటివ్ జాబ్ చేయటానికి జీవితానుభవం కావాలి. అసలు జీవితమంటే ఏమిటో తెలియాలి కదా ! అదే లిరిక్ రైటర్‌కు కూడా వర్తిస్తుంది. 25 సంవత్సరాలు కనీసం కావాలని నా బండ అభిప్రాయం. స్కూళ్లు ఎగ్గొట్టి మూతి మీద మీసాలు మొలవని వాళ్లు కూడా పాటలు రాసేస్తామని వచ్చేస్తారు... వాళ్లను నేను ఎంకరేజ్ చేయను. ఇది నేను పాటించే ప్రాథమిక లక్షణం.

సింగర్‌లు - కొందరు సింగర్స్‌లో రెండు రకాల వారు ఉంటారు. అతి వినయం ధూర్తలక్షణం అని .... పాదాభివందనం చేసే సింగర్‌లను నేను అసలు నమ్మను. వీళ్లు మనకు దణ్ణాలు పెట్టేయటం, వెనకకు వెళ్లి పేర్లు పెట్టడం, రకరకాలుగా మాట్లాడటం .....వీళ్లకు టాలెంట్ లేదని అర్థం. ఇక అతి పొగరుగా బిహేవ్ చేసే సింగర్‌లు ఇంకో రకం... ఒన్‌మోర్ టేక్ అంటే పాడరు. అట్లాంటి ఇద్దరు హిందీ సింగర్స్‌ను నేను కంప్లీట్‌గా ఎవాయిడ్ చేశాను. పేర్లనవసరం. సో...సింగర్స్ విషయంలో పాదాభివందనాలను ఎవాయిడ్ చేయటం నేను సెలెక్ట్ చేసుకున్న సూత్రాలలో ఇంకొకటి.

ఇకపోతే రికార్డింగ్ థియేటర్స్. ఈ రికార్డింగ్ థియేటర్‌లో ప్రో టూల్స్ అని ఒక ఎక్విప్‌మెంట్ ఉండాలండి. ఎందుకంటే మేం దానికి బాగా అలవాటు పడ్డాం. అది లేకపోతే రికార్డింగ్ థియేటర్‌కు ఎంటర్ కాగానే పక్షవాతం వచ్చిన వాళ్లలాగా కాళ్లూ చేతులు చల్లబడి పోతాయి. ఉన్న ఎక్విప్‌మెంట్స్‌లో అది బెస్ట్ కాబట్టి దానికి అలవాటుపడ్డాం అంచేత ప్రో టూల్స్ ఉంటేనే నేను అక్కడ రికార్డు చేస్తాను అని ఓ కండిషన్. సెలెక్టివ్‌గా ఉండటంలో ఇదొకటి.

అలాగే ఎవార్డుల విషయంలో చాలా సెలక్టివ్‌గా ఉంటాను. మనకిచ్చారని చంకలు గుద్దుకోకుండా, మిగతా వారికి ఎవరెవరికి ఇచ్చారు... అన్నీ సమంజసంగా ఉన్నాయా లేదా అని చూసుకుంటాను. అందుకే పది అవార్డులు ప్రకటిస్తే తొమ్మిదింటిని మర్యాదగా ఎగ్గొట్టేసి సమంజసంగా ఉన్న ఒక్కదానికి ఎటెండ్ అవుతాను. ముఖ్యంగా మనల్ని మనం పరిపాలించుకునే ప్రభుత్వం ఇచ్చిన అవార్డుకు మాత్రం తప్పనిసరిగా అటెండ్ అవుతాను.

ఇక కచేరీలు.. రసికులైన శ్రోతలు ఉన్నచోటికి వెళ్లడం జరుగుతుంది తప్ప, డ్యాన్స్ ప్రోగ్రాములు ఇన్‌వాల్వ్ అయ్యే ఏ ప్రోగ్రామ్‌కు నేను వెళ్లను. అలాంటి ఫంక్షన్‌లకు వెళ్లటం నాకు ఇష్టం ఉండదు. ఈ మధ్యన మ్యూజిక్ కచేరీల పేరిట డ్యాన్స్ ఫంక్షన్‌లు పెడుతున్నారు. అది శోచనీయం. అలాంటి వాటికి నేను దూరం.

నిజానికి మెలోడి చేయడమనేది పెద్ద ఆర్ట్ కాదండీ. సహజంగా ఏ మ్యూజిక్ డైరెక్టర్ అయినా

చేయగలిగిందే. ఇప్పుడున్న మ్యూజిక్ డైరెక్టర్ ఎవరైనా మెలోడీ చేయగలిగిన వారే. కాకపోతే - ఈ సినిమా మనం వొదులుకోకూడదు .... బాబోయ్... ఈ సినిమా వొదులుకున్నామంటే ఎలాగా - అని అనుకుంటే ప్రతీ వాళ్లకీ లొంగి ఉండాలి. లొంగి ఉంటే క్వాలిటీ ఎలా వస్తుంది? సో...ఇక్కడ నేనొక్కడ్నే గొప్పవాడ్ని కాదండీ. అందరి దగ్గరా ఉంది. అయితే అది బయటకు రావాలంటే వ్యక్తిగతంగా కొన్ని ప్రిన్సిపుల్స్ పెట్టుకోవాలి. అది నా ఉద్దేశ్యం. ఎందుకంటే భయపడుతూ పెరుగుతారు, భయపడుతూనే ఛస్తారు. అది వేస్ట్ కదండీ. నిర్భయంగా బతకాలి. అలాగే చావాలి. అప్పుడే మనల్ని మనం ప్రూవ్ చేసుకోగలం. అందుకే కొంత మెలోడి ఇవ్వగలుగుతున్నానని నా ఫీలింగ్. ఏమంటారు?



సరే...ఇప్పుడు చేస్తున్న సినిమాలు - ఎస్.వి.కృష్ణారెడ్డి గారి దర్శకత్వంలో శ్రీకాంత్ హీరోగా కొసరాజు రాజేంద్రబాబు గారు తీస్తున్న 'లేతమనసులు', బెల్లంకొండ సురేష్ గారు నిర్మాతగా, రవితేజ గారు హీరోగా ఎస్.గోపాలరెడ్డి గారు ఫస్ట్ టైమ్ డైరెక్ట్ చేస్తున్నటువంటి 'ఆటోగ్రాఫ్'. సుచిత్రగారు ఫస్ట్ టైమ్ డైరెక్టర్‌గా, సుంకర మధుమురళి గారు నిర్మాతగా, బ్రహ్మానందం గారి అబ్బాయి హీరోగా 'పల్లకిలో పెళ్లికూతురు', ఆంధ్రావాలా గిరి గారు ప్రొడ్యూసర్ గా, ఎస్.ఎస్.రాజమౌళి డైరెక్షన్‌లో, నితిన్ హీరోగా వస్తున్న 'సై', 'ఐతే' సినిమా తీసిన ఏలేటి చంద్రశేఖర్ డైరెక్షన్‌లో ప్రత్యూష ఫిలిం బేనర్‌పై ఫణీంద్ర గారు నిర్మాతగా ఓ సినిమా, హరికృష్ణ గారు హీరోగా వి.ఆర్.ప్రతాప్‌గారి డైరెక్షన్‌లో, కృష్ణ భగవాన్ గారు, సి.కళ్యాణ్ గారు సంయుక్తంగా నిర్మిస్తున్న 'స్వామి' అనే సినిమా. ఇవి కాకుండా 'రోగ్' **ROG** అని ఓ హిందీ సినిమా. దానికి **Love is the dec ease** క్యాప్షన్. ఇర్ఫాన్‌ఖాన్ అనే అతను హీరో, ఆయూష్ అనే కొత్త డైరెక్టర్. స్క్రీన్‌ప్లే మొత్తం అంతా మహేష్ భట్ గారు... ఈ ఏడు సినిమాలు చేస్తున్నాను ప్రస్తుతం.

సెలెక్టివ్‌గా ఉండటం గురించి ఇంకోటి చెప్తాను. అది ఏమిటంటే పాట పాడటం...! 'వాయిస్ బాగుంటుంది పాడొచ్చు కదా' అని రెగ్యులర్‌గా అంటుంటారండి. బాగున్న దాన్ని తక్కువుగా యూజ్ చేస్తే ముద్దుగా ఉంటుంది. లేకపోతే ఓవర్ అయ్యాడు వీడు...అన్నిట్లోనూ ఇతని వాయిస్సే అని తిట్టుకుంటారు. క్యాసెట్ అంతా నేనే పాడితే దరిద్రంగా ఉంటుంది. ఇప్పుడు 'లేతమనసులు' తీస్తున్న కొసరాజు రాజేంద్రబాబు గారు చాలా ముచ్చటపడి ఓ పాటను పాడించుకున్నారు. 'ఇంకో పాట పాడండి' అని అడిగితే నేనే చెప్పాను "ఏమండీ... అన్ని నేనే పాడితే చాలా మొనాటనీ వస్తుంది. వాయిస్ బాగుందంటున్నారు. అభిమానానికి చాలా సంతోషం. కానీ లిమిటెడ్‌గా వాడాలి' అని.

ఈ లిమిటెడ్‌గా అనేది బయటి మ్యూజిక్ డైరెక్టర్స్‌కు పాడటంలో కూడా జరుగుతుంది. 'ఐతే' సినిమాలో ఓ పాట పాడాను. శాస్త్రి గారు ఎంతో అద్భుతంగా రాశారు.

ఇదెందుకు చెబుతున్నానంటే బయటవాళ్లకు పాడేటప్పుడు మ్యూజిక్ ఎలా ఉంది అని కాకుండా లిరిక్ బాగుందా... లేదా? అన్నది చూసి పాడతాను. లిరిక్‌తో పాటు డబ్బులు కూడా చూసుకుంటాను. నా సినిమాల్లో పాడిన వాటికి ఎలాగూ ఫ్రీ యే! బయట పాడిన వాటికి మాత్రం డబ్బులు రావాలి. లేకపోతే ఎలా ? ఎందుకంటే తల్లితండ్రులు జన్మనిచ్చిన ఈ శరీరంలోని గాత్రంతో పాడుతున్నామండి. ఈ శరీరంలో పాడగలిగే వాయిస్ ఉందంటే అది మన గొప్పతనం ఏం కాదు. పుట్టుకతో రావాలి. భగవంతుడు అనుగ్రహించాలి. మన కళ్ల ముందు కనిపించే దైవాలు, పుట్టుకను ఇచ్చిన దైవాలు తల్లితండ్రులు. పాట మీద ఏ రెమ్యూనరేషన్ వచ్చినా సరే వాళ్లకు ఇచ్చేస్తాను పాకెట్ మనీ క్రింద. అంచేత పాటకి ఫ్రీ సర్వీస్ ఎట్టి పరిస్థితులలోనూ లేదండి.

తర్వాత ఇంటర్వ్యూల విషయంలో కూడా నేను సెలెక్టివ్‌గా ఉంటాను. ఇప్పుడు 'హాసం' ఉంది ....చాలా సెన్సిబుల్‌గా బాగా డెవలప్ చేశారు. కాబట్టి ఇంతసేపు కూర్చుని మీకు ఇంటర్వ్యూ ఇచ్చాను. అలాగే కొంతమంది ఉన్నారు. సందర్భం వచ్చినప్పుడు చెప్తాను. జర్నలిస్టులలో గుడిపూడి శ్రీహరి గారి మీద నాకు చాలా మంచి ఇంప్రెషన్ ఉంది. ఆయనతో నాకు పరిచయం కూడా లేదు. అయితే 'బొంబాయి' సినిమాకి ఆయన రివ్యూ రాశారు. ఏమని రాశారంటే... మెచ్చుకుంటూ తిట్టారండీ... అది చాలా గొప్ప విషయం. ఈ సినిమా మణిరత్నం తీయకూడదు ... చాలా తప్పు చేశాడు. మణిరత్నం బాగా తీయగలడు, కళ్లకు కట్టినట్టు ఎఫెక్టివ్‌గా తీయగలడు కాబట్టి హిందూ, ముస్లిం గొడవలు అంత ఎఫెక్టివ్‌గా చూపించకూడదు. మిగతా వాళ్లు చూపిస్తే అది కామెడీగా ఉంటుంది. ఈయన చూపిస్తే కళ్లకు కట్టినట్టు ఉంటుంది కనుక ఆయన అలా తీయకూడదు. అది చూసి థియేటర్‌లో ఏవైనా గొడవలు జరిగితే ఆయన బాధ్యత వహించవలసి ఉంటుంది అని రాశారు. పెర్ఫెక్ట్ క్రిటిక్ ఆయన. ఎవరిమీదైనా ఇంప్రెషన్ ఏర్పడాలంటే ఓ ఇన్సిడెంట్ జరగాలి. ఆ రివ్యూ చదివిన దగ్గర్నుంచీ ఆయనంటే గౌరవం. అలా కొంతమంది వ్యక్తులు జర్నలిజం వాల్యూస్ కాపాడిన వాళ్లు ఉన్నారు. వాళ్లు వచ్చినప్పుడు వాళ్లతో ఇంటరాక్ట్ కావటం, మన అభిప్రాయాలను వాళ్లతో చెప్పటం..

ఇప్పటివరకూ నేను 175సినిమాలు చేసాను. వాటిలో నేను ఇది చేసాను అని గర్వపడే సినిమాలు ఓ పన్నెండు ఉన్నాయి. అవి - సీతారామయ్యగారి మనుమరాలు, అన్నమయ్య, మిస్టర్‌పెళ్లాం, అళగన్, జక్మ్, సింహాద్రి, దేవరాగం, మాతృదేవోభవ, అల్లరి అల్లుడు, పెళ్లిసందడి, ఆపద్బాంధవుడు, క్షణక్షణం. ఇందులో హిందీ, తెలుగు, మలయాళం, తమిళం అన్నీ కవర్ అయ్యాయి. ఓ 10 కన్నడ సినిమాలు కూడా చేశాను. దురదృష్టవశాత్తు ఒక్కటీ సరైనది లేదక్కడ. వాటిలో నా వరకు నేను శాటిస్‌పై అయినవి అస్సలు లేవు. నేనూ చెత్త మ్యూజిక్కే ఇచ్చాను. అది కన్నడ పరిస్థితి.

జన్మదిన సందర్భంగా ఇక్కడ ఓ విషయం చెప్పాలి. నా పుట్టినరోజు అనేది మా కుటుంబసభ్యుల మధ్య విషయం. ప్రపంచానికి అనవసరం. కానీ సంగీత దర్శకునిగా జన్మనిచ్చిన వ్యక్తి గురించి మాట్లాడకపోవటం దోషం. కృష్ణంరాజుగారి సోదరుడు సూర్యనారాయణ రాజు గారు మ్యూజిక్ డైరెక్టర్‌గా నాకు తొలి అవకాశం ఇచ్చారు. 'కల్కి' అనే సినిమాకి. సునీల్‌వర్మ గారు డైరెక్టరు. సూర్యనారాయణ రాజు గారబ్బాయి ప్రభాస్ హీరోగా ఇప్పుడు నేను ఓ సినిమా చేస్తున్నాను. అది ఓ అదృష్టంగా భావిస్తున్నాను. ప్రభాస్‌కి ఇది ఫస్ట్ సినిమా కాదు. ఆల్రెడీ సక్సెస్‌లో ఉన్నాడు. అతన్ని నేను బాగా ఎరుగుదును. కొత్తగా కమిట్ అవుతున్న సినిమాల్లో ముఖ్యమైనది ఇది. అంతేకాదు ఇది విభిన్న ధృవాలతో చేస్తున్న సినిమా కూడా ! ఎందుకంటే ఈ చిత్ర దర్శకుడు, నిర్మాత ఇద్దరూ నా శ్రేయాభిలాషులే! ఇద్దరూ డిఫరెంట్ పోల్స్. దర్శకుడు రాజమౌళి 'సెలెక్టివ్‌గా ఉండు, ఏది పడితే అది చేయకు' అంటాడు. నిర్మాత భోగవల్లి ప్రసాద్ గారు ' దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి..'అని అంటారు. ఆయనా మంచివారే. నా శ్రేయోభిలాషే.

ఇండస్ట్రీలో శ్రేయోభిలాషులు చాలా తక్కువ మంది ఉంటారు. ఇలా అనడానికి కారణం కూడా మా గురువుగారు చక్రవర్తిగారి ఇన్సిడెంటే.... అందుకే ఈ ఇంటర్వ్యూకి అనుబంధం, ఆత్మీయత అంతా ఒక బూటకం, ఆత్మతృప్తికై మనుషులు ఆడుకునే నాటకం అని హెడ్డింగ్ పెట్టండి. చాలా సంతోషిస్తాను.

# కీరవాణి మధురగీతాలు

**అన్నమాచార్యకీర్తన**

**చిత్రం : అన్నమయ్య** **గానం : యస్పీ బాలసుబ్రమణ్యం**

పురుషోత్తమా...
పురుషోత్తమా....
పురుషోత్తమా......
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
మమ్ము ఎడయకవయ్యా కోనేటిరాయడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
మమ్ము ఎడయకవయ్యా కోనేటిరాయడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
కోరిమమ్మునేలినట్టి కులదైవమా
చాలా నేరిచి పెద్దలిచ్చిన నిధానమా
గారవించి దప్పి దీర్చు కాలమేఘమా....
గారవించి దప్పి దీర్చు కాలమేఘమా....
గారవించి దప్పి దీర్చు కాలమేఘమా....
మాకు చేరువ చిత్తములోని శ్రీనివాసుడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
మమ్ము ఎడయకవయ్యా కోనేటిరాయడా
చెడనీక బ్రతికించే సిద్ధమంత్రమా.......
ఓం....నమో వేంకటేశాయ
ఓం...నమో వేంకటేశాయ
చెడనీక బ్రతికించే సిద్ధమంత్రమా....
రోగాలడిచి రక్షించే దివ్యౌషధమా
వడి బాయక తిరిగే ప్రాణబంధుడా....
వడి బాయక తిరిగే ప్రాణబంధుడా....
వడి బాయక తిరిగే ప్రాణబంధుడా....
మమ్ము నడిపించినట్టి శ్రీవెంకటనాథుడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
మమ్ము ఎడయకవయ్యా కోనేటిరాయడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
పురుషోత్తమా...
పురుషోత్తమా....
పురుషోత్తమా......

**చిత్రం : గాండీవం** **రచన: వేటూరి**

**గానం : యస్పీ బాలసుబ్రమణ్యం, యం.జి.శ్రీకుమార్, చిత్ర**

గోరువంక వాలగానె గోపురానికి
స్వరాల గణ గణా గంటలే మోగనేలా
గోపబాలుడొచ్చినాక గోకులానికి
పెదాల కిలకిలా పువ్వులే పుట్టలేదా
బాలక్రిష్ణుడొచ్చినప్పడే
వయ్యారి నందనాలు నాట్యమాడగా
వారసుణ్ణి చూసినప్పడే
వరాల వాంఛలన్ని పల్లవించగా
నందుడింట చిందులేసె
అందమైన బాలుడే తనవాడై... ॥గోరువంక॥
ఏటి మనుగడ కోటి అలలుగ
పొంగు వరదల వేగాన
పడి లేచు అలలకు తీపి కలలకు
లేని అలసట నీకేలా
నల్ల నల్ల నీళ్లలోన ఎల్లకిల్లా పడ్డటున్న
అల్లోమల్లో ఆకాశాన చుక్కల్లో
అమ్మాయంటే జాబిలమ్మ అబ్బాయంటే సూరీడమ్మ
ఇంటి దీపమవ్వాలంటా దిక్కుల్లో
ఎవరికి వారే ....యమునకు మీరే.....
రేవు మీద నావదంట నావతోడు రేవుదంటా
పంచుకుంటే... ॥గోరువంక॥
ప్రేమ ఋతువులు పూలు తొడిగిన
తేనె మనసుల నీడల్లో
మురిపాల నురగలు పంటకెదిగిన
పూల సొగసుల బాటల్లో
బుగ్గందాల ఏరు నవ్వె సిగ్గందాల పిల్ల నవ్వె
బాలయ్యొచ్చి కోలాటాడె వేళల్లో
పైరందాల చేలు నవ్వె పేరంటాల పూలు నవ్వె
గోపమ్మొచ్చి గొబ్బిళ్లాడె పొద్దుల్లో
పరవశమేదో..పరిమళమాయె...ఏ ఏ ఏ ఏ ఓ...
పువ్వునవ్వె దివ్వెనవ్వె జివ్వుమన్న జన్మనవ్వె
పాడుతుంటే... ॥గోరువంక॥

**చిత్రం : రాజేశ్వరీ కల్యాణం**

**రచన: పల్లవి- త్యాగరాజు కీర్తన నుండి చరణాలు : వేటూరి** **గానం : చిత్ర, యస్పీ బాలసుబ్రమణ్యం**

ఓడను జరిపే ముచ్చట కనరే వనితలారా నేడు
ఓడను జరిపే ముచ్చట కనరే వనితలారా నేడు
ఆడువారు యమున కాడ....
ఆడువారు యమున కాడ కృష్ణుని కూడి
ఆడుచు పాడుచు అందరు చూడగా
ఓడను జరిపే ముచ్చట కనరే.......
వలపు తడీ తిరణాలే పొంగిన ఏటికి అందం
కెరటాలకు వయ్యారం కదిలే తీరం
తిలకమిడే కిరణాలే పొద్దుటి తూరుపుకందం
చినదానికి సింగారం సిగ మందారం
పదాల మీదే పడవ-పెదాలు కోరే గొడవ
ఎదల్లో మోగే దరువే-కదంగా నావే నడవ
ఇలా నీలాటి రేవులో ॥ఓడను॥
చిలిపి తడీ వెన్నెలలే గౌతమి కౌగిలికందం
తొలి చూలుకి శ్రీకారం నడకే భారం
ఉలికి పడే ఊయలలే కన్నుల పాపలకందం
నెలవంకల సీమంతం ఒడిలో దీపం
తరాలు మారే జతలే -స్వరాలు పాడే కథలో
సగాలై పోయే మనువే-సృజించే మూడో తనువే
త్యాగయ్య రామలాలిలో ॥ఓడను॥

హాస్య నాటిక

# కారులో షికారు

- కె.వి.ఆర్.విజయకుమార్

**ఇందులో పాత్రలు**

| | | |
|---|---|---|
| పాపారావు | గౌరీపతి | శ్రీనివాస్ |
| ఎ.సి.బి. ఇన్‌స్పెక్టర్ | భిక్షం | కావేరి |



**జరిగిన కథ**

రిటైర్డు హెడ్‌మేష్టారు గౌరీపతి కొడుకు శ్రీనివాస్(వాసు) వ్యాపారం అంటూ అందర్నీ పిచ్చిస్కీములో చేర్పించాలని చూస్తాడు. పక్కపోర్షన్లో ఉన్న రెవెన్యూ ఉద్యోగి కూతురు కావేరిని ప్రేమిస్తాడు. వాళ్లిద్దరి పెళ్లి గౌరీపతికి సమ్మతమేకానీ పాపారావుకిష్టంలేదు. తన కూతురికేసీ కన్నెత్తి చూడనని మాటిస్తేనే స్కీములో చేరతానని వాసుకు చెప్తాడు. ఓ రోజు భిక్షం భరద్వాజ ఇద్దరూ కలిసి లంచం యిస్తున్నట్టు నాటకమాడి పాపారావును మోసగించబోతారు. కానీ పాపారావు అది గ్రహించి జాగ్రత్త పడతాడు.

- ఇక చదవండి

భరద్వాజ : తప్పైపోయింది.... వదిలేయ్ అన్నా...ఈ వెధవ ఆలోచన యిచ్చింది ఈ భిక్షంగాడే, ముందుగా డబ్బులిచ్చి... అనక ఎ.సి.బి. ఇన్‌స్పెక్టర్ అని నిన్ను బెదిరిస్తే మన డబ్బుల్తోపాటు వేలకు వేలు నీ దగ్గరనుండి గుంజొచ్చుని ముష్టి సలహా యిచ్చాడు. నిజమేనని నమ్మి ఫైనాన్స్ వడ్డీకి 5,000/- తెచ్చి యిచ్చి నీకు బుక్ అయ్యాం.

అన్నా! నీకు దండం పెడతా నా డబ్బులు నాకిస్తే ఆ ఫైనాన్స్ వాడికిచ్చేసి బుద్ధిగా బతుకుతా.. ఇంక ఈ చాయలకొస్తే నీ చెప్పుతో కొట్టు.

(అంటూ ప్రాధేయ పడతాడు. నీ సంగతి ఏంటన్నట్లుగా భిక్షం వైపు చూస్తాడు పాపారావు)

భిక్షం : నేనా? (ఆశ్చర్యంగా).. నేను కూడా వాడిమాదిరే సార్. ఈసారికి క్షమించండి సారూ..ఇక బుద్ధిగా వుంటా. ఇంక మీ యింటి ఛాయలకు కూడా రాను. ...చచ్చి నీ కడుపున కూడా పుట్టనుసార్. వదిలేయండి (అంటూ దండం పెడతాడు)

పాపారావు : (ఆలోచిస్తాడు) అరేయ్... మిమ్మల్ని వదిలేయాలంటే ఒక కండీషన్.

భిక్షం : కండిషనా?(!)

భరద్వాజ : చెప్పండి( ఏడుపు మొహంతో)

పాపారావు : ఏం లేదురా ..నాక్కాబోయే అల్లుడు వండర్‌ఫుల్ బిజినెస్ ఒకటి స్టార్ట్ చేసాడు.... దాంట్లో మెంబర్లుగా చేరండి.

భిక్షం : చేర్తాం...చేర్తాం...(!)

భరద్వాజ : (భిక్షాన్ని ఒకటి పీకుతాడు) నీదేం పోయిందిరా దరిద్రుడా? అవతల ఫైనాన్స్‌లో తెచ్చింది నేను. ఐదు వేలిచ్చింది నేను..

పాపారావు : ఆ అయిదువేలు నాకు చేరలేదే!

భరద్వాజ : అమ్మో చచ్చా. (భిక్షంవైపు చూస్తాడు...భిక్షం దండం పెడుతూ పాపారావుని చూపిస్తాడు) సార్... ఎందుకు సార్ మా జీవితాల్తో ఇలా ఆడుకుంటారు. వీడేమో యిచ్చాననంటాడు... మీరేమో చేరలేదంటారు..నా బతుకు




బస్‌స్టాండ్ చేశారు యిద్దరూ కలిసి .. నా డబ్బులు నాకిచ్చెయ్యండి సార్.. (ఏడుపు మొహంతో)

పాపారావు : అలా డీలాపడిపోకయ్యా... ఆ డబ్బులిచ్చేస్తే నీకు మిగిలేదేముంది? తీసుకెళ్ళి అప్పు తీరుస్తావ్ అంతేకదా... అలా కాకుండా మా అల్లుడి స్కీములో పెట్టుబడి పెట్టావనుకో నెలలు తిరిగేటప్పటికి కోటేశ్వరరావై పోతావ్... ఆలోచించు.

భరద్వాజ : ఆలోచించుకోటానికేముంది? రోట్లో తలకాయ పెట్టాను. రోకటి పోటుకు దడవడ మెందుకు? ఈ పెట్టుబడేదో పెట్టి వచ్చేనెల్లో కోటియ్యండి.

పాపారావు : ఏంది... చలికోటా యిచ్చేది?... తగుదునమ్మా అని ఐదువేలు తెచ్చాడు. వచ్చే నెల్లో కోటీశ్వరులంట... ఆ పెట్టుబడితో కోటేశ్వర రావు కాదు, కాదు వేలేశ్వరావు కూడా కాలేవు తెల్సా?

భిక్షం: వేలేశ్వరరావా?....(ఆశ్చర్యం)

పాపారావు : అదే ...వేల రూపాయలు కూడా రావు...అంచేత యిప్పుడున్న మీ డబ్బుతో పాటు యింకో యాభైవేలు తీసుకురండి.

భరద్వాజ : వామ్మో...వామ్మో... యిలా బుక్కయి పోయానేంట్రా బాబూ...ఈ పెట్టుబడులు, వ్యాపారాలతో నాకు సంబంధం లేదు. మీరు గ్యారంటీ అంటే చెప్పండి మిగతా డబ్బులు ఫైనాన్స్‌లో తెచ్చిస్తా.

పాపారావు : సరే... నాదీ పూచి. నువ్వు పోయి డబ్బులు పట్రా.

భిక్షం : డబ్బులా...?..సార్ ఈ డబ్బులైనా మీ చేత్తో లెక్కపెట్టి తీసుకుంటారా?

పాపారావు : ఎందుకురా?

భిక్షం : ఎందుకంటి?... (ఆశ్చర్యంగా) నేనేమో యివ్వటం.. మీరేమో



యివ్వలేదంటం....
మధ్యలో తన్నులు తినటం
నావల్లకాదు.

భరద్వాజ : ఈ మాట కరెక్ట్.

పాపారావు: ఓ.కే.. యిక మీ ఇద్దరి జాతకాలు మారిపోయినట్లే.

లైట్సాఫ్. 4వ సీను

(గౌరీపతి కుర్చీలో న్యూస్ పేపరు చదువుతుంటాడు.. పాపారావు మరో కుర్చీలో పేకాడుకుంటూ వుంటాడు)

గౌరీపతి : అరెరే...ఎంత అన్యాయం .. విన్నావంట్రా పాపి... నెహ్రూ జులాజికల్ పార్కులో రాత్రికి రాత్రి దొంగలు పులిని చంపి చర్మాన్ని వలుచుకుపోయార్ట'.. దొంగతనానికి కాదేది అనర్హం అని నిరూపించారే దొంగ నన్యాసులు... నువ్వేమంటావు.

పాపారావు : నిన్ను నోరుమూసుకుని పేపరు చదువుకో మంటాను. ఆర్నెల్ల క్రితం న్యూస్‌ని ఈ వేళ ఉదయం జరిగినట్లు ఫ్లాష్‌న్యూస్ లాగా వూరించుకుంటూ చదివి ఛస్తావ్...మీ వాడేమో వున్న డబ్బులన్నీ డిపాజిట్లని.. స్కీములని పూడ్చి పెట్టాడు. చివరకు క్లబ్‌కి పోవటానికి కూడా డబ్బుల్లేక ఒక్కడ్నే ఐదుగురి ఆట ఆడుకుంటూ ఆదివారం కూడా కాలక్షేపం చెయ్యలేక ఛస్తుంటే నీ నసొకటి. ఆ పేపరు అవతల తగలేసి నాతో చెయ్యి కలపొచ్చుగా...

గౌరీపతి : ఆహాఁ.... నువ్వు ఆ పేక అవతల పారేసి నాతో న్యూస్ పంచు కోవచ్చుగా .

పాపారావు : ఛీ... నీకు బుద్ధి రాదురా...

వాసు : (ప్రవేశం ) సక్సెస్ ..ఫుల్ సక్సెస్...

వాసు : నాన్నా మన వూరెళ్ళి అలా స్కీము గురించి చెప్పానో లేదో.... మా గౌరిపతి కొడుకువి నువ్వు చెబితే గంగలో దూకమన్నా దూకుతా మన్నారనుకో.

పాపారావు : కొంపదీసి అందరూ వాగులో దూకేశారా?

వాసు : భల్లే మామయ్యా నీ వేళాకోళం నువ్వూనూ?.... అలా చెప్పి వందమంది దాకా చేర్పించి... వాళ్ళచేత డి.డి.కట్టించి మా ఆఫీసులో హ్యాండోవర్ చేసి మరి వస్తున్నాను నాన్నా.




గౌరీపతి : మరి మన కమీషన్ గట్రా.?,,, (అనుమానంగా అడిగాడు)

వాసు : భయపడాల్సిందేమీ లేదు నాన్నా.... మన కొచ్చే కమీషన్ కంపెనీకే డిపాజిట్ క్రింద కట్టేస్తే స్టేట్ మొత్తానికి సేల్స్‌మేనేజర్ పోస్టు యిస్తామన్నారు... సరే! అని అదిగూడా కట్టేసి సేల్స్ మేనేజర్ అప్పాయింట్‌మెంట్ తీసుకొని వచ్చా...(అంటూ జేబులోంచి కవరు తీసి చూపిస్తాడు)

పాపారావు : అబ్బో..అబ్బో... ఏం తెలివితేటలు ఏం..తెలివితేటలు..అరేయ్ వాసూ....వచ్చే ఏడాదికి నువ్వు మీ కంపెనీ జనరల్ మేనేజర్ అయినా ఆశ్చర్యం లేదురా.

గౌరిపతి : మరి ఫెసిలిటీస్ ఏమైనా యిచ్చారా?

వాసు : లేకేం... కారూ... బంగళా.. బొచ్చు కుక్కా..అన్నీ మన సొంతం..

పాపారావు : అసలు బంగళా కడతార్రా

వాసు : అంత తక్కువగా అంచనా వెయ్యకు మామయ్యా! స్టేట్ మొత్తానికి సేల్స్ మేనేజర్.
- బంగళా కట్టిం తర్వాత..యిప్పుడు అర్డరు మాత్రమే యిచ్చారు. తర్వాత కబురు చేస్తామన్నారు.

వాసు : కావేరి..నాకాబోయే భార్యామణీ, రా స్టేట్ సేల్స్ మేనేజర్ కి కాబోయే భార్యామణీ రా బయటకు

పాపారావు : అది ఉంటేగా రావటానికి.

వాసు : ఎక్కడకు వెళ్ళిందీ...

పాపారావు : షాపింగ్‌కు వెళ్ళింది చీర కొంటే చీర ఫ్రీ, జాకెట్టు కొంటే బాడీ ఫ్రీ అని. (అందరూ నవ్వుతారు, కావేరి ప్రవేశం)
(ఇంట్లోకి వచ్చి అన్ని మూలలు వెతుకు తుంటుంది..)

పాపారావు : ఏంటమ్మా వెతకు తున్నావ్. అయినా షాపింగ్‌కి వెళ్ళిన దానివి ఉత్తచేతుల్తో వచ్చావంటే నీకు జాగ్రత్త తెలిసొచ్చి ందన్నమాట. బావుంది.. బావుంది..

కావేరి : ఈ మూల బావుంటుందా నాన్నా?

పాపారావు : నేనంటుంది మూల బావుంది నందులో బావుందని కాదు, నువ్వు చేసిన పని బావుందని అన్నాను.

కావేరి : అంతే నాన్నా....నేను ఏది కొన్నా అలా బానే వుంటుంది.

గౌరిపతి : ఏం కొన్నావమ్మా?...నీతో ఏం తేలేదుగా?....

కావేరి : వెంటనే తేవటానికి ఎలా కుదురుతుంది?... ఎక్కడ కట్టెయ్యాలో ముందు చూసుకోవద్దూ.

పాపారావు : చోటు చూసుకోవటం ఏమిటే? ఏం తెచ్చావ్ నా నెత్తికి తద్దినం.

కావేరి : మరదే...విషయం తెలుసుకోకుండా వెచ్చుకుంటావ్... మళ్ళీ తిడతావ్... చెబుతా విను... గుర్రం కొంటే కళ్ళెం ఫ్రీ అంటే పెళ్ళికి ఊరేగటానికి బావుంటుంది కదా అనీ..

పాపారావు : కొన్నావా....?(కోపంగా)

కావేరి : లేదు రెడీగా వుంచమని చెప్పొచ్చా. ఎక్కడ కట్టెయ్యాలో చూసు కోకుండా కొనేంత తెలివితక్కువ దాన్నేం కాదు తెలుసా?

పాపారావు : అఘోరించావ్..లోపలికి తగలడు. నిన్నే దరిద్రుడు చేసుకుంటాడో గానీ వాడి కొంప...

వాసు : మామయ్యా..నువ్వూ అదే మాటా?;

పాపారావు : ఓ సారీ... నువ్వేగా.. అనుభవించు ..(కావేరి వైపు తిరిగి) నువ్వు లోపలికి తగలడు.(అంటూ

లోపలకి పంపిస్తాడు)

(భరద్వాజ, ప్రవేశం. లుంగీ -షర్టు మీద వస్తాడు. మీసాలు తీసేసి సాదాగా వుంటాడు)

(భిక్షం - భరద్వాజ ప్రవేశం)

భరద్వాజ : ఆపండి మీ గోల.. చేపల మార్కెట్ లాగా ఎపుడూ కొంపలో కోలాహలమే. అవతల కొంపలు మునిగిపోతున్నాయి.

పాపారావు : ఎవరివి బాబూ!

భిక్షం : ఎవరివా ? (ఆశ్చర్యం)

భరద్వాజ : (భిక్షంతో)నువ్వు నోర్ముయ్... (పాపా..గౌరీలతో ) మీరంతా ఎగబడి కట్టించిన స్కీమ్ తాలుకు కంపెనీ వాళ్ళు రాత్రికి రాత్రికి బోర్డు తిప్పి పలాయనం చిత్తగించారు.

గౌరిపతి,పాపారావు,వాసు, కావేరి : కంపెనీ మూసేసారా?

భరద్వాజ : జనమంతా ఆ కంపెనీ ముందు నానా గొడవచేస్తున్నారు. ఫైనాన్స్‌లో తెచ్చిపెట్టుబడి పెట్టాను. ఏలినాటి శని నెత్తి మీదుంటుందంటారు. శనిగాడు నా ప్రక్కనే వుండి నన్ను ఆర్పేడు. నేను కూడా దురాశకు పోయి అర్హత లేని ఆశలు పెంచుకొని కారులో షికారు చెయ్యాలనే ఆశతో లక్షలు సంపాదించాలనే పేరాశతో మిమ్మల్ని నమ్మాను. మీరేం చేస్తారో నాకు తెలియదు. జనం మీమీద పడి మిమ్మల్ని బతకనివ్వరు తేల్చుకోండి.

గౌరీపతి : (గుండె చేత్తో పట్టుకొని నేలకొరిగి పోతాడు)ఇది గమనించిన వాసు -కావేరి ఏడుస్తూ గౌరిపతి దగ్గరకు చేరారు. పాపారావు అచేతనంగా నిలబడి చూస్తూంటాడు.)

పాపారావు : (గౌరీవైపుచూస్తూ) చచ్చిపోయాడు. గుండె పగిలి చచ్చిపోయాడు. లేదు. వాడెందుకు చచ్చిపోతాడు చచ్చిపోయి బ్రతికి పోయాడు. ఇప్పుడు యింటిమీద పడే జనానికి ఎవరూ సమాధానం చెబుతారు నువ్వా.. .నువ్వా... కాదు నువ్వే.. రండి...రండి.. మంచి తరుణం మించిపోవునూ. ఈ డబ్బులన్నీ పట్టుకోండి. మా అల్లుడికివ్వండి.. మీరు గొప్పవాళ్ళే అవుతారు. కోటీశ్వరులైపోతారు. నేనిప్పుడు కోటీశ్వరుడ్ని.. నా పేరు పాపారావు కాదు... కోటేశ్వరరావు... అదుగో నా కారు.. నా బంగళా.. నా గొర్రె లు, పిల్లలు, టుర్.. టుర్..గంధపు చెట్లు-టేకు చెట్లు ఇవి నావే. మీరంతా దూరంగా ఉండండి.. నా డబ్బులు..(పిచ్చి చేష్టలు చేస్తూ సైలెంట్ అయిపోతాడు)

గౌరిపతి : అమ్మయ్య.. ఆ భరద్వాజగాడు బయటకు పొయ్యాడు!

కావేరి,వాసు: నువ్వు చచ్చిపోలేదా?

గౌరిపతి : నేను చచ్చిపోవటం కాదు.. యిప్పుడా జనం మనమీద పడ్డారంటే అందరం పోవటం ఖాయం. గుండ్రాయిలాంటి గుండె కాబట్టి తట్టుకోగలిగాను. మన డబ్బులు పోయాయన్న బాధవున్నా జనానికి మన మొహాన్ని ఎలా చూపించాలి? పూలు అమ్మిన చోట కట్టెలమ్మ గలమా ? (అంటూ పాపారావు వైపు వెళ్తాడు) వీడికి నిజంగానే మతిచలించిందా ఏమిటి పాపం.. అరే వాసూ..కావేరీ వాడ్ని కాస్త చూడండమ్మా.

పాపారావు : నాకు పిచ్చెక్కలేదురా... ఒక్కసారిగా షాక్ తగిలే సరికి దిమ్మ తిరిగినట్లై పిచ్చి,పిచ్చి మాటలొచ్చాయి. ఒరేయ్.. ఇప్పుడు మన డబ్బులు పోవటమే గాక జనాల్ని కూడా చేర్పించాం గదరా ఇంతమంది అమాయక జనాన్ని ముంచి పేరాశను క్యాష్‌గా మార్చుకొనే ఆ కంపెనీ వాళ్ళు వుడాయించారే.

గౌరీపతి : ఇప్పుడు ఎవరికేం సమాధానం చెప్పాలి? ఏది ఏమైనా సరే ఎక్కడైనా వెళ్ళి తలదాచుకుందాం. నిజమేరా వాళ్ళందరికి ఏం సమాధానం చెబుదాం (మూమెంట్)

కావేరి,వాసు: (ఆశ్చర్యంగా చూస్తూ వుంటారు) ఐడియా ..ఈ విషయం తేలేవరకు మనం ఇక్కడ నుండి జంప్ అవ్వాలి. హైదరాబాద్‌లో మా బావమరిది ఉన్నాడు. మనందరం అక్కడకు వెళ్ళి తలదాచుకుందాం.

పాపారావు : వెరీగుడ్ ఇప్పుడుమనకంతకంటే మార్గం లేదు. వెంటనే ఎవరికి దొరికినవి వారు తీసుకొని బయలుదేరుదాం పదండి.

వాసు : సరే మామయ్య...కావేరితో నా పెళ్ళి అక్కడ జరిపించండి.. ఈ లోపు కొత్త స్కీములేమైనా వస్తే చేరి నెలలు తిరిగేసరికి....

(అంటూ మధ్య ఆపి పాపారావు-గౌరిపతి చూస్తారు. వాళ్ళు పిడికిళ్ళు బిగించి వాసుపైకి దూకటానికి సిద్ధమతున్నారు)

(సమాప్తం)



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తెలుగు | తమిళం |
|---|---|---|
| చిత్రం | మిస్సమ్మ | మిస్సియమ్మ |
| రచన | పింగళి నాగేంద్రరావు | తంజై రామయ్యాదాస్ |
| సంగీతం | యస్.రాజేశ్వరరావు | యస్.రాజేశ్వరరావు |
| గానం | ఎ.ఎం.రాజా, పి.సుశీల | ఎ.ఎం.రాజా, పి.సుశీల |
| అభినయం | ఎన్.టి.రామారావు, సావిత్రి నాగేశ్వరరావు ,జమున ఎస్వీరంగారావు బుష్యేంద్రమణి,బాలకృష్ణ | జెమిని గణేష్, సావిత్రి, జమున,తంగవేలు, ఎస్వీ రంగారావు బుష్యేంద్రమణి,ఎ.కరుణానిధి |

'మిస్సమ్మ' తెలుగు చిత్రంలో చాలా ప్రత్యేకతలు కనిపిస్తాయి. వినిపిస్తాయి. చాలా చిత్రాలలో పాటలు కథాగమనంతో సంబంధం లేకుండా అతికించినట్టు కనిపిస్తాయి. 'మిస్సమ్మ' చిత్రం ఈ పద్ధతికి భిన్నంగా కనిపిస్తుంది. చిత్రంలోని ఏ పాట అయినా కథలో భాగంగానే ఉంటుంది. పాటలు కథలో హాయిగా కలిసిపోవడంతో బాటు కొన్ని సందర్భాలలో పాత్రల తత్వాన్ని తెలుసుకోవడానికి తోడ్పడతాయి. మరికొన్ని సందర్భాలలో పాటలు కథను నడిపిస్తాయి.

'మిస్సమ్మ'చిత్రంలోని కొన్ని పాటలలో అంతర్లీనంగా నాయికా నాయకుల మధ్య సంవాదం సాగుతూ ఉండటం గమనించవచ్చు. ఇద్దరూ ఇద్దరే. అవసరం కొద్దీ భార్యాభర్తలుగా నటించి ఉద్యోగాలు సంపాదించడంతో వాళ్ల 'వింతగాథ' మొదలవుతుంది. నాయిక మేరీ (సావిత్రి) చేసిన అప్పు తీర్చడంకోసం నాయకుడు ఎంటీరావు (ఎన్.టి.రామారావు) తన మొదటి నెల జీతం కూడా ఆమె జీతంతో కలిపి ఆమె తండ్రికి మనీ ఆర్డర్ చేస్తాడు. మొదట వ్యాపారపరమైన ఒప్పందంగా మొదలయిన వాళ్ల పరిచయం ప్రేమగా పరిణమిస్తుంది. అయితే ఇద్దరూ గుంభనగానే ఉంటారు. నాయకకు తనమీద ప్రేమ ఉందని నాయకుడు గుర్తిస్తాడు. తొందరపాటు వల్ల ఆమె ఎప్పటికప్పుడు ఉద్యోగానికి ఎసరుపెట్టే పనులు చేస్తున్నా జాగ్రత్తగా వాటిని సర్దుకుంటూ వస్తాడు. అయితే అవకాశం దొరికినప్పుడల్లా ఆమెను ఉడికిస్తూనే ఉంటాడు.

తప్పిపోయిన తమ పెద్దకూతురు మహాలక్ష్మి పేరుమీద బడి నడుపుతున్న జమిందారు గోపాలరావు నాయుడు,ఆయన భార్య 'అమ్మి' తమ రెండవ కూతురు సీతను ఎంతో గారాబంగా పెంచుతూ ఉంటారు. సీత (జమున) సంగీతం నేర్చుకోవడానికి నాయికా నాయకుల ఇంటికి వస్తుంది. సీతను మేరీ తరిమికొడుతుంది. సీత పంతులును ఇంటికి పిలిపించుకొని పాఠం చెప్పించుకుంటానని పంతం పట్టి వెళ్లిపోతుంది. సీతను ప్రేమిస్తున్న ఆమె బావ 'డిటెక్టివ్' రాజు (నాగేశ్వరరావు)కు పంతుళ్ల ఇంట్లో ఉన్న దేవయ్య (రేలంగి)-పంతులు సీతను పెళ్లాడే ఆశతో ఉన్నాడని చెబుతాడు.

రాజు తన దగ్గర సంగీతం నేర్చుకొని ఆ తర్వాత సీతకు సంగీతం నేర్పవచ్చునని చెబుతుంది మేరీ. ఆ సంగీత శిక్షణ లో భాగంగా 'మీకు మీరే మాకు మేమే' అని అప్పటికప్పుడు పాట సృష్టించి నేర్పుతుంది. 'మీకు మీరే మాకు మేమే'అని పాడడం- ఆ పక్కనే ఉండి ఈ సంగీత శిక్షణను చూస్తున్న నాయకుడికి చేస్తున్న హెచ్చరిక కావచ్చు.

సీతకు సంగీతం నేర్పడానికి ఎంటీరావు జమిందారు ఇంటికి వెడతాడు. అతని వెంట మేరీ కూడా వెడుతుంది. వాళ్లిద్దరూ వెళ్లేసరికి రాజు 'మీకు మీరే మాకు మేమే' పల్లవిని హార్మోనియం సాయంతో అభ్యాసం చేస్తూఉంటాడు. మేరీ-రాజుకు అతని గదిలో సంగీత పాఠం మొదలు పెట్టేలోగా ఎంటీరావు-సీతకు పాఠం మొదలు పెడతాడు. 'రండి మీకు పాఠం చెబుతాను' అని మేరీ అంటే 'ఇప్పుడు వద్దు లెండి. వాళ్లపాట అయ్యేదాకా అక్కడుండి వస్తాను. మీరిక్కడ కూచోండి' అని వెళ్లిపోతాడు రాజు.

అప్పుడు ఎంటీరావు-సీతకు 'బృందావనమది అందరిదీ గోవిందుడు అందరి వాడేలే' అనే పాటను నేర్పుతాడు.

పాట మొదలు కాగానే సంబరంగా కనిపించిన రాజు 'గోవిందుడు అందరి వాడేలే' అనగానే చిన్న బుచ్చుకొన్నాడు. పాట తనను ఉద్దేశించి పాడుతున్నదని మేరీ కూడా మూతి ముడుచుకొంది. కాసేపు చూసి, నెలరోజులు సెలవు కావాలని ఉత్తరం రాసి రాజు వెంట ఉండే గోవిందుకు ఇచ్చి వెళ్లిపోతుంది. ఆ ఉత్తరం వల్ల కథ మరొక మలుపు తిరిగి, 'రావోయి చందమామ' పాటకు దారితీస్తుంది.

'బృందావన మది అందరిది' పాటను ఎ.ఎం.రాజా,పి.సుశీల పాడారు. పాట రచయిత పింగళి నాగేంద్రరావు. ఈ పాట -చోట 'మిస్సియమ్మ' తమిళ చిత్రంలో 'బృందావనముం నంద కుమారనుం' అనే పాట ఉంది. పాటరాసిన వారు తంజై రామయ్యాదాస్. గాయనీ గాయకులు-సుశీల,రాజా. తెలుగు,తమిళ చిత్రాలు రెండింటికీ రాజేశ్వర రావు సంగీతం సమకూర్చారు.

ముందుగా పింగళి రాసిన తెలుగుపాట :-

అ: బృందావనమది అందరిదీ గోవిందుడు అందరి వాడేలే
ఆ: బృందావనమది అందరిదీ గోవిందుడు అందరివాడేలే
ఎందుకే రాధా ఈసునసూయలు
అందములందరి ఆనందములే
ఎందుకే రాధా ఈసునసూయలు
అందములందరి ఆనందములే
ఇ: బృందావనమది అందరిదీ...
అ: పిల్లన గ్రోవిని పిలుపును వింటే
ఉల్లము ఝల్లన పొంగదటే
ఆ: పిల్లనగ్రోవిని పిలుపును వింటే
ఉల్లము ఝల్లన పొంగదటే
అ: రాగములో అనురాగము చిందిన
జగమే ఊయల ఊగదటే
ఆ: రాగములో అనురాగము చిందిన
జగమే ఊయల ఊగదటే
ఇ: బృందావనమది అందరిదీ...
అ: రాసక్రీడల రమణుని గాంచిన
ఆశలు మోసులు వేయవటే
ఆ: రాసక్రీడల రమణుని గాంచిన
ఆశలు మోసులు వేయవటే
అ: ఎందుకే రాధా ఈసునసూయలు
అందములందరి ఆనందములే
ఇ: బృందావనమది అందరిదీ...





తెలుగు చిత్రంలోని ఈ పాట సన్నివేశంలో ఎన్.టి.రామారావు, నాగేశ్వరరావు, సావిత్రి, జమున,ఎస్.వి.రంగారావు, ఋష్యేంద్రమణి, బాలకృష్ణ కనిపిస్తారు. తమిళ చిత్రంలోని పాట సన్నివేశంలో ఎన్.టి.రామారావు పాత్రలో జెమిని గణేష్, నాగేశ్వరరావు పాత్రలో తంగవేలు, బాలకృష్ణ పాత్రలో ఎ.కరుణానిధి కనిపిస్తారు.

చిత్రం మొత్తం మీద బాలకృష్ణ పోషించిన గోవిందు పాత్రకు సంభాషణలు లేకపోవడం విశేషం.

ఇక్కడ తమిళ చిత్రంలోని పాటను చూద్దాం.

అ: బృందావనముం నందకుమారనుం
యావరుక్కుం పొదు శెల్వమండ్రో
ఆ: బృందావనముం నందకుమారనుం
యావరుక్కుం పొదు శెల్వమండ్రో
అ: ఏనో రాదా ఇంద పొరామై
యార్దాన్ అళగాల్ మయంగాదవరో
ఆ: ఏనో రాదా ఇంద పొరామై
యార్దాన్ అళగాల్ మయంగాదవరో
ఇ: బృందావనముం...
అ: పుల్లాంగుళలిశై ఇనిమైయినాలే
ఉళ్ళమే జిల్లెన పొంగాదా
ఆ: పుల్లాంగుళలిశై ఇనిమైయినాలే
ఉళ్ళమే జిల్లెన పొంగాదా
అ: రాగత్తిలే అనురాగ మేవినాల్
జగమే ఊంజలిల్ ఆడాదా
ఇ: బృందావనముం...
అ: కణ్ణనిన్ ఉన్నద లీలైయై నినైత్రాల్
తన్నైయే మఱందిడ శెయ్యాదా
ఆ: కణ్ణనిన్ ఉన్నద లీలైయై నినైత్రాల్
తన్నైయే మఱందిత శెయ్యాదా
అ: ఏనడి రాదా ఇంద పొరామై
యార్దాన్ అళగాల్ మయంగాదవరో
ఇ: బృందావనముం...









తమిళగీతం ఏమంటున్నదో చూద్దాం.

బృందావనమూ నందకుమారుడూ
అందరికీ ఉమ్మడీ సంపద(లు) కదా
ఎందుకో రాధా ఈ అసూయ
అందానికి (అందం చూసి) మురియని వారెవరు? ॥బృందావనమూ॥
పిల్లనగ్రోవి సంగీతం తీయదనం వల్ల
ఉల్లమే జిల్లని పొంగదా
రాగంలో అనురాగం చేరితే
జగమే ఉయ్యాలలూగదా ॥బృందావనమూ॥
కన్నయ్య ఉన్నత లీలలు తలచిన వెంటనే (తలుచుకోగానే)
తనను మరిచేలా చెయ్యదా... (మై మరచి పోదా)

తెలుగు పాట ఒరవడిలోనే తమిళ గీతం సాగుతుంది. కాకుంటే తెలుగు పాటలోని అభిప్రాయాలు కొద్ది మార్పులతో తమిళంలో కనిపిస్తాయి.

బృందావనమూ అందరిదీ గోవిందుడూ అందరివాడు అని తెలుగు పాట విడి విడిగా చెబితే తమిళగీతం-బృందావనం,నందకుమారుడూ అందరికీ ఉమ్మడి సంపదలు అని చెబుతుంది. తెలుగు పాటలో ఈసూ,అసూయ రెండూ ఉండగా తమిళగీతంలో ఈసు లేదు. అసూయ మాత్రం ఉంది.

అందం అందరినీ మురిపిస్తుంది అనడానికి తెలుగుపాట 'అందములందరి ఆనందములే' అంటుంది. తమిళ గీతం కొంత సాగదీసి 'అందువల్ల మురియని వారెవరు' అని ప్రశ్నిస్తుంది. తెలుగు పాటలో 'పిల్లనగ్రోవి పిలుపు' ప్రస్తావన ఉండగా తమిళ గీతం వేణుగానాన్ని పేర్కొంటుంది. తెలుగు పాటలోని మాధుర్యం తమిళ గీతంలో తగ్గినట్టు కనిపిస్తుంది.

'రాసక్రీడల రమణుని గాంచిన ఆశలు మోసులు వేయవటే'అని తెలుగు పాటలో ఉన్న చరణం తమిళంలో మరొక రూపంలో కనిపిస్తుంది. 'కన్నయ్య ఉన్నత లీలలు మైమరపింప జేస్తాయి' అనడంలో-తెలుగు పాటలోని ఆశలు మోసులు లేపే రసాత్మకత లేదు.

రెండు భాషల పాటల లోను-రాజా,సుశీలల స్వరాలు -నేటికీ నిత్యనూతనంగా వినిపిస్తాయి. అందుకు ఈ పాటల సృష్టికి కారకులయిన అందరూ అభినందనీయులే.

- పి.ఎస్.గోపాలకృష్ణ

## తనికెళ్ల భరణి పాటల రచయితగా గాయకునిగా...

మాటల రచయితగా, నటునిగా తనదైన ముద్రతో ఇటు క్లాస్, అటు మాస్ ప్రేక్షకులను విపరీతంగా ఆకట్టుకున్న తనికెళ్ల భరణి 'ఆటగదరా శివా, ఆటగదరా కేశవా' అంటూ అద్భుతంగా శివతత్వాలను రాసిన సంగతి తెలియని వారుండరు.



తాజాగా భరణి తన ఇష్టదైవమైన శివుని మీద 'నాలోన శివుడు గలడు!' మకుటంపై రాసిన పాటలను ఆడియో క్యాసెట్‌గా తీసుకువస్తున్నారు. వీణాపాణి స్వరరచనలో పి.సుశీల, యస్.జానకి, నిత్యసంతోషిణి, పార్థసారథి తో పాటు తనికెళ్లభరణి కూడా ఆలపించిన ఈ క్యాసెట్‌కు కార్తీక్ పర్యవేక్షకునిగా, దక్షిణామూర్తి వ్యాఖ్యాతగా వ్యవహరించారు. ఈ నెల 11న సికింద్రాబాద్ హరిహర కళాభవన్‌లో శ్రీ శైవ మహాపీఠం-జంటనగరశాఖ ఆధ్వర్యంలో జరుగనున్న ఓ భారీ కార్యక్రమంలో ఈ ఆడియో క్యాసెట్‌ను విడుదల చేయనున్నారు.

యస్.పి.బాలసుబ్రహ్మణ్యం ముఖ్య అతిథిగా పాల్గొనే ఈ కార్యక్రమంలో ప్రముఖ దర్శకులు కె. రాఘవేంద్రరావు తొలి క్యాసెట్ ఆవిష్కరిస్తారని, తొలి క్యాసెట్‌ను దర్శకులు కె.విశ్వనాథ్ స్వీకరిస్తారని, పలువురు సినీరంగ ప్రముఖులు ఈ కార్యక్రమానికి హాజరవుతారని శైవమహాపీఠం వారు ఓ ప్రకటనలో తెలిపారు.



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

బాల్యపు
లేతదనం
మళ్ళీ కోరుకునే
పెద్దలకు
మరీ మరీ
ప్రత్యేకం



పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

చిత్ర పరిచయం 8

సమన్వయం
మంజీర

## జరిగిన కథ

జాన్ డూలిటిల్‌కు చిన్నప్పుడు జంతువుల భాష అర్థమయ్యేది. క్రమేపీ ఆ శక్తి పోయింది. పెరిగి డాక్టరయ్యాక ఆ శక్తి తిరిగివచ్చింది. ఖంగారుపడి భార్యతో సహా ఎవరికీ చెప్పలేదు. అనుకోకుండా జంతువులకు వైద్యం చేయడం మొదలుపెట్టాడు. తమ బాధ తెలుసుకుని వైద్యం చేస్తున్నాడు కాబట్టి జంతువులన్నీ అతని వద్దకే రాసాగాయి. తన వాక్చాతుర్యం ఉపయోగించి ఓ పులిని ఆత్మహత్యా ప్రయత్నం నుండి మరలించాడు. ఆపరేషన్ చేసి ఓ ఎలుకను కాపాడాడు. కానీ జంతువుల భాష అతనికి అర్థం అవుతుందని తెలియని, నమ్మని అతని సన్నిహితులు అతన్ని మతిభ్రష్టుడిగా జమకట్టి ఓ హాస్పటల్‌లో జేర్పించారు.

(- ఇక చదవండి)

డాక్టరు బ్లయర్ పుణ్యమాని రిట్రీట్ హోమ్‌లో చేరిన డాక్టరు జాన్ డూలిటిల్ ఇతర పేషంట్స్‌తో బాటు భోజనం పళ్లెం చేతబట్టి, నర్స్ ఇవ్వబోయిన మందు మాత్రం నిరాకరిస్తూ వరండాలోకి వచ్చాడు. ఇంతలో చెట్టుకొమ్మ మీదనుండి ఓ ఉడత దిగివచ్చి ఉదారంగా ఓ ఆఫరిచ్చింది- "మీకేవైనా కావాలంటే - అంటే బాదం పప్పులూ, అవీ - కావాలంటే చెప్పండి. చిటికలో తెస్తాను."

"చేసిన సహాయాలు చాలు. ఏమీ అక్కర్లేదు." అన్నాడు జాన్ చికాగ్గా.

తిండివేటకు బయలుదేరిన ఉడత మొహమాట పెట్టబోయింది - "నేనెలాగూ బయటకు వెళుతున్నాను. మీకేం కావాలి?"



"అంతకంటె ఇంకేం కావాలి?" అన్నాడు జాన్ నర్మగర్భంగా.

ఉడత నొచ్చుకుందేమో, 'ఏమన్నా కావాలంటే మాత్రం పిలవండి' అని చెప్పేసి తుర్రున కిందకు జారింది.

* * *

తను జంతువులతో మాట్లాడగలనని జాన్ చెప్పిన విషయాన్ని నమ్మడానికి అక్కడెవరూ సిద్ధపడలేదు. కుక్క బొయ్ మన్నా, కోతులు కిచకిచ మన్నా దానికేదో వ్యాఖ్యానం చెప్పి బోల్తా పడడమో, కొట్టించడమో చేస్తున్నాడన్న అనుమానం పోలేదు డాక్టరు బ్లయర్‌కి. 'పోనీ ఓ టెస్టు పెట్టి చూద్దాం' అనుకున్నాడు. దానికిగాను ఓ పెద్ద చింపాంజీని రప్పించాడు. మనుష్యజాతికి దగ్గర చుట్టం కాబట్టి కొన్ని సంకేతాలద్వారా విద్య నేర్పడానికి కోతిజాతి చాలా అనువైనది. దానికి కొన్ని బొమ్మలూ అవీ చూపి మానవభాష అర్థమయ్యేట్లు తర్ఫీదు ఇస్తున్నారు. జాన్‌కి పరీక్ష పెట్టడానికి దాన్ని తీసుకువచ్చారు. తల చుట్టూ వైర్లు అవీ పెట్టి వాటిని కంప్యూటరుకి కనెక్ట్ చేశారు. జాన్‌ను ఎదురుగా కూచోబెట్టారు.

"ఏమిటివన్నీ?" అన్నాడు జాన్ అయోమయంగా.

"ఈ దెబ్బతో తేలిపోతుంది - నువ్వు జంతువులతో మాట్లాడగలవో లేదో - నాకే కాదు, యావత్తు ప్రపంచానికీ సందేహం తీరిపోతుంది." అన్నాడు అతన్ని పరీక్షించడానికి కూచున్న డాక్టరు బ్లయర్. అని పరీక్షావిధానం వివరించాడు -

"మామూలుగా దీనికి ఈ మానిటర్ మీద బొమ్మలు చూపిస్తాం. దానికి అదెలా ప్రతిస్పందించిందో బ్రెయిన్‌కు కనక్ట్ చేసిన వైర్ల ద్వారా కంప్యూటర్లో రికార్డు అవుతుంది. పావం బొమ్మలు బాగానే అర్థం చేసుకుంటుంది. కానీ ఇవాళ బొమ్మలు చూపించటం లేదు. నీకెలాగూ మాటామంతీ తెలుసు కదా, దానితో ఓ నాలుగు కబుర్లు చెప్పు.



అదెంతవరకూ అర్థం చేసుకుందో మాకు కంప్యూటర్లో తెలిసిపోతుంది." అన్నాడు డాక్టరు బ్లయర్ హేళనను, కాలేజీరోజుల్నుంచి దాచుకున్న అసూయను మిళాయించి.

జాన్ కోతికేసి చూశాడు. అదీ అతనికేసి చూసింది. జాన్ కుర్చీలో ముందుకి జరిగాడు. కోతి కూడా డిటో డిటో. తను చెప్పబోయేది వినేందుకు ఉత్సాహం కనబరుస్తోందన్న సంగతి గ్రహించి జాన్ మొదలుపెట్టాడు - "చూడూ, నేను చెప్పేది నువ్వు అర్థం చేసుకున్నావనుకో అదిగో ఆ మెషిన్లో ముల్లు కదులుతుంది. అప్పుడు నేను పిచ్చివాణ్ని కానని వీళ్లు నమ్ముతారు.



లేదనుకో నా శేషజీవితం ఇక్కడే గడిచిపోతుంది. సో, నీ సహాయం నాకు కావాలి. అర్థమయినట్లు ఏదైనా చెయ్యి."

కోతి ఏమీ మాట్లాడలేదు. నిశ్చలంగా అతనికేసి చూసింది. జాన్‌కి కంగారు పుట్టింది. "ఇదిగో కోతిచేష్టలు మాను, నేను మాట్లాడేది నీకు వినబడుతోందనీ, నీకు చెవుడు లేదనీ నాకు తెలుసు. నువ్వు ఉలుకూ, పలుకూ లేకుండా ఉండడం బాగాలేదు. పిల్లికి చెలగాటం, ఎలుక్కి ప్రాణసంకటం అన్న సామెతను తిరగరాయాల్సి వుంటుంది. నేను సీరియస్‌గా చెబుతున్నాను. నేను చెప్పేది అర్థం చేసుకో, చేసుకున్నట్లు ఏదైనా రియాక్షన్ ఇయ్యి." అన్నాడు కాస్త బ్రతిమాలుతూ.

కోతిముఖంలో చలనం లేదు. కంప్యూటరు వద్ద కూచున్న బ్లయర్‌కి ఇదంతా వేడుకగా ఉంది. "పాపం మితభాషి కాబోలు" అన్నాడు జాన్‌ను వెక్కిరిస్తూ.



ఈ సరసాలకు జాన్‌కి నవ్వు రాలేదు. "ఏదో ఒకటి మాట్లాడు ప్లీజ్" అన్నాడు కోతిని వేడుకుంటూ. ఏమిటో ఈ గోల అన్నట్టు కోతి పెదాలు ముడుచుకుని వెక్కిరించింది. జరిగిన భాగోతం చాల్లే అన్నట్టు బ్లయర్ కంప్యూటరు కట్టేశాడు. పరీక్షలో జాన్ ఘోరంగా ఫెయిలయిపోయాడు కాబట్టి, 'ఈయన్ని రూముకి తీసుకెళ్లిపో" అని అసిస్టెంటుకు ఆర్డరేశాడు.

కోతికి ఏం పోయేకాలం వచ్చిందో అనుకుంటూ జాన్ లేచాడు. అతను గది తలుపు వద్దకు వెళ్లాక కోతి అంది - "అడియోస్" అని!

అడియోస్ అంటే స్పానిష్ భాషలో గుడ్‌బై అని అర్థం. అది స్పానిష్ కోతి. పాపం ఇంగ్లీషు రాదు. జాన్ ఇంగ్లీషులో ఏదో మాట్లాడుతూంటే అర్థం కాక మిన్నకుంది. వెళ్లిపోతున్నప్పుడు తన భాషలో వీడ్కోలు చెప్పింది. ఆ విషయం జాన్‌కు తెలిసిరాగానే "నువ్వు స్పానిష్ భాష మాట్లాడుతున్నావా!?" అని ఇంగ్లీషులో ఒక్క అరుపు అరిచాడు.

"స్పానిష్" అన్నమాట కోతికి అర్థమయింది. తన స్పానిష్ భాషలో ఏదేదో మాట్లాడసాగింది. జాన్‌కి ఉత్సాహం పెల్లుబికింది. అతనికి స్పానిష్ భాష వచ్చు. సరదాగా కరస్పాండెన్స్ కోర్సులో నేర్చుకున్నాడు. "బ్లయర్, నువ్వా మిషన్ ఆన్ చెయ్యి. దున్నేస్తాను." అని ఇంగ్లీషులో ఆర్డరేసి కోతితో స్పానిష్‌భాషలో గడగడా మాట్లాడడం మొదలుపెట్టాడు.



కానీ జాన్‌మీద ఏమాత్రం జాలిలేని బ్లయర్ అప్పటికే తీర్పు ఇచ్చేశాడు. - ఇది పిచ్చి కేసు అని. "వెళ్లవయ్యా బాబూ, స్పానిష్ కోతీ, జపాను కొండముచ్చూ అంటూ. జంతువుల్లో కూడా భాషాభేదాలు పెట్టకు." అంటూ 'ఇంకా చూస్తావేం, ఆయన్ని తీసుకెళ్లక" అని అసిస్టెంటును గద్దించాడు. జాన్ ఎంత మొత్తుకుంటున్నా అతను రూంకి లాక్కుపోయేరు.

* * *

జాన్ భాగస్తుడు డాక్టరు మార్క్ అతన్ని చూడడానికి వచ్చాడు. కాస్సేపు ఆటలతో పొద్దుపుచ్చి "నేను నీ గురించి చాలా వర్రీ అవుతున్నాను, జాన్" అన్నాడు.

"ఏడిశావులే, నా గురించి కాదు, కాంట్రాక్టు గురించే నీ వర్రీ అంతా" అన్నాడు జాన్.

జాన్, మార్క్, జీన్ ముగ్గురూ కలిసి నడుపుతున్న హాస్పటల్‌ను ఇంకో పెద్ద సంస్థ టేకోవర్ చేసుకోవడానికి ముందుకొచ్చింది. దానివల్ల వీళ్లకి చాలా లాభం కలుగుతుంది. లాభాలు పెరుగుతాయి. కానీ జాన్‌కి పిచ్చెక్కిందన్న మాట బయటకు పొక్కితే అవతలివాళ్లు ముందుకు రారు. ఎందుకంటే అతనికి మంచి డాక్టరుగా పేరుంది. అతనిక వైద్యం చేయడంటే ఆ సంస్థకు వీళ్ల హాస్పటల్ మీద ఆసక్తి పోతుంది. ఆ ఒప్పందంపై సంతకాలు జరిగేటంత వరకైనా జాన్ సవ్యంగా ఉంటే చాలని మార్క్ ఏడుపు. ఎటొచ్చీ ఆ విషయం ఒప్పుకోవడానికి అతనికి బిడియం లేదు.

"కరక్టుగా చెప్పావు బ్రదర్. నాకు డబ్బు కావాలి. దానిలో సిగ్గుపడాల్సింది ఏమీ లేదు. లోకమే డబ్బుకు దాసోహమంటుంది, అఫ్టరాల్ నేనెంత? ఇన్నాళ్ల స్నేహం పురస్కరించుకుని నేను నిన్ను కోరేదొకటే - నువ్వు కుక్కలతోపాటు మొరగటం ఒక్కరోజు కట్టిపెట్టు చాలు. నీకు బాగయిపోయిందనుకుని వీళ్లు వదిలేస్తారు. వెంటనే క్లినిక్కొచ్చేయి. శుక్రవారం ఏర్పాటు చేసిన బ్రెయిన్ కాన్ఫరెన్స్‌కి హాజరవ్. ఎందుకంటే నువ్వు కనుక ఆ కాన్ఫరెన్సుకి రాకపోతే కాంట్రాక్టు కాన్సిల్ అని చెప్పారు వాళ్లు!"



తన భాగస్వామి, సాటిడాక్టరు ఇంత స్వార్థపరుడా అనుకుని నిట్టూర్చాడు జాన్. కానీ మార్క్ ఒకడుగు ముందు కెళ్లాడు. జాన్‌కు ఆశ పెట్టాడు - "చూడు జాన్, నా మాట విని నేను చెప్పినట్టు చేశావో, నీకో కోళ్ల ఫారం కొనిపెడతాను. కోళ్లను తరిమేసి ఎలుకలు నింపుకో. మూడువందల అరవై రోజులూ, ఇరవైనాలుగు గంటలూ వాటి పొట్టలు నొక్కి చూస్తూండు. పొట్ట ఉబ్బిన ఎలుక కనబడితే స్ట్రా పెట్టి పొట్టలో గ్యాస్ లాగేయ్. నాకేం అభ్యంతరం లేదు. కానీ నా మీద దయచూపించి, ఒక్కరోజు మాత్రం మామూలు మనుషుల్లా నటించు."

ఇలాటి మనిషికి ఏం నచ్చచెప్పాలో, ఎలా నచ్చచెప్పాలో జాన్‌కి తెలియలేదు. భుజాలు ఎగరేసి ఊరుకున్నాడు.

* * *

మెంటల్ హాస్పిటల్లో ఉండి ఉండి జాన్‌కి బోరు కొట్టింది. ఇంటికి ఫోన్ చేశాడు. ఇంట్లో ఎవరూ లేనట్టున్నారు. ఫోను మోగుతోంది కానీ ఎవరూ ఎత్తలేదు. కాస్సేపటికి "ప్రస్తుతం ఎవరూ లేరు. మీరు చెప్పదలచుకున్నది చెప్పండి. మెసేజ్ రికార్డు అవుతుంది. తిరిగివచ్చాక మీ మెసేజ్ చూసుకుని మీకు తిరిగి ఫోన్ చేస్తారు." అని ఫోన్‌కు అమర్చిన ఆన్సరింగ్ మెషిన్‌లో వినబడింది.

గొంతు సవరించుకున్నాడు జాన్ - "నేను జాన్‌నరా! మీరంతా ఎలా ఉన్నారు? నాకు మాత్రం ఇక్కడేమీ బాగాలేదు. మిమ్మల్నందర్నీ విడిచి ఉండడం నాకు కష్టంగా ఉంది. అసలు ఇదంతా ఒక పీడకలేమో అనిపిస్తోంది. మీరు..." ఇంకా జాన్ మాట్లాడబోతూండగానే ఎవరో అటువైపు ఫోన్ మీట ఒత్తారు. జాన్ గొంతు వినగానే "హాయ్, ఎలా వున్నావ్?" అన్నారు.

ఆ గొంతెవరిదో జాన్ గుర్తు పట్టలేకపోయాడు. "ఎవరది?" అన్నాడు.

"చెప్పుకోలేకపోయావా? సరే హింట్ ఇస్తాను, చెప్పుకో చూద్దాం. నేను చాలా అందంగా ఉంటాను. బోల్డంత బొచ్చు ఉంటుంది. ఏడాదికి 500మంది పిల్లల్ని పెడతాను..."

జాన్‌కి అర్థమయిపోయింది, ఫోన్ ఎత్తినది తన ఇంట్లో ఉన్న గినీ



పిగ్ రోనీ అని. ఈ వాగుడు దాని స్టయిలే!

"హేయ్ రోనీ, నువ్వెందుకు బయటకు వచ్చావ్? వెంటనే నీ బోనులోకి వెళ్ళి కూచో, ఇల్లంతా తిరగక!" అని తిట్లు లంకించుకున్నాడు.

"చాల్లేవయ్యా, పోనీ కదాని పలకరిస్తే ఇలా కసురుతున్నావ్! సరేగానీ, ఆ ఫ్రిజ్ వెనక్కాల ఆ పెద్ద వైరు బోను పెట్టారేమిటి? నన్ను లేపేద్దామని కుట్రా?"

"ఫ్రిజ్ వెనక్కాల ఏముందో నిన్నెవడు వెళ్ళి చూడమన్నాడు? ఇల్లంతా ఛండాలం చెయ్యడానికా? చంపేస్తాను జాగ్రత్త! బొచ్చుపీనుగా, వెళ్ళి నీ బోనులో తగలడు.." అంటూనే తిరిగి చూశాడు జాన్ - పక్కనున్న డాక్టరు నోరు వెళ్ళబెట్టి చూస్తున్నాడు. "మనుష్యులతో ఇలా ఎవరూ మాట్లాడరు. కచ్చితంగా జంతువులతో ముచ్చట్లే ఇవి" అన్న ఫీలింగు అతని మొహం మీద స్పష్టంగా ఎఱ్ఱసిరాతో అండర్‌లైన్ చేసినట్టు కనబడింది జాన్‌కి. తన కర్మం కాకపోతే తను ఫోన్ చేస్తే ఈ రోనీయే రావాలా? అనుకుంటూ "ఉంటా, గుడ్ బై" అని ఫోన్ పెట్టేశాడు.

పెట్టేశాడు కానీ రోనీ అనేది జంతువు కాదని డాక్టరుకు నచ్చచెప్పాలని ప్రయత్నించాడు. "రోనీ అని.. ఆ కుర్రాడికి ఒళ్ళంతా బొచ్చే, వాళ్ళ తాతగారి పోలిక కాబోలు. వాడికి కాస్త మెంటల్ ప్రాబ్లెమ్, ఎప్పుడు ఎవరిమీద పడతాడో తెలియదు, అందువల్ల ప్రత్యేకంగా ఓ బోను చేయించి వాణ్ని అందులో పెట్టి తాళం వేస్తానన్నమాట. వాడే ఫోన్లో మాట్లాడుతున్నాడు." అన్నాడు. డాక్టరు ఏమీ మాట్లాడలేదు. 'పిచ్చివాలోకం' అన్నట్టు భుజాలు ఎగరేశాడు.



ఈ లోగా జాన్ పెంపుడు కుక్క లక్కీ సర్కస్‌లో ఉన్న పులిని పరామర్శించడానికి వెళ్ళింది. తన కంటిచూపును సరిచేస్తానంటూ వెళ్ళిన డాక్టరు కలికంలోకి లేకుండా పోయేడేమిట్రాన్న ఆశ్చర్యంలో ఉంది పులి. అతని సంగతి చెప్దామని వెళ్ళిన లక్కీ "హలో కులాసానా?" అని పలకరించగానే పులి చికాకు పడింది. "ఆ మాట అడగడానికి ముగ్గురు రావాలా?" అని. అంటే పులి చూపు అంత అధ్వాన్నంగా ఉందని వెంటనే అర్థమయింది లక్కీకి. తక్షణం జాన్‌కి చెప్పాలని అతనున్న హాస్పటల్‌కి బయలుదేరింది.

జాన్ ఇంకో ఇద్దరు పేషెంట్స్‌తో కలిసి సినిమా చూస్తున్నాడు. సినిమాలో ఓ గుఱ్ఱం మనిషితో మాట్లాడుతున్నట్టు చూపించాడు.

"గుఱ్ఱం మాట్లాడుతున్నట్టు ఎలా తీశారంటారు?" అన్నాడొకతను.

"దాని పెదాలకు దారం కట్టి కిందకీ పైకీ కదుపుతారు..." అంటూ చెప్పబోయాడు అవతలతను.

"తమరి మొహం, ఆ దవడలు చూడండి. ఎలా ఆడిస్తోందో..."

"గుఱ్ఱానికి ఫీలింగ్సు ఏముంటాయి, అదేం మాట్లాడుతుంది? ఏదో గడ్డి నములుతూంటుంది."

పక్కన కూచున్న జాన్‌కి సినిమాలో గుఱ్ఱం చేసే శబ్దాల ద్వారా అదేమంటోందో తెలిసిపోతోంది. వెనక్కాల చెప్పే డైలాగులు వేరు. అది ఫొటోగ్రాఫర్‌ను తిడుతున్న బండబూతులు వేరు. ఆ విషయమే చెప్పబోయి, "మీరు ఇద్దరూ తప్పే. ఆ గుఱ్ఱం ఏమంటోందంటే.."

ఇద్దరూ ఆగిపోయారు. "ఏమంటోంది?" అని అడిగారు.

హఠాత్తుగా జాన్‌కు గుర్తువచ్చింది. చెప్తే ఇరుక్కుపోతామని. ఏ డాక్టరో నక్కి కూచుని తన మాటలు విని తనకు పిచ్చి తగ్గలేదని అనవచ్చు.



"అబ్బే, నాకేం తెలుస్తుంది!" అన్నాడు నవ్వేస్తూ.

వాళ్ళు మళ్ళీ వాదించుకోవడం మొదలుపెట్టారు. ఇంతలో జాన్‌కి లక్కీ గొంతు వినబడింది. "డాక్టరు గారూ, ఇక్కడ మహాప్రభూ, ఇటు.." అని కేకలు వినబడ్డాయి.

జాన్ లేచి వరండాలోకి వచ్చాడు. తోకాడిస్తూ లక్కీ కనబడగానే కోపం ముంచుకు వచ్చింది. దీనివల్లే ఈ కష్టాలన్నీ అనుకుంటూ "నీకిక్కడేం పని?" అన్నాడు ఉరిమి చూస్తూ.

లక్కీకి రోషం వచ్చింది. "బాగుందయ్యా పెద్దమనిషీ, నిన్ను చూద్దామని మూడు ఫ్లైఓవర్లు దాటి ట్రాఫిక్‌లేని టైములో రాత్రిపూట ప్రయాణం చేసి వస్తే..ఇదా పలకరింపు? మంచీ మర్యాదా లేదూ" అని దులిపేసింది.

"నేనేదో జైల్లో ఉంటే పరామర్శించడానికి వచ్చినంత బిల్డప్ ఇస్తున్నావ్! ఇది జైలు కాదు, జస్ట్ క్లినిక్! విశ్రాంతి కోసం నన్నిక్కడ చేర్చారు."

"నీ దబాయింపు చాల్లే! పాపం పులి పరిస్థితి బాగాలేదు. అస్సలు చూపు ఆనటం లేదు."

"పులీ లేదు, చలీ లేదు. ఈ పులులూ, కోతులూ వచ్చి నా జీవితం దుర్భరం చేసేశాయి. అసలు ఇదంతా మొదలుపెట్టింది నువ్వే! నువ్వారోజు నన్ను 'శుంఠా' అని తిట్టకుండా నోరుమూసుకుని పోయివుంటే నా జీవితం హాయిగా వెళ్ళమారిపోయుండేది. నువ్వు నన్ను తిట్టడం, జంతువుల భాష అర్థమవుతోందని నాకు తెలియడం, ఇక అక్కణ్నుంచి నానా కష్టాలూ ప్రారంభం.

"డాక్టరుగా హాయిగా ప్రాక్టీసు చేసుకునేవాణ్ని. ఇప్పుడు చూడు ఓ ఇద్దరు పిచ్చాళ్ళతో కలిసి సినిమాలో గుఱ్ఱం ఏమందో, దాని దవడలు కదిలాయో లేదో అన్న విషయం మీద చర్చిస్తూ కూచున్నాను. ఎలా దిగజారిపోయానో చూడు. ఇకనైనా నా మానాన నన్ను వదిలిపెట్టి వెళ్ళు. కనబడకుండా మాయమయిపో! ఉన్నపళాన అంతర్థానమయిపో!"

"మరి అలాటివాడివి సుబ్బరంగా ఆత్మహత్య చేసుకోబోయిన పులిని తగుదునమ్మా అని కాపాడడమెందుకో?"

"బుద్ధిలేక! రోజుకి అరడజను పులులు ఛస్తూ ఉంటాయి. అది ప్రకృతి సహజం. ఏదో గొప్పకి పోయి ఉద్ధరించబోవడం తప్పూ, తప్పున్నరా..తప్పుముప్పా.."

'చాల్లేవయ్యా, నీ లెక్కలూ నీవూనూ. ఇంత ఆత్మనింద పనికి రాదు. చూడు ఓ ధర్మసూక్ష్మం చెబుతాను. నేను కుక్కను. కుక్కలాగే బతుకుతాను. 'కుక్కను కాను, కూష్మాండాన్ని' అని అనను, అనుకోను. మనం ఒక్కోళ్ళు ఒక్కోలా ఉంటాం. దాన్నే స్వధర్మం అను, మరోటను. నువ్వు జంతువుల భాష తెలిసిన డాక్టరువి. అలాగే ఉండు. జంతువుల భాష తెలిసిన డాక్టరు ఏం చేయాలో అది చేయి. నీ ధర్మాన్ని నిర్వర్తించు. నేను డాక్టరును కాను, యాక్టరును అని వేషాలేయకు" అని భైరవగీత వినిపించింది.



''ఏడిశావులే, నాకే జంతువుల భాషా తెలియదు. అలా అని ఇక్కడి డాక్టరు సర్టిఫికెట్టు ఇచ్చాడు కూడా."

''ఇంకోళ్ళకు అబద్ధం చెప్పడం తప్పు. తనకు తనే అబద్ధం చెప్పుకోవడం మహాతప్పు... అట్టే మాటాడితే తప్పాతి తప్పు.."

"నిన్ను ఇక్కణ్నుంచి వెళ్ళమన్నానా.. ఇంకా ఇక్కడే తోకాడించుకుంటూ నిలబడతావేం సిగ్గులేకుండా?"

"వెళ్తానులేవయ్యా, తోకపట్టుకు బతిమాలినా వెనక్కి రాను." అని

డిక్లేర్ చేసన్తానే జాన్‌తో మొదటిసారి పరిచయమయినప్పుడు ఉపయోగించిన తిట్టు మళ్ళీ ఉపయోగించింది - "వెళ్తానురా, శుంఠా" అని, పాఠాలు అర్థంకాని పిల్లాడిని చూసిన మాస్టారిలా.

జాన్‌కి కోపం ముంచుకు వచ్చేసింది. "వెళ్లు, వెళ్లూ..." అని అరిచాడు. కుక్క వెనక్కి మరలింది. "ఇక నాతో ఎప్పుడూ మాట్లాడకు. రాకు, నన్ను చంపుకు తినకు. వెళ్లు, వెళ్లూ..." అని అరుస్తూనే వున్నాడు.



అరుస్తూనే ఇటు తిరిగిన జాన్ సాటి పేషంట్లు ఇద్దరూ తనకేసే చూస్తూ ఉండటం చూసి కొయ్యబారిపోయాడు. హీరోయిన్ స్టయిల్లో అరిచానని జాన్ అనుకున్నా అతను అరిచింది వాళ్లిద్దరికీ కుక్క కుయ్యోమని మొరిగినట్టే అనిపించింది. ఆ విషయం జాన్‌కు అర్థమయ్యేసరికి తన మీద తనకి ఇంకా కోపం వచ్చేసింది. వాళ్ల దగ్గరికి వెళ్లి అలాటి మొరుగుడు ఇంకా కాస్త మొరిగి వాళ్లను హడలగొట్టి తన రూమువైపు వెళ్లిపోయాడు.

కాస్త తీరుబడిగా ఆలోచిస్తే జాన్‌కే తట్టింది - ఈ జంతువుల భాష అర్థంకాదని నటిస్తే తప్ప తనకు భవిష్యత్తు లేదని. ఇక ఆ దిశగానే సాగదలచుకున్నాడు. మర్నాడు లేవగానే హాస్పటల్ యూనిఫాం విప్పేసి కోటూ, సూటూ తొడిగి బ్లయర్ దగ్గరి కెళ్లి "బాస్, నేను ఇంటి కెళదామనుకుంటున్నాను." అని ప్రకటించేడు.

జాన్‌మీద ఏమాత్రం జాలీ, కరుణా లేని బ్లయర్ వెటకారంగా నవ్వాడు. "మైడియర్ జంతుభాషాప్రవీణా, నిన్ను జూకి తీసుకెళ్లి జంతువులకు లెక్చరి ప్పిద్దామనుకుంటున్నామే! మరి నువ్వు ఇంత త్వరగా ఇంటికి ప్రయాణం కడితే ఆ ట్రిప్ మిస్సయిపోవూ?"

అతని చేయి పైనా, తన చేయి కిందా ఉందని జాన్‌కు తెలుసు. అతను సర్టిఫై చేస్తే తప్ప తనిక్కడనుండి బయటపడలేడు. అందుకని భేషజానికి పోకుండా ఉన్నదున్నట్టుగా మాట్లాడుదామనుకున్నాడు - "చూడు బ్లయర్, మనిద్దరం మెడికల్‌కాలేజీలో కలిసి చదువుకున్నప్పటి నుండీ నా మీద నీకు కోపం. అప్పుడేదో చిన్నతనం! వదిలేయ్. ఇప్పుడు మనిద్దరం పెద్దవాళ్లమయ్యాము. గతం మర్చిపో. ప్రస్తుతం నేను సంఘంలో పేరున్న డాక్టరును. నాకో భార్యా, ఇద్దరు పిల్లలూ ఉన్నారు. నన్ను ఇంటికి వెళ్లనీ. పాతవిషయాలు తవ్వి నా దారిలో గోతులు తీయకు."

"దానికేముంది, నువ్వు జంతువులతో కబుర్లూ, కాకరకాయలూ పెట్టుకోకుండా ఉంటే సరి." అంటూ కన్నుగీటాడు బ్లయర్.

"సరే, నువ్వు చెప్పింది రైటే. నాదే పొరబాటు. విపరీతమైన పని వొత్తిడి వల్ల నాకు తాత్కాలికంగా మతిభ్రమించింది. జంతువులతో మాట్లాడుతున్నానన్న భ్రమకు లోనయ్యాను. ఇప్పుడు ఇక అవన్నీ లేవు. వదిలిపెట్టేయ్. ఇకపైన జంతువులతో మాట్లాడే ప్రశ్నే లేదు." అన్నాడు జాన్ దీనంగా.

"నేన్నమ్మను. ఓ నెల్లాళ్లు ఆగి చూద్దాం. భ్రమించిన మతి తిరిగి గూటికి చేరిందో లేదో అప్పుడే చూద్దాం." ఇక నువ్వు వెళ్లవచ్చు అన్నట్టు కోటు తొడుక్కోసాగాడు బ్లయర్.



జాన్‌కి ఒళ్లుమండింది. బ్రహ్మాస్త్రం పైకి తీశాడు - "చూడు బ్లయర్, నువ్వు నా రిలీజ్ ఆర్డర్‌మీద వెంటనే సంతకం పెట్టలేదనుకో, ఈ హాస్పటల్లో నువ్వు చేసే రాసలీలలు కొన్ని నేను బయటపెట్టవలసి వస్తుంది. ఆ తర్వాత నన్నని ఏమీ ప్రయోజనం లేదు."

బ్లయర్‌కు నోటమాట రాలేదు. మరో మానవమాత్రుడెవరికీ తెలియని రహస్యం జాన్‌కి ఎలా తెలిసిందో అతనికి అర్థం కాలేదు. అతని కంగారు చూసి చిరునవ్వు నవ్వుకుంటూ జాన్ అతని పెంపుడు పిల్లికేసి కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు. అతనికి బ్లయర్ రహస్యాలు చెప్పినది ఆ పిల్లే!

* * *

ఇంట్లోకి అడుగుపెడుతూనే జాన్ "డాడీ ఈజ్ హోమ్" అని గట్టిగా ఒక్క అరుపు అరిచాడు. పెద్దకూతురు తలెత్తి చూసి చప్పున పరిగెట్టుకు వచ్చి "డేడీ, హేయ్ డేడీ" అంటూ వచ్చి కౌగలించుకుంది. అతని భార్య నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చి దగ్గరకి వచ్చింది - "ఫోన్ చేయలేదేం?" అంది.



"సర్‌ప్రైజ్ చేద్దామని.." అంటూండగానే అతని చూపు చిన్నకూతురు మాయాపై పడింది. "ఏం పిల్లా, క్యాంప్‌లో ఉండవలసినదానివి ఇక్కడున్నావేం?" అని పలకరించాడు.

సమాధానం పెద్దకూతురు నుండి వచ్చింది - "అమ్మ తీసుకు వచ్చేసింది."

మాయా పరిగెట్టుకుంటూ వచ్చి తండ్రి చెయ్యి పట్టుకుంది. "క్యాంప్ నా వంటికి పడలేదు." అంది.

"వచ్చే ఏడాది ముందునుండీ ప్రాక్టీసు చేస్తే సరి." అంటూ మాయాను అక్కున చేర్చుకున్నాడు జాన్.

భార్యా సహజమైన సందేహాలు లీజాను వదలలేదు - "మీరిలా వచ్చేసినట్టు వాళ్లకు తెలుసా?"

జాన్ వెక్కిరించాడు - "అబ్బే, ఎలా తెలుస్తుంది? నేను పారిపోయి వచ్చానుగా!" అని. భార్య నోరు తెరిచేలోపున చెప్పేశాడు - "వాళ్లే ఇంటికి వెళ్లమన్నారు. పని ఒత్తిడి తగ్గించుకుని ఫ్యామిలీతో కొన్ని రోజులు గడిపితే సర్దుకుంటుందన్నారు."

అక్కడే ఉండి ఇదంతా గమనిస్తున్న లక్కీకి జాన్ తనని పలకరించలేదని గుర్రుగా ఉంది. గొంతు సవరించుకుని, "అయితే నాతో మాట్లాడవా?" అంది. అది వినబడనట్టు నటించాడు జాన్. భార్య "మీకిప్పుడు బాగానే ఉంది కదా, అసలు ఇంటికెప్పుడు వస్తారో అని భయపడ్డాను తెలుసా" అంటూంటే "నువ్వేం ఇదవకు. నేను వచ్చేశాను కదా, ఇదివరకు ఎలా ఉండేవాళ్లమో అలాగే ఉంటాం." అంటున్నాడు.

లక్కీకి అర్థమయిపోయింది. "నీ వేషాలు నాకూ తెలుసు. నేనేమీ నీకు తీసిపోను. నా మాటలు నీకు వినబడకపోతే నీ మాటలూ నాకు వినబడవు. తెలుసుకో" అంది ఆగ్రహంగా. దానికి జవాబుగా అన్నట్టుజాన్ భార్యకేసి చూస్తూ, "అవునూ, ఈ కుక్కను తన్ని తగిలేస్తే పోలే" అన్నాడు.



ఈ లోపుగా బోనులోంచి తప్పించుకుని (అదసలు బోనులో ఎప్పుడుంటుందో దేవుడి కెరుక) షికార్లకు బయటకు వచ్చిన గినీ పిగ్ రోనీ ఆ గదిలోకి వచ్చింది. " లక్కీకే కాదు, ఈ పెద్దమనిషి మాటలేవీ ఇవాళ నుండి నా చెవినా పడవ్. ఇన్నాళ్లకు ఇంటికొస్తూ ఖాళీచేతులు ఊపుకుంటూ వచ్చాడు, పెద్ద సోగ్గాడు. ఆ పిచ్చాసుపత్రిలో ఒక్క గిఫ్ట్‌షాప్ కూడా లేదంటే నమ్మేవాడెవడూ లేడిక్కడ!" అంటూ చికాకు పడింది.

మర్నాటినుండీ క్లినిక్‌కూడా వెళదామని నిశ్చయించుకున్నాడు జాన్.

**(సశేషం)**

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

| | |
|---|---|
| రచన | : కీ॥శే॥పుట్టపర్తి నారాయణాచార్యులు |
| సంగీతం | : చిత్తరంజన్ -బృందగానం. |
| రాగం | : నాటకప్రియ |
| తాళం | : ఆది (కర్ణాటక సం॥) కహరువా(హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

- షడ్జము, శుద్ధరిషభం,సాధారణ గాంధారం,శుద్ధ మధ్యమం,పంచమం,చతుశ్శృతిదైవతం, కైశికినిషాదం యీ రాగంలోని స్వరాలు.

కర్ణాటక సంగీతంలోని 10వ మేళ కర్తయగు నాటకప్రియ వాడుకలో లేని రాగమే. లలిత సంగీతంలో యీ రాగం వాడుక చాలా అరుదనే చెప్పాలి. స్వరకర్తలు సాధారణంగా యీ రాగాన్ని ఉపయోగించరు. అయితే యీ రాగాన్ని బాలాంత్రపు రజనీకాంతరావుగారు,పాలగుమ్మి విశ్వనాథంగారు,నేను వినియోగించి బాణీలు కూర్చగా ఆకాశవాణిలో ఆ గేయాలు ప్రాచుర్యాన్ని పొందాయి. ఈ రాగం,భక్తి,విరహ,విషాదాలకు అనువుగా వుంటుంది.

భక్తిగీతాలు రెండు రకాలు. రాముడు, కృష్ణుడు,శివుడు,పార్వతి,సరస్వతి మొదలగు సాకార పరబ్రహ్మము అనగా నామరూపాలు కలిగిన దేవతలను స్తుతించే గీతాలు ఒక రకము; నిర్గుణుడు,నిరాకారుడు అయిన భగవంతుని కీర్తించే గీతాలు మరోరకము. రూపరహితుడైన భగవంతుని పై ఎన్నో రచనలు వున్నాయి. బ్రహ్మసమాజ ప్రార్థనాగీతాలు ఏకేశ్వరోపాసనకు సంబంధించినవి. దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు అటు వంటి గేయాలు ఎన్నో వ్రాయగా అవి బహుళ జనాదరణ పొందినవి. "మహతి" అనే పేరుతో ఆయన ఆ పాటలతో పుస్తకంగా ప్రచురించారు కూడా. ఆకాశవాణి భక్తిరంజని కార్యక్రమాలలో ఆ గేయాలు తరుచుగా ప్రసారమవుతున్నవే. ఆర్యసమాజం వారి గేయాలలో కూడా నిర్గుణపరబ్రహ్మాన్ని కీర్తించేవి ఎన్నో వున్నాయి. ఆదిపూడి సోమనాథరావు,మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు మొదలగు వారు ఆ గీతాలు వ్రాయగా వాటిలో కొన్ని ఆకాశవాణిలో ప్రసారమైనాయి. ఏ దేవుని పేరు లేకుండా కేవలం భగవతత్త్వాన్ని తెలిపే తత్త్వాలు కూడా యీ కోవకు చెందేవిగానే చెప్పవచ్చును.

### నామ రూప రహితుండ వైన

ప॥ నామరూపరహింతుండవైన -ని
న్నేమనిపాడుదురాప్రభూ ॥నామరూప॥
చ॥ సుతిమెత్తని నీ కమ్మని గాథలు
స్మృతికుహరమ్మున సోకినంతనే
అతిలోకరుచి ప్రేమాతిశయ
ప్రథితరూప నే పులకరింతురా ॥నామరూప॥
చ॥ కమనీయము నీరూపుతలచి -నా
కన్నులునిను సుంతయు కానవురా
భావావేశము పొంగిపొరలి -నే
నావల నీలో లీనమౌదురా ॥నామరూప॥
చ॥ రూపరహిత నిర్గుణదయామయా
కాపురుషదూర కమనీయా
కష్టసాగరము దాటగోరి-నే
అష్టాక్షరి నౌకాశ్రితుడయ్యెద ॥నామరూప॥



మిగిలిన చరణాలు కూడా మొదటి చరణంవలె పాడాలి.



సర్వాంతర్యామియైన నామరూపాలులేని భగవంతుడు గుణరహితుడు. అటువంటి పరమాత్మ అవతారాలెత్తినప్పుడు సద్గుణముల నాశ్రయించి రూపధారి అవుతాడు. రాముడు, కృష్ణుడు మున్నగు రూపాలతో ఆవిర్భవించి సకల జీవులను సన్మార్గాన నడిపిస్తాడు.

నారాయణాచార్యుల వారు "నామరూపరహితుండవైన"అనే యీ గీతంలో శుద్ధ పరబ్రహ్మ తత్త్వాన్ని వర్ణించినా'కమ్మని గాథలు','నీరూపు తలచి'అనే పదాలలో భగవంతుని అవతారాలను స్పృశించారు. చివరి చరణంలో 'కృష్ణసాగరము దాటగోరి నే అష్టాక్షరి నౌకాశ్రితుడయ్యెద' అంటూ భగవన్నామమే తనకు ఆశ్రయమని తన నిశ్చయాభిప్రాయాన్ని వెలిబుచ్చారు. 1981లోఆకాశవాణి విశాఖపట్టణం కేంద్రంలో 'భక్తిరంజని' కార్యక్రమానికై నేను యీ గేయానికి నాటకప్రియరాగంలో సంగీతం కూర్చి బృంద గానంగా వలువురు గాయనీ గాయకులచే పాడించాను.

## కీ॥శే॥పుట్టపర్తి నారాయణాచార్యులు

'సరస్వతీపుత్ర' బిరుదాంకితులైన సుప్రసిద్ధ కవి పుట్టపర్తి నారాయణాచార్యులు గారు తెలుగు వాఙ్మయాన్ని సుసంపన్నం గావించిన కవివరేణ్యులలో ముఖ్యులు. చిన్ననాటనే 'అగ్నివీణ' అనే గేయకావ్యాన్ని రచించారు. "సవరింతునా అగ్నివీణ! సవరింతునా దిశాంచలము రింగులు వార', ఆకాశమంతాను నేనైతే-అంతటా చుక్కలే చెక్కుతానేమో','కొండలో కోనలో క్రొందలిరుటాకులలో నీ నటనలే తోచు నీ మాయలే పూచు','తొలిసంజ రాగాలు మలిసంజ రంగులు పలుకు తీవెలబూచు వెల దిన్నెలచాలు పాడునే నీ ప్రేమప్రౌఢప్రబంధమ్ము' మొదలగు సుమధుర గేయాలు 'అగ్నివీణ' కావ్యంలోనివి. ఆయన రచించిన 'శివతాండవం' అనే గేయ కావ్యం ఎంతో ప్రాచుర్యాన్ని పొందినది. 'ఏమానందము ఏమానందము భూమి తలమున' అంటూ



ఎలుగెత్తి ఆచార్యులవారు పాడినప్పుడు శ్రోతలు పరవశించి పోయేవారని చెబుతారు. వారు రచించిన 'జనప్రియ రామాయణం' కూడా బహుళ జనాదరణ, పండితుల మన్నన విశేషంగా పొందిన కావ్యం. సంస్కృతాంధ్ర భాషలలోనే కాక, వారు పలు భారతీయ, విదేశీ భాషలలో కూడా పాండిత్యాన్ని గడించుకొని,ఎన్నో విశిష్ట కవితలల్లిన మహనీయులు. శ్రీత్యాగరాజస్వామిని స్తుతిస్తూ 'శ్రీత్యాగరాజ సుప్రభాతం' ను రచించగా డా॥మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు గానం చేశారు.

ఆచార్యులవారు మహాత్మాగాంధీజీపై సంస్కృతంలో కొన్ని శ్లోకాలు రచించగా వాటిని ఆకాశవాణిలో నేను 1955లో పాడాను. వారు ఆకాశవాణికై ఎన్నో గేయాలు రచించారు. శ్రీపాలగుమ్మి విశ్వనాథంగారి స్వరరచనతో 'తడవాయెరా నన్ను బ్రోచుటకు కడువేదన గాసి చెందితిని', 'చిక్కితివిలేరా నా చేత గోపాల' మొదలగునవి, నా సంగీతంలో 'ఎంతని కీర్తింతునురా ఏమో నీ కరుణ కలుగ,' 'మనసు విషయ కామాదుల కొసగితె మాధవుసేవౌనా', 'మతమంటె మరి ఏమిటన్నా-మన పురాణాలలో చూచి చెప్పన్నా' మొదలైనవి ఆకాశవాణిలో ప్రసారమై చాలా ప్రసిద్ధి చెందాయి. 'ఓం నమోనారాయణాయ' అన్నది శ్రీవైష్ణవులకు అతి ముఖ్యమైన మంత్రము. దానినే 'అష్టాక్షరి' అంటారు. ఆచార్యులవారు తమ గేయాలకు 'అష్టాక్షరి'ని తమ నామముద్రగా చేసుకుని కమనీయమైన కవితలను వెలయించారు. శాస్త్రీయ సంగీతాన్ని కూడా అధ్యయనం చేసి పాండిత్యాన్ని సంపాదించుకున్న సవ్యసాచి ఆచార్యులవారు. ఎంతో మంది వారి సాహిత్యంపై పరిశోధనలు చేసి కృతకృత్యులైనారు. విశ్వసాహితీ విజ్ఞాన పీఠాన్ని అధివసించిన సరస్వతీపుత్రులు శ్రీపుట్టపర్తి నారాయణాచార్యుల వారు. వారి అర్ధాంగి కనకమ్మగారు కూడా గొప్ప కవయిత్రి. వీరి తనయ శ్రీమతి నాగపద్మిని హిందీలో డాక్టరేట్ పొందిన కవయిత్రి, మధురగాయని కూడా. నా సంగీత సారథ్యంలో ఎన్నో పాటలు ఆకాశవాణిలో ఆమె పాడింది. ఆశాశవాణిలో ఆమె ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ గా పనిచేస్తున్నది.

వివిధ భాషలలోను,వివిధ ప్రక్రియలలోను రచనలు గావించిన పుట్టపర్తి నారాయణాచార్యుల వారి కీర్తి అజరామరమైనది.

**నాటక ప్రియ వాడుకలోలేని రాగం కనుక ఆ రాగంలో చిత్రగీతాలుండవు.**

# తాతా థిత్తై తధిగిణతోం

సీరియల్ 16

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని. తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. తండ్రంటే భయపడే అతనికి ధైర్యం నూరిపోసింది. విష్ణుమూర్తి స్వయానా వెళ్లి అడిగినా అవమానించి పంపిన తండ్రితో పోట్లాడి శ్రీరామ్ తన పంతం సాధించుకుంటాడు. ఈ లోగా విష్ణుమూర్తి ఇంటికి బావమరిది హనుమంతు కొడుకు గోపాలంతో సహావచ్చి అమెరికానుండి వచ్చామని కోతలు కోస్తాడు. అశ్వినిని గోపాలానికి ఇవ్వడానికి విష్ణుమూర్తి నిశ్చయిస్తాడు.

- ఇక చదవండి

"పెళ్లి గురించే! తను ఎవర్నో ప్రేమించి నట్టుంది...వాణ్ణే చేసుకుంటాననంటూ మొండిగా మాట్లాడుతూంటే - మావయ్య మండిపడ్డాడు...'ఏమైనాసరే నీ పెళ్లి గోపాలంతోనే జరిపిస్తాను'అంటూ మావయ్య తెగేసి చెప్పటం కూడా విన్నాను!" -గోపాలం చెప్పేడు.

"అయితే మన పని సులువైపోయినట్టే.. మొత్తానికి మనం అనుకున్నది అను కున్నట్టుగా జరుగుతోంది..'బిజినెస్' లో మీ మావయ్య బాగా సంపాదించాడు కనక నీకేదో దారి చూపించక పోతాడా' అని వచ్చినందుకు ఫలితం దక్కింది... ఏకంగా నిన్ను తన 'ఇంటల్లుడు'గా చేసు కుంటున్నాడు.. ఇక మనం వేషాలు, మోసాలు మానేసి దర్జాగా బతికేయచ్చు!" తృప్తిగా నిట్టూర్చేడు హనుమంతు.

"మనం అమెరికానించి కాకుండా- హైదరాబాదు జైలునుంచి బయటపడి, ఇలా వచ్చినట్టు-రేపెప్పుడైనా మావయ్యకి తెలిస్తే?"

"తెలియకుండా జాగ్రత్త పడాలి!...ఎలాగో అలా అశ్వినితో నీ పెళ్లి త్వరగా జరిగిపోతే-ఆ తర్వాత మన గురించి ఏం తెలిసినా ప్రమాదం వుండదు" అప్పటికి అల్లుడివైపోతావ్ కనక- నిన్ను తనే కంటికి రెప్పలా కాపాడుకుంటాడు"- కొడుకు భుజం తట్టి మరీ చెప్పాడు హనుమంతు....

ఆ మాటలు విన్న గోపాలానికి గొప్ప ధైర్యం వచ్చింది.... తను కూడా గ్లాసులో మరో పెగ్గు మందు పోసుకున్నాడు...!

సరిగ్గా అదే సమయంలో -

అశ్విని, తన తండ్రి గదిలో వున్న 'షెల్ఫ్' లోంచి నిద్ర మాత్రలు సీసా తెచ్చుకుని అందులో వున్న మాత్రలన్నింటినీ చేతిలో పోసుకుంది...

* * *

ఉదయం ఎనిమిది గంటలవేళ....

హాల్లో వున్న సోఫాలో కూర్చుని కాఫీ తాగుతూ -'టీవీ' ఛానల్‌లో వస్తున్న వార్తలు చూస్తున్నాడు విష్ణుమూర్తి.

అంతలో కంపెనీ సెక్రెట్రీ కామేశం- ఆఫీసు ఫైల్స్ కొన్ని తీసుకొచ్చి సంతకాల కోసం - అక్కడున్న టీపాయ్ మీద పెట్టాడు...

'టీవీ' వాల్యూమ్ తగ్గించి, ఫైల్స్ చూస్తూ అడిగేడు విష్ణుమూర్తి.

"ఏమిటి ఆఫీసు విశేషాలు?"

"మన విశాఖపట్నం 'బ్రాంచ్'కి లెటర్ పెట్టాను సార్.... అలాగే బెంగుళూరు కాంట్రాక్ట్‌కి నిన్న టెండర్ వేశాను..." - చెప్పాడు కామేశం వినయంగా.

అయిదునిమిషాల్లో ఫైల్సన్నీ చూసి సంతకాలు చేశాడు విష్ణుమూర్తి .

వాటిని తీసుకుని, తిరిగి వెళ్లిపోతున్న కామేశాన్ని వెనక్కి పిలిచాడు.. కామేశం ఆగిపోయాడు.

"అమెరికానించి మా మేనల్లుడు గోపాలం వచ్చాడని చెప్పాను.. గుర్తుందా?" అడిగేడు విష్ణుమూర్తి.




గుర్తున్నట్లు తలూపేసాడతను.

"రేపట్నుంచీ అతను మన 'కంపెనీ ఆఫీసు'కి వస్తాడు. ఇక నుంచీ అక్కడి వ్యవహారాలన్నీ అతనే చూసుకోవాల్సి వస్తుంది...అయ్‌మీన్ ..మా బేబీని అతనికిచ్చి పెళ్లి చేస్తే- అమ్మాయి బాధ్యతతో పాటు, నా ఆస్తి పాస్తుల సంరక్షణ కూడా అతనే చూసుకోవాలి గదా!"

కామేశానికి విషయం బోధపడింది.

"వెరీగుడ్ సార్ ! అయితే అమ్మాయిగారి మేరేజ్ చేసేస్తున్నారన్న మాట!.... కంగ్రాచ్యులేషన్స్" -తన ఆనందాన్ని వ్యక్తం చేశాడు.

"మీకు తెలిసిన పంతులు ఎవరైనా వుంటే- అర్జంటుగా పిలిపించండి... ముహూర్తం పెట్టించాలి!" చెప్పాడు విష్ణుమూర్తి.

సరిగ్గా అదే క్షణంలో

మేడమీదనించి "బాబుగారూ !" అనే కేక వినిపించింది.

ఇద్దరూ ఉలికిపాటుతో పైకి చూశారు.

"అమ్మాయిగారు పిలిచినా పలకటం లేదు...! తొందరగా రండి బాబూ!..." గాభరాగా చూస్తూ, పైనించే చెప్పింది పనిమనిషి.

పరుగులాంటి నడకతో మెట్లెక్కి- అశ్విని గదిలోకి చేరుకున్నాడు విష్ణుమూర్తి.

చేతులు క్రిందకి వ్రేలాడుతుంటే- మంచం మీద అస్తవ్యస్తంగా, అచేతనంగా పడికుని వున్న అశ్విని వైపు దిగ్భ్రాంతిగా, భయంగా చూశాడు...

"బేబీ"! అంటూ ఆమె దగ్గరగా చేరి, భుజాల్ని కుదిపేడు... అయినా ఆమెలో ఎటువంటి చలనం లేకపోయింది...

విష్ణుమూర్తి మనసు కీడును శంకించింది.

"కామేశం !..త్వరగా వెళ్లి డాక్టర్ని తీసుకురా!"అరిచేడు..

అదే క్షణంలో -మంచం పక్కనే పడివున్న కాగితాన్ని చూసిన పనిమనిషి, దాన్ని తీసి -విష్ణుమూర్తికి అందిస్తూ చెప్పింది.

"ఈ కాగితం ఏమిటో చూడండయ్యా!.. అమ్మాయి గారు రాసినట్టే వుంది..!" ఆ కాగితంలోకి ఆత్రంగా చూశాడు విష్ణుమూర్తి.

అదిఅశ్విని రాసిన ఉత్తరమే !?. మనసులో గబగబా చదువుకున్నాడు...

"...డాడీ!

నువ్వు నన్నెంత గారాబంగా పెంచేవో నాకు తెలుసు!.. నేనంటే నీకు పంచప్రాణాలని కూడా తెలుసు ...ప్రతి క్షణం నా శ్రేయస్సునే కోరుకునే నువ్వు గోపాలన్ని పెళ్లి చేసుకోమంటున్నావంటే- అదీ నా సుఖం కోసమేనని అర్థం చేసుకోగలను.. కానీ, నేను మనసు మార్చుకోలేక పోతున్నాను డాడీ!.. ఎంత ప్రయత్నించినా 'శ్రీరామ్' నించి నా మనసును మరల్చుకోలేకపోతున్నాను. కళ్లుమూసినా, తెరిచినా అతని రూపమే నా ముందు నిలుస్తోంది.. అతన్ని కాకుండా, వేరెవర్ని



కట్టుకున్నా వాళ్ళని నేను సుఖపెట్టలేన నిపిస్తుంది.. అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాను...నువ్వు నిద్ర కోసం రోజుకోసారి వేసుకునే మాత్రల్ని- శాశ్వత నిద్రకోసం, అన్నింటినీ నేను ఒకేసారి వేసుకున్నాను. నీ మనసు కష్టపెట్టినందుకు నన్ను మన్నించు .. వచ్చే జన్మలో కూడా నీకే కూతురుగా పుట్టాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను..

...నీ బేబీ..."

పుత్తరం చదువుకున్న విష్ణుమూర్తి కళ్ళల్లోకి కన్నీరు చిమ్ముకొచ్చింది. అతని పరిస్థితిని గమనించిన పనిమనిషి గాభరాగా అడిగింది-

"ఏమైందిబాబూ? ఏమిటా కాగితం? ... అమ్మాయి గారు రాసిందేనా?"

ఆమెకు బదులు చెప్పలేక-వస్తున్న దుఖాన్ని ఆపుకోలేక, చేతుల్లో ముఖాన్ని కప్పుకొని విలపించాడు.

'కాలేజీనించి అరగంట ఆలస్యంగావస్తే నేను తట్టుకోలేను' అంటూ తన కూతురుకీ తనకూ మధ్యనున్న అనుబంధాన్ని పదిమందికీ సగర్వంగా చెప్పుకునే తాను ఇంత కఠినంగా ఎందుకు ప్రవర్తించాడో అర్థం చేసుకోలేక పోతున్నాడు. తన బేబీ చనిపోకూడదని భగవంతుణ్ణి శతవిధాల వేడుకున్నాడు.. ఇంతలో కామేశం డాక్టర్ని వెంట బెట్టుకొచ్చాడు.

"త్వరగా నా బిడ్డని పరీక్ష చేయండి డాక్టర్!" ఆయన చేతులు పట్టుకుని గద్గదస్వరంతో ప్రాధేయ పూర్వకంగా అన్నాడు విష్ణుమూర్తి.

"ఏమైంది అసలు ?" మంచం మీద కూర్చుని ఆమె నాడిని పరీక్షచేస్తూ అడిగేడు డాక్టరు.

"ఆత్మహత్య చేసుకోవాలని-నా నిద్ర మాత్రలన్నీ మింగేసింది.." ఆయన కళ్ళల్లోకి చూస్తూ చెప్పాడు.

"డోంట్‌వర్రీ సార్! ప్రాణాపాయంలేదు-నాడి కొట్టుకుంటుంది..మాత్రలు మరికొన్ని ఎక్కువగా వేసుకునుంటే డేంజరయ్యేది....ఇప్పుడు అర్జంటుగా 'యాంటీడోట్' ఇస్తే మీ బేబీ




కోలుకుంటుంది...త్వరగా నర్సింగ్‌హోంకి తీసుకురండి....!" - అంటూ లేచాడు డాక్టర్.

పనిమనిషి సాయంతో ఆమెను కారులోకి ఎక్కించాడు విష్ణుమూర్తి.. అయిదునిమిషాల్లో ఆ కారు నర్సింగ్‌హోం ముందు ఆగింది.

* * *

శ్రీరామ్‌ని మర్చిపోయి -గోపాలాన్ని పెళ్ళి చేసుకోమంటూ తను ఒత్తిడి చేయటం వల్లనే అశ్విని అలాంటి తీవ్రనిర్ణయం తీసుకుందని విష్ణుమూర్తి గ్రహించాడు.

అదృష్టవశాత్తు ఆ గండం గడిచి -నర్సింగ్ హోం నించి ఆశ్విని క్షేమంగా ఇంటికొచ్చి మూడు రోజులైనా -ఆమెకు ఎదురుపడి మాట్లాడేందుకు 'గిల్టీ'గా ఫీలవుతున్నాడు.. అందుకే ఎక్కువ సమయం ఆఫీసులోనే గడుపుతున్నాడు...

ఆఫీసులో కూర్చున్నంతసేపూ అశ్విని గురించే ఆలోచిస్తున్నాడు.... శ్రీరామ్‌తో ఆమె పెళ్లి జరిపిస్తే తప్పేమిటి? -అనే కోణం నుంచి కూడా ఆ ఆలోచనల్ని కొనసాగిస్తున్నాడు...

'తను తొందరపడి గోపాలాన్ని అల్లుడిగా చేసుకుంటానంటూ హనుమంతుకి మాట ఇవ్వకుండా వుండాల్సింది'- అని కూడా అనుకున్నాడు...

ఏది ఏమైనా సమయం మించిపోలేదు కనుక - చేసిన పొరపాటు సరిదిద్దుకోవాలని నిర్ణయించుకున్నాడు.

అందుకే ఆరోజు ఆఫీసుకి వెళ్లేముందు -హనుమంతు గదిలోకి వెళ్లేడు విష్ణుమూర్తి.

"ఏమిటి బావా...నువ్వొచ్చావ్? ..హాల్లోంచి ఓ కేక పెడితే నేనే వచ్చి వాలిపోయేవాణ్ణిగా?"- అంటూ ఎదురొచ్చి అడిగేడు హనుమంతు.

"నీతో కొంచెం ప్రయివేటుగా మాట్లాడాలి బావమరిదీ!" అన్నాడు విష్ణుమూర్తి. అక్కడున్న సోఫాలో కూర్చుంటూ...

"ఏమైంది బావా?" అనుమానంగా చూస్తూ ప్రశ్నించాడు.

"ఏమైందో నీకు తెలుసుగా?"- విష్ణుమూర్తి స్వరంలో ఆవేదన ధ్వనించింది.

"ఓ! అశ్విని గురించా?"

"అవును బావమరిదీ !... అది...తన కాలేజీలో చదువుతున్న ఓ కుర్రాణ్ణి ప్రేమించింది"

"అవును ! అందులో తప్పేముందీ? ఆ వయసులో ఎవర్నో ఒకర్ని ప్రేమించకపోతే తప్పవుతుంది...అయినా కాలేజీ చదివేటప్పుడు ప్రేమించక పోతే కాటికి కాళ్లు చాపుకున్నప్పుడు ప్రేమిస్తారా ఎవరైనా?" జోక్‌గా మాట్లాడుతున్నాననుకొని, తనకు తానే నవ్వుకున్నాడు..

అయినా విష్ణుమూర్తి గంభీరంగానే వున్నాడు.

ఇంతలో హనుమంతు మళ్లీ చెప్పాడు.

"చూడు బావా! తొందరగా పంతులుగార్ని పిలిచి ముహూర్తం పెట్టించేసి, మా గోపాలంతో తనకు పెళ్ళి చేసేసి- మరుక్షణంలో వాళ్ళిద్దర్నీ 'హనీమూన్' పంపించేయ్.. అన్నీ అవే సర్దుకు పోతాయ్..."

"ఆ విషయం మాట్లాడాలనే వచ్చాను ..కానీ.."ఎలా చెప్పాలో,ఎలా ప్రారంభించాలో తెలియక ఆలోచిస్తూ ఆగిపోయాడు విష్ణుమూర్తి.

"అర్థమైందిలే బావా! ..అశ్విని వేరే కుర్రాణ్ణి ప్రేమించింది కనుక -ఈ పెళ్ళికి మా వాడు ఏదైనా అభ్యంతరం చెప్తాడేమోనని నువ్ భయపడు తున్నావ్... అలాంటి భయాలేం పెట్టుకోవద్దు.... మా వాడు అమెరికాలో పెరిగినవాడు...!... ఆధునిక భావాలు వున్నవాడు..రేపు పెళ్ళికాగానే అమ్మాయిని పువ్వుల్లో పెట్టి చూసుకుంటూ తన దారికి తెచ్చుకోగల సమర్థుడు!" -గొప్పగా చెప్పాడు హనుమంతు...

"కానీ అశ్విని పెళ్లి మీ గోపాలంతో జరగదు బావమరిదీ!" వెంటనే చెప్పాడు విష్ణుమూర్తి.

షాక్ తిన్నట్టు చూశాడు హనుమంతు.

-(ఇంకావుంది)



కీరవాణి & మణిశర్మ పుట్టినరోజులను పురస్కరించుకుని....

# సరిగపదమని



కూర్పు : టి.నవీన్, హైదరాబాద్

**22**



**అడ్డం:-**

1. '.........మనసా ఇది ఏనాటి అనుబంధమో' క్రిమినల్ చిత్రంలోని పాట (3)
3. 'తొడగొట్టి చెబుతున్నా...........' ఒకటోనెంబరు కుర్రాడు పాడిన పాట (4)
7. '...... పాట పంచామృతం' అల్లరి మొగుడు చిత్రంలోని పాట (1)
8. '..... అక్కకు మొగుడైనందుకు నీకు పెళ్ళిచేసే బాధ్యత నాది ఓరి బామ్మర్దీ' (1)
9. 'కలికి చిలకల కొలికి మాకు మేనత్త .......వారి కోడలు కనకమాలక్ష్మి' సీతారామయ్య గారి మనవరాలి పాట (2)
10. 'బంగారు .......పెట్ట వచ్చెనండి' 'ఘరానా మొగుడు' చిత్రంలోని పాట (2)
12. '....... పిల్లది ఎంతమాటన్నది .......కుర్రది కూత బాగున్నది' అల్లరి ప్రియుడు చిత్రం లోని పాట (1)
13. 'కాబోయే శ్రీవారికి ........... రాసి పంపుతున్న ప్రియరాగాలై ఈలేఖ' పెళ్లిసందడి చిత్రంలోని గీతం (3)
15. '......... శ్వాసలో చేరితే గాలి గాంధర్వమౌతున్నదో ' నేనున్నాను చిత్రంలోని గీతం (1)
16. '........ అమ్మక చెల్లా ఆలకించి నమ్మడమెల్లా' ఆపద్బాంధవుడు చిత్రంలోని పాట (2)
18. 'అమ్మైనా నాన్నైనా ఎవరైనా ఉండుంటే పైనుంచి .......వానా ఇట్టా దూకేనా' సింహాద్రి చిత్రంలోని పాట (1)
20. 'చందనా చీరనుకట్టి .......... బ్లౌజులుచుట్టి కొత్త పెళ్ళికూతురొచ్చె నేడే' (3)
21. 'నవ మన్మథుడా ......సుందరుడా నువ్వు చూసిన ఆ ఘనుడు అక్కా ఎవరే అతగాడు' (2)
23. '......శంకరుల సౌందర్యలహరి దేవులపల్లి లలిత గీతాఝరి' సీతయ్య సినిమా లోని పాట (2)
24. 'నీ అథ.......... పుల్లారెడ్డి'(3)

**నిలువు:-**

1. 'నీ నవ్వుల ......దనాన్ని నాగమల్లి అప్పడిగింది ఇవ్వద్దూ' 'ఆది'లో పాట (2)
2. '....... ....... ....... అంటుందోయ్ కుమారీ' బావగారు బాగున్నారా చిత్రంలోని పాట (2)
3. 'తగిలినది రబ్బా తీపి.....దెబ్బ అదిరినది రబ్బా జివ్వుమని జబ్బా' సాంబ చిత్రంలోని పాట (2)
4. 'నువ్వేం ....... చేశావో గాని ఓ మనసా చెప్పమ్మా నిజాన్ని' (2)
5. 'రామ్మా ......... ప్రేమా మొలకమ్మా'(4)
6. '......... కొట్టలిరా సిక్స్‌కొట్టాలి' (3)
11. '......... నగరి కలకత్తాపురి నమహో హుబిలి హౌరా వారథి' (3)
14. 'అందాల ........ ఎంత బాగుంది ముద్దుగుమ్మ' సమరసింహారెడ్డి చిత్రంలోని పాట (4)
17. '....... ....... రఘు....... అనిపాడుతున్న హనుమా అంత భక్తి పరవశమా ఓకంట మమ్ము గనుమా' శ్రీఆంజనేయంలోపాట (2)
19. 'అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా .......తప్పి కుర్రాళ్ళే మంచాన పడ్డారే' ఖుషీ పాట (2)
21. 'అబ్బబ్బ ఇద్దూ .......రేలా ముద్దు' చూడాలనివుంది చిత్రంలోని పాట (2)
22. 'నేను ...... ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను' రాగూరు చిత్రంలోని శ్రీశ్రీ పల్లవి (2)

పంపినవారి పేరు :..............................................................

వయసు :.......... వృత్తి:.........................................................

చిరునామా :........................................................................

.........................................................................................

..........................................................ఫోన్:..............................

**పజిల్, కూపన్ 15-07-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరువిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)



కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**జి. భారతి, నెల్లూరు.**

ప : పోయినోళ్లందరూ మంచోళ్లు మరి వున్నోళ్ళు ?

జ : ముంచేటోళ్లు.

**వి. మంజురాణి, హైదరాబాదు.**

ప : ఎంత ఎదిగున్నా ఒదిగుండేది ఏది?

జ : పీసా టవర్.

ప: కృత నిశ్చయం అంటే ?

జ: కృత యుగంలోని మనుషులు చేసుకున్న నిశ్చయం.

## డబుల్ రోల్




ఒరేయ్ **రాజు** ఆ తా **రాజు**వ్వలు త్వరగా ఎగరెయ్‌రా

**జడి** వానల వల్ల మనసంతా అల**జడి**గా ఉంది

వాడి దగ్గర **మని** తీసుకో **మని** చెప్పాను గదరా

ఆ **గండి** కొట్టిన వెంటనే ఒక గ్లాసు నీళ్ళు తా**గండి**

ఆ **సంత**లోని మేనేజరు తో **సంత**కం తీసుకో

**-వై. ధీరజ్‌కుమార్, నందిగామ.**



## షార్ట్‌కట్స్




**నోరి ముక్తేశ్వరరావు - నోము**

**పూసల జగన్నాధరావు - పూజ**

**-నీలం రామమూర్తి, కొరాపుట్.**

**తొడిమెల సమ్మక్క - తొక్క**

**కు మ్మరి సారక్క - కుక్క**

**పట్టాల రాజ కుమార్ - పరాకు**

**దేవులపల్లి హంస - దేహం**

**మూకుడు లంకేశ్వర్ - మూలం**

**-జి. భారతి, నవాబుపేట, నెల్లూరు.**

## ఈ రూటే వేరు




'అధి' కారులు - 'కార్లు' అధికంగా వున్నవారు.

**-వి. మంజురాణి, హైదరాబాద్.**

నోటు - రెండులేదు

కీడు - తాళం చెవి చెయ్యి

**-శివాల శ్రీనివాసరావు, విద్యానగర్, ఆముదాలవలస.**

## పేరు - రిపేరు




పెళ్ళాం ఊరెళితే - సీతయ్య - చిందులు

**-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.**

వీడే - దొంగ - ఐతే ఏంటి - అందరూ దొంగలే

**-టి. దీప్తి, పుణె.**

ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు - ఇక అంత శుభమే పెళ్లి జరిపించండి.

**-జి. శశిధర్, నవాబుపేట, నెల్లూరు**

## చిలిపి కవిత




అప్పు
ఉన్నవాడికి ఇష్టం
లేని వాడికది కష్టం
తీర్చలేనిదది స్పష్టం
తీర్చ కెళ్తితే నష్టం

**-బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.**

నగర వాసులకి
ఓ పట్టాన
అర్థంకాని 'టాపిక్కు'..
అస్తమానం జామయ్యే ట్రాఫిక్కు....

**-భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్.**

## చిలిపి లిపి




బంతిపూలు - Ball Flowers.
రాష్ట్రపతి - State Husband.
అరవై - $\frac{1}{2}$ y
సాయంకాలం - Help Time
ఈతచెట్టు - Swimming Tree.
వానపాము - Rain Snake
అన్నపూర్ణ - Brother Full

**- నన్నపనేని. రవి/మాధవి, ఉలిచి, ఒంగోలు.**

## పేరడీ పేరడీ




కుత కుత ఉప్మా- ఉడుకుతు ఉంటే
కమ్మని నేతితో పెసరట్టుంటే
ఉప్మా పెసరట్ కలేసి కొట్టీ
లొట్ట లేసుకుని మింగుతు వుంటే
తిరుగులేని ఆ కాంబినేషనూ
ఎంతో బాగుంటుంది ॥తిరుగు॥ ॥కుత కుత॥
వేడి వేడిగా - ఇడ్లీలుంటే....ఇడ్లీలుంటే
అందుకు తగిన సాంబారుంటే ...సాంబారుంటే ॥వేడి॥
ఇడ్లీ పై సాంబారు పోసుకొని ॥2॥
ప్లేట్లు పేట్లుగా లాగిస్తే
తిరగులేని ఆ కాంబినేషనూ
ఎంతో బాగుంటుందీ ॥కుత కుత॥
హాటు హాటుగా -పూరీలుంటే.... పూరీలుంటే
కుర్మాకూర పక్కన ఉంటే ..... పక్కన ఉంటే ॥హాటు॥
కూరతో పూరి నంచుకు తింటూ ॥2॥
లోనికి కమ్మగా దించేస్తే
తిరుగులేని ఆ కాంబినేషనూ
ఎంతో బాగుంటుంది ॥కుత కుత॥

('ఆత్మబలం' చిత్రంలో చిటపట చినుకులు పడుతూ వుంటే పాటకు పేరడీగా)

**-పద్మనాభయ్య, నెల్లూరు.**

**ఈ సంచికలోని పేరడీ పేరడీని రాసిన పద్మనాభయ్య, నెల్లూరు గారికి సోహన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' రీమిక్స్ పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**




SOHAN MUSIC




ఉన్న పాటలన్నీ మంచి పాటలేనని అనిపించుకున్న అన్నపూర్ణా వారి

# వెలుగు నీడలు

చిత్రంలోని తొమ్మిది పాటలలో అయిదింటి గురించి 1-15, 16-31 మే 2004 సంచికలలో వివరించగా మరో నాలుగింటి గురించి ఈ సంచికలో.....

ఆ : హోయి హోయిగ జాబిల్లి -
తొలిరేయి వెండి దారాలల్లి
మందు జల్లి నవ్వసాగే ఎందుకో-
మత్తుమందు జల్లి నవ్వసాగే ఎందుకో అ : ॥హోయి॥
ఆ : తళ తళ మెరిసిన తారక-
తెలి వెలుగుల వెన్నెల దారుల ॥తళ॥
అ : కోరి పిలిచెనొ తన దరిచేరగా-
మది కలచెనొ తీయని కోరిక ॥హోయి॥
మిల మిల వెలిగే నీటిలో
చెలి కలువల రాణీ చూపులో ॥మిల॥
ఆ : సుమదళములు పూచిన తోటలో
తొలి వలపుల తేనెలు రాలెనొ ॥హోయి॥
విరిసిన హృదయమె వీణగా
మధు రసముల కొసరిన వేళల ॥విరి॥
అ : తొలి పరువము లొలికెడు సోయగం
కని పరవశమందెనొ మానసం ॥హోయి॥



ఈ పాటను శ్రీశ్రీ రాయగా, సుశీల, ఘంటసాల గానం చేశారు. గిరిజ, అక్కినేని, అభినయించారు. 'ఒ' కారాలను విరివిగా ప్రయోగించడంలో శ్రీశ్రీ కి ఓ ప్రత్యేకత ఉంది. 'ఓహోమేఘసఖా ఒకచో ఆగేవా' అంటూ ఓ డబ్బింగ్ పాటకు రాశారాయన. ఈ పాటలో కూడా- 'కోరి పిలిచెనొ, మది కలచెనొ, తేనెలు రాలెనొ, పరవశమందెనొ,-వంటి ప్రయోగాలు ఆ ప్రత్యేకతను మరోసారి గుర్తు చేస్తాయి. అలాగే చంద్రుని కిరణాలను వెండిదారాలతో ఉపమించడం ఓ మంచి ప్రయోగం. ఈ పాట రెండో చరణం కూడా ట్యూన్ పరంగా చాలా బావుంటుంది. పాడుకుంటుంటే ఎంతో తృప్తిగా ఉంటుంది. అయితే ఈ చరణం ఆ రోజుల్లో విడుదలైన రికార్డులలో లేకపోవటం వల్ల ఎంతో మంది సంగీతాభిమానుల మదిలో చోటు చేసుకోలేకపోయింది. కళ్యాణి రాగంలో స్వరపరుస్తూ అవసరమైన చోట యమన్ రాగాన్ని కలుపుకుంటూ సాగిన ఈ పాట - పల్లవికి -1959 లో విడుదలైన 'నయా సంసార్' హిందీ చిత్రంలో సంగీత దర్శకుడు చిత్రగుప్త స్వరపరచగా లతా పాడిన 'చందా లోరియా సునాయె-హవా ఝూల్ నఝులాయే' పాట ఆధారం.

అ : సరిగంచు చీరెగట్టి బొమ్మంచు రైక తొడిగి
జలసాగ నాతో రాయే వయ్యారి ముద్దులగుమ్మ
సినిమాకు పోదంలేవే గయ్యాళి రంగుల బొమ్మ
ఆ : నిలపర చిన్నోడో నీ సోకు నీ తీకు
ఏడ నేర్చినావురో ఈ నీటు ఈ గోటు
మింగ మెతుకు లేదాయె మీసాలకు సెంటాయే ॥మింగ॥
ఏటేటా బిడ్డాయె-ఓపిక వుడిగీపోయే
ఇంట్లో ఈగలమోత - బయట పల్లకిమోత ॥నిలపర॥
అ : సంపాదన జేసుకోను సత్త వున్నాదీ
సక్కనైన సుక్కనాకు పక్కనున్నాదీ ॥సంపా॥
సామి సల్లగాజూసి సంతు వున్నదీ
ఇంతకన్న సొర్గమంటె ఎక్కడున్నదీ
నిలపవె నా రాణీ - నీ కేల భయమింక
ఆపవె బరాణీ- అల్లిబిల్లి కూతలింక
ఆ : కనంగానె ఏమాయె గాలికి వదిలావాయె ॥కనం॥
బిడ్డలంటె పట్టదాయె చదువు గొడవ ఎత్తవాయె
బండచాకిరీతొ వాళ్ళ బతుకే తెల్లారిపోయే ॥నిలపర॥
అ : సంతానం పెరక్కుండ సూసుకుందామె
సంసారం సాగుమానం సేసుకుందామె ॥సంతానం॥
సిల్లరంత కూడబెట్టి దాచుకుందామె
పిల్లగోళ్ళ సదువులకు వాడుకుందామె
నిజమేనే రాణి నువ్వు చూపిన బాట
ఇంటాను లేవే ఇక మీద నీ మాట
ఇ : సంతోషమే - సంతోషమే
సింతలేని కాపురమే శ్రీరంగమే
ఆలుమగలు ఒక్కటైతే ఆనందమే ॥సంతోషమే॥









ఈ పాటను కొసరాజు రాయగా ఘంటసాల, సుశీల ఆలపించారు. ఇ.వి.సరోజ, బి.ధర్మరాజు అభినయించారు. యస్వీ రంగారావు, జగ్గయ్య, సావిత్రి, సంధ్య, ప్రేక్షకులలో సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. అంతర్లీనంగా గానీ, నేరుగా గాని ఎంతో కొంత సందేశం ఉండే ప్రయోజనాత్మక గీతం కనీసం ఒక్కటైనా తమ చిత్రాలలో ఉండాలని ఇంచుమించు ప్రతి నిర్మాణ సంస్థా ఆ రోజుల్లో భావించేది. అందులో అన్నపూర్ణా సంస్థ అయితే చెప్పనవసరమే లేదు. కచ్చితంగా ఉండి తీరేది. అంతేకాదు ఇటువంటి గీతాలలో అభినయించే వారికి, లేదా నర్తించే వారికి క్లోజప్‌లు, మిడ్‌షాట్‌లు ఉండేవి. అంతేగాని లాంగ్‌షాట్‌లలో డ్రస్సులతోను, లొకేషన్ అందాలతోనూ మ్యానేజ్ చెయ్యడం ఆ తరానికి తెలియదనే అనుకోవాలి. అందుకే ఇటువంటి గీతాలలో పాల్గొనే వారికి ప్రేక్షకుల నుండి గుర్తింపు లభించేది. ఈ పాటలో నృత్యం చేసిన ఇ.వి.సరోజకు అన్నపూర్ణా వారి తర్వాతి చిత్రం 'ఇద్దరు మిత్రులు' చిత్రంలో ఏకంగా నాగేశ్వరరావు పక్కనే హీరోయిన్‌గా చేసే అవకాశం వస్తే ప్రేక్షకులామెను ఎంతోకాలంగా పరిచయం ఉన్న నటిలా ఆదరించడానికి గల కారణాలలో ఇదొకటి. ఈ చిత్రం ఛానల్స్‌లో వచ్చినప్పుడు గాని, వీసీడీ దొరికినప్పుడు గాని జాగ్రత్తగా చూడండి - పాటలో ఎక్కడా వల్గర్ మూమెంట్స్ ఉండవు. పైగా కష్టపడి చేయవలసిన స్టెప్పు, మూమెంట్స్ ఉంటాయి. నృత్య గీతం అంటే అదీ! తిరిగి బైట ఎవరైనా ప్రదర్శిస్తే ప్రేక్షకుల నుండి గౌరవంతో కూడిన స్పందన లభించాలే తప్ప వేరొకటి కాదు. ఇక సాహిత్యపరంగా చూసుకుంటే - చక్కటి తెలుగు నుడికారంతో, జానపద శైలిలో, అందరికి తెలిసిన సూక్తులతో పాటకు కొసరాజు కల్పించిన గౌరవాన్ని తల్చుకుంటే ఆయనకు పాదాభివందనం చెయ్యాలనిపిస్తుంది. సరిగంచు, బొమ్మంచు, సోకుతీకు, నీటుగోటు, మింగమెతుకు లేకపోయినా మీసాలకు సెంటు (ఇక్కడ సంపంగి నూనె అని అనకుండా ట్యూన్‌కి కుదిరేట్టు సెంటు అని వాడడం దీసెంటు ప్రయోగమే) సాగుమానం, పిల్లగోళ్ళు, చింతలేని కాపురం శ్రీరంగం - లాంటివి మచ్చుకి, మెచ్చుకి కొన్ని.... ఈ పాట ఇవాళ వింటున్నా ఇంకా వినబుద్దేస్తుందంటే అందుకు మరో కారణం ఆ సాహిత్యాన్ని సజీవంగా ఉంచిన సంగీతం, సుస్పష్టంగా అందించిన గళాల మాధుర్యం.

సుగుణ : చల్లని వెన్నెల సోనలు - తెల్లని మల్లెలమాలలు
మా పాపాయి బోసినవ్వులే
మంచి ముత్యముల వానలు ॥చల్లని॥
వరలక్ష్మి : పిడికిలి మూసిన చేతులు- లేత గులాబీరేకులు॥పిడికిలి॥
చెంపకు చారెడు సోగకన్నులే
సంపదలీనెడు జ్యోతులు
మా పాపాయి బోసినవ్వులే మంచిముత్యముల వానలు॥చల్లని॥
సుగుణ : ఇంటను వెలసిన దైవము - కంటను మెరిసిన దీపము
మా హృదయాలకు హాయినొసంగే
పాపాయే మా ప్రాణము ॥ఇంటను॥
చల్లని వెన్నెల సోనలు - తెల్లని మల్లెల మాలలు
మా పాపాయి నవ్వుపువ్వులె
మంచి ముత్యముల వానలు
నోచిన నోములపంటగ - అందరి కళ్ళకు విందుగా
పేరు ప్రతిష్ఠలె నీ పెన్నిధిగా
నూరేళ్ళాయువు పొందుమా ॥చల్లని॥








ఈ పాటను శ్రీశ్రీ రాయగా సుశీల, జిక్కి ఆలపించారు. సావిత్రి, గిరిజ అభినయించారు. సన్నివేశ ప్రాధాన్యంగా సూర్యకాంతం, ముగ్గురు చిన్నపిల్లలు (ఏడాదిలోపు, రెండు మూడేళ్ళలోపు, అయిదారేళ్ళ లోపు పిల్లలు) కనిపిస్తారు. పుట్టి పెరుగుతున్న పిల్లవాణ్ణి పెంచుతున్న కన్నతల్లి హృదయం, ఆ పిల్లవాడిపై మమకారం పెంచుకున్న మరో మాతృ హృదయం - స్పందిస్తే ఎటువంటి భావాలు కలుగుతాయో వాటినే అక్షరరూపంలో అందించారు శ్రీశ్రీ. పరకాయ ప్రవేశ విద్య మంచి కవికి అంతర్లీనంగా ఉంటుందనటానికి ఈ పాట ఓ ఉదాహరణ. ఇక్కడ ఆనాటి విలువల గురించి మరోసారి చెప్పుకోవాలి. పాట మొదట్లో మా పాపాయి బోసి నవ్వులే మంచి ముత్యముల వానలు - అని ఉంటుంది. తర్వాత నుంచి - మా పాపాయి నవ్వు పువ్వులె మంచి ముత్యముల వానలు-గా ఆ లైను రూపాంతరం చెందుతుంది. అందుకు కారణం - పిల్లవాడు పెరిగి బోసి నవ్వుల స్థాయి నుండి పళ్ళొచ్చాక అందంగా నవ్వేటంతగా పెద్దవాడయ్యాడు- అని ఎస్టాబ్లిష్ చెయ్యాలనుకోవటమే! నిర్మాత, దర్శకుడు, పాటల రచయిత కలిసి కూర్చొని అనుకుంటేనే గాని ఇంత లోతైన అవగాహన కలగదు. ఆనాడు ఉన్నదీ, ఈనాడు కొరవడుతున్నదీ అదే!

ఈ పాటను వకుళాభరణం రాగం ఆధారంగా స్వరపరిచారు. 'ఇంటను వెలిసిన దీపము' చరణానికి చక్రవాక రాగాన్ని, 'నోచిన నోములు పండగా' చరణం వద్ద మాయా మాళవగౌళ రాగాన్ని స్పృశించినా వకుళాభరణ రాగాన్నే ప్రధానంగా చేసుకుని పాటను నడపడం జరిగింది. ఈ పాటకు బెంగాలీలో గీతారాయ్ పాడిన 'కాజల్ కాజల్ కుమ్ కుమ్' అనే ప్రైవేట్ గీతం ట్యూన్ ఆధారం అని శ్రీ వివిఎకె రంగారావు తన 'ఆలాపన' శీర్షికలో పేర్కొన్నారు.

సుగుణ : చిట్టీ పొట్టీ చిన్నారి పుట్టిన రోజు
చేరి మనం ఆడిపాడే పండుగరోజు ॥చిట్టీ॥
సుగుణ : వేడుకగా ఈ పూట - ఆడుదమా దొంగాట ॥2॥ ॥చిట్టీ పొట్టీ॥
సుగుణ : కళ్ళకి పట్టీ చల్లగకట్టీ వీపుతట్టి పోతాం
తాకినవారి పేరొకసారి చెప్పవోయి చూదాం
వరలక్ష్మి: చురుకుతనం బుద్ధిబలం వుంటేనే చాలు
చూడకనే తెలియుకదా నిజనిజాలు ॥వేడుకగా॥ ॥చిట్టీ పొట్టీ॥
వరలక్ష్మి: కన్నులుండి చూడలేరు కొంతమంది జనం
దారితప్పి తిరగడమే తెలివిలేనితనం ॥కన్ను॥
సుగుణ : మెదడు పదునుపెట్టాలి - అసలు దొంగను పట్టాలి ॥2॥ ॥చిట్టీపొట్టీ॥
సుగుణ : "అంబా" అనే అరుపు వినీ తల్లిని చేరు లేగ
నేలమీది పిట్టను పోల్చు నింగి నెగురు డేగ ॥అంబా॥ ॥మెదడు॥
వరలక్ష్మి: చీకటైనా చిటారుకొమ్మ చేరును కోతి
గురితెలిసి మసలుకొనే నిదానమే నీతి॥వేడుకగా॥ ॥చిట్టీపొట్టీ॥








ఈ పాటను కూడా శ్రీశ్రీయే రాయగా సుశీల,స్వర్ణలత ఆలపించారు. సావిత్రి, గిరిజ పాటను అభినయించగా అక్కినేని నాగేశ్వరరావు, సూర్యకాంతం మరొక చిన్నబాబు సన్నివేశంలో పాల్గొని తమవంతు అభినయాన్ని అందించారు. చరణాలలో మోహన రాగాన్ని స్పృశించడం, 'వేడుకగా ఈపూటా ఆడుదమా దొంగాటా' అనే వాక్యాన్ని రెండు స్థాయిలలో సుశీలతో పలికించటం పెండ్యాల రసదృష్టికి నిదర్శనం. ఎందుకంటే అలా రెండుస్థాయిలలో మాధుర్యం తగ్గకుండా, కొండొకచో పెరుగుతూ పాడడం కొన్ని స్త్రీ కంఠాలకు మాత్రమే నప్పుతుంది. ఉదాహరణకు 'భలే అమ్మాయిలు' చిత్రంలోని 'మది ఉయ్యాలలూగె నవభావాలేవో రేగే' పాటలో 'ప్రేమలా కరగిపోవుదమా.... భేదమే మరచిపోవుదమా' అనే లైన్లని పి. లీలతో యస్.రాజేశ్వరరావు పాడించిన విధానాన్ని గుర్తుకు తెచ్చుకోండి.

ఓ చిన్న పిల్లవాడికి పుట్టినరోజు సందర్భంగా కళ్ళకు గంతలు కట్టుకొని దొంగాట ఆడే సన్నివేశానికి సరిపడేట్టుగానే కాకుండా వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడే విషయాలను కూడా పరోక్షంగా అందించారు శ్రీశ్రీ. చురుకుదనం, బుద్ధిబలం ఉంటేనె చాలు - చూడకనే తెలియు కదా నిజానిజాలు/ కన్నులుండి చూడలేరు కొంతమంది జనం - దారి తప్పి తిరగడమే తెలివిలేనితనం/ గురి తెలిసి మసలుకునే నిదానమే నీతి.... లాంటి వాక్యాలు మన నిత్య జీవితంలో ఎన్నిసార్లు అనుభవంలోకి వచ్చుంటాయో కదా... అలాగే భవిష్యత్తులో కూడా ఇక ఎవరికీ వీటి అవసరం రాదని చెప్పలేం కదా... శాశ్వతత్వం అంటే అదీ... అటువంటి అక్షరజ్యోతుల్ని మనలో వెలిగించిన ఆనాటి కవులను ఇవాళ్టికీ మనం తల్చుకొని తల్చుకొని మురిసిపోతూ కన్నీళ్ళెట్టుకోవటానికి కారణం కూడా అదే!

**రచన : ఆత్రేయ** **1** **గానం : సుశీల, కమల్‌హాసన్**

ఆ: ఏ తీగ పువ్వునో ఏ కొమ్మ తేటినో
కలిపింది ఏ వింత అనుబంధమౌనో
అ: అప్పిడియా...
ఆ: అర్థం కాలేదా...? ॥ ఏ తీగ॥
ఆ: తెలిసీ.... తెలియని అభిమానమౌనో
మనసు మూగది మాటలు రానిది
మమత ఒకటే అది నేర్చినది ॥మనసు॥
అ: ఆ..ఆ..అప్పిడియా
ఆ: హ..హ..పెద్ద అర్థమైనట్టు
ఆ: భాషలేనిది బంధమున్నది
మన యిద్దరినీ జత కూర్చినది
మన యిద్దరినీ జత కూర్చినది ॥ఏ తీగ॥
వయసే వయసును పలకరించినది
వలదన్నా అది నిలువకున్నది
అ: హే...నీ రొంబ హాళహోయ్‌రిక్కే
ఆ: ఆఁ...రొంబా... అంటే ...?
ఆ: ఎల్లలు ఏవి ఒల్లనన్నది
నీదీ నాదొక లోకమన్నది...
నీదీ నాదొక లోకమన్నది... ॥ఏ తీగ॥
తొలిచూపే నను నిలవేసినది
మరుమాపై అది కలవరించినది
అ: నల్ల పొణ్ణు...అంటే నల్లపిల్లా
ఆ: మొదటి కలయికే ముడివేసినది
తుదిదాకా ఇది నిలకడైనది
తుదిదాకా ఇది నిలకడైనది ॥ఏ తీగ॥

**రచన : ఆత్రేయ** **2** **గానం : యల్.ఆర్.ఈశ్వరి, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం**

ఆ: బలెబలె మగాడివోయ్-బంగారు నా సామివోయ్
నీ - మగసిరి గులామునోయ్ నీయాన నీదాననోయ్ ॥బలెబలె॥
అ: I don't know what you say....
ఆ: తెలియంది మానేసేయ్ - నీకు తెలిసింది ఆడేసెయ్॥2॥
తీయంది ఒక బాసే - That's love's Language I say..
అ: I don't know what you say to me
but I have so much to say
I wanna fly with you up the
Sky and dance all the night
I can't help darling falling in love
With you and only with you ॥ I can't ॥
Come darling lets play the game
Come darling lets swing and sway
ఆ: బలెబలె మగాడివోయ్-బంగారు నాసామివోయ్
అ: I wanna fly with you up the
Sky and dance all the night
ఆ: నా గుండెలోన నీవే ఉయ్యాల లూగినావే ॥2॥
అ: Let's be merry my dove Let's be merry my love ॥2॥
ఆ: ఏ మత్తు చల్లినావో ఏ మైకమిచ్చినావో ॥2॥
అ: One fine day you will be mine
It will be full of sun-shine ॥ One fine ॥
ఆ: నాతోటి నీవుండా నాకు ఇంకేల నీరెండ ॥2॥
అ: Come baby let's have some fun
Come dear there's no one

ఆ: బలెబలె మగాడివోయ్-బంగారు నాసామివోయ్
అ: ho ! I wanna fly with you up the
Sky and dance all the night
ఆ: నీ కౌగిలింతలోన నా సొగసు దాచుకోనీ
అ: No need to feel shy my girl
No need to hold back my doll
ఆ: నా వంపు వంపులోన నీ వయసు ఆపుకోనీ
అ: Hand in hand lets sail... my dear
Come near don't fear dear...
ఆ: సాగించు పయనాన్ని నీవే చూపించు స్వర్గాన్ని
అ: ho! Let's start the game of our life
And you be my dear wife.....
ఆ: ఆ...బలెబలె మగాడివోయ్-
బంగారు నా సామివోయ్
నీ - మగసిరి గులామునోయ్
నీయాన నీ దాననోయ్
అ: హ..హ..హ..బలెబలె మగాడివోయ్-
బంగారు నా సామివోయ్
నీ - మగసిరి గులామునోయ్
నీయాన నీ దాననోయ్

**రచన : ఆత్రేయ** **3** **గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, రమోలా**

సాకి: కలిసి వుంటే కలదు సుఖము - కలిసివచ్చిన అదృష్టము.. శభాష్
అ: కలిసి వుంటే...కలిసి వుంటే కలదు సుఖము ॥2॥
కలిసివచ్చిన అదృష్టము
ఇది కలిసివచ్చిన అదృష్టము-
కన్నె మనసులు,మూగమనసులు,
ఆ: ఆ...హ...హ...హ..
అ: కన్నె మనసులూ,మూగమనసులూ
తేనెమనసులూ,మంచిమనసులూ ॥కలిసివుంటే॥
అ: మొనగాళ్లకు మొనగాడు - దసరాబుల్లోడు-
ప్రేమనగరు-సోగ్గాడు-పూలరంగడు
ఆ: ఆ...హ...హ...హ..
అ: మొనగాళ్లకు మొనగాడు - దసరాబుల్లోడు-హోయ్..
ప్రేమనగరు-సోగ్గాడు-పూలరంగడు
పక్కింటి అమ్మాయి-గడుసు అమ్మాయి
ఆ: ఆఁ...ఛీ..ఏం కాదు
అ: పక్కింటి అమ్మాయి-గడుసు అమ్మాయి ఆ: ఆఁ..
అమెరిక అమ్మాయి- రోజులు మారాయి
ఆఁ...ఢంఢ ఢ ...ఢడఢ...ఢంఢోఢఢ..ఢంఢ ఢ ...ఢడఢ...॥కలిసి॥
మంచివాడు- మామకుతగ్గ అల్లుడు
ఆ: హో..అలాగ
అ: చిక్కడు - దొరకడు, కదలడు -వదలడు, వాడే వీడు
ఆ: అయ్యో...పిచ్చివాడు
అ: ఏయ్...మంచివాడు- మామకుతగ్గ అల్లుడు
చిక్కడు - దొరకడు, కదలడు -వదలడు, వాడే వీడు
ఆ: ఊఁ...
అ: యీడు -జోడు, తోడు-నీడ, నాడు-నేడు ॥2॥
ప్రేమించిచూడు - పెళ్లిచేసి చూడు
ఆ: అమ్మ బాబోయ్
అ: ఢంఢ ఢ ...ఢడఢ...ఢంఢోఢఢ..ఢంఢ ఢ ...ఢడఢ...॥కలిసి॥

**రచన : ఆత్రేయ** **4** **గానం : ఎస్. జానకి**

ఆ: పదహారేళ్లకూ.... నీలో నాలో
ఆ ప్రాయంచేసే చిలిపి పనులకు కోటి దండాలు...॥పద॥
వెన్నెలల్లే విరియబూసీ
వెల్లువల్లే ఉరకలేసే ॥పద॥
పరువులు పరచిన ఇసుక తిన్నెలకు
పాటలు పాడిన చిరుగాలులకు ॥పరువులు॥
తెరచాటొసగిన చెలులు శిలలకు ॥2॥
దీవెన జల్లులు చల్లిన అలలకు
కోటిదండాలు శతకోటి దండాలు ॥పద॥
నాతో కలిసి నడచిన కాళ్లకు
నాలో నిన్నే నింపిన కళ్లకు
నిన్నే పిలిచే నా పెదవులకు
నీకై చిక్కిన నా నడుమునకు...
కోటిదండాలు శతకోటి దండాలు ॥పద॥
భ్రమలో లేపిన తొలిజాములకు
సమయం కుదిరిన సందెవేళలకు
నిన్నూ నన్నూ కన్నవాళ్లకు ॥2॥
మనకై వేచే ముందునాళ్లకు
కోటిదండాలు శతకోటి దండాలు
కోటిదండాలు శతకోటి దండాలు ॥పద॥

**రచన : ఆత్రేయ** **5** **గానం : వాణీజయరాం**

విధి చేయు వింతలన్నీ
మతిలేని చేతలేనని
విరహాన వేగిపోయి
విలపించే కథలు ఎన్నో ॥విధి॥
ఎదురుచూపులు ఎదను పిండగ
ఏళ్ళు గడిపెను శకుంతల
విరహబాధను మరచిపోవగ
నిదురపోయెను ఊర్మిళ ॥ఎదురుచూపులు॥
అనురాగమే నిజమని మనసొకటే దాని ఋజువని
తుది జయము ప్రేమదేనని
బలియైనవి బ్రతుకులెన్నో ॥విధి॥
వలచి గెలిచి కలలు పండిన జంట లేదీ యిలలో
కులము మతమో ధనము బలమో
గొంతు కోసెను తుదిలో
అది నేడు జరుగరాదని ఎడబాసి వేచినాము
మనగాథె యువతరాలకు
కావాలి మరోచరిత్ర కావాలి మరోచరిత్ర ॥విధి॥

**రచన : ఆత్రేయ** **6** **గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం**

ఏ తీగ పువ్వునో ఏ కొమ్మ తేటినో
కలిపింది ఏ వింత అనుబంధమౌనో ॥ఏ తీగ॥
తెలిసీ తెలియని అభిమానమౌనో
మనసు మూగది మాటలు రానిది
మమత ఒకటే అది నేర్చినది ॥మనసు॥
భాషలేనిది బంధమున్నది॥2॥
మన యిద్దరినీ జత కూర్చినది
మన యిద్దరినీ జత కూర్చినది ॥ఏ తీగ॥
వయసే వయసును పలకరించినది
వలదన్నా అది నిలువకున్నది ॥వయసే॥
చేసినబాస శిలవలె నిలిచీ ॥2॥
చివరికి మంచై కరుగుతున్నది...
చివరికి మంచై కరుగుతున్నది... ॥ఏ తీగ॥

# కథాసంగ్రహం

ప్రేమనదులు ఒక తిన్నగా సాగవు. ఎత్తుపల్లాలు దాటి ఎక్కడో కాల సముద్రంలో కలుస్తాయి.

విశాఖపట్నంలో స్థిరపడిన అరవకుర్రాడు బాలూ, పక్కింటి తెలుగు పడుచు స్వప్న ప్రేమించుకున్నారు. భాష, సంప్రదాయాల గొడవలతో ఆ యిరుగు, పొరుగు కుటుంబాలు అనునిత్యం కీచులాడుకుంటుంటే అలాంటి పట్టింపులేని ప్రేమికులు అనుక్షణం దగ్గరయ్యారు. వారి ప్రేమకాస్త శృతిమించి రాగాన పడుతూండగా - స్వప్న మీద ఒక కన్నువేసిన దిగంబరం ద్వారా పెద్దలకు తెలిసింది రహస్యం. ఇరుపక్షాల పెద్దలు హోరాహోరీగా పోరాడుకున్నారు. గానీ స్వప, బాలు మాత్రం పట్టుకున్న చేతులు విడవమన్నారు. అప్పుడొక చరిత్రాత్మకమైన పద్ధతి సూచింపబడింది.

సరిగ్గా 365 రోజులు వారిద్దరూ విడివిడిగా గడిపి ఒకరితో ఒకరు ఉత్తర ప్రత్యుత్తరాలు గానీ, కలుసుకోవడం గానీ లేకుండా పూర్తి నిర్వాసం అనుభవించిన తరువాత ఇంకా ప్రేమించుకుంటూనే ఉంటే పెళ్ళి చేసుకోవచ్చునని పెద్దలన్నారు. అనేక వాదోపవాదాలు జరిగాక అంగీకరించారు బాలు, స్వప్న. ఉద్యోగం మిషతో హైదరాబాదు పంపించారు బాలుని. స్వప్న విశాఖపట్నంలోనే రోజులు లెక్కపెడుతూ ఉండిపోయింది.

ఈ అసిధారావ్రతానికి విఘాతాలు కలిగించడానికి ఇద్దరి పెద్దలూ జరిపిన ప్రయత్నాలు, వాటిని ప్రేమికులు ఎదుర్కొన్న వైనాలు-స్వప్నకు తారసపడిన యువకులు, బాలూ కలుసుకొన్న యువతులు-గడుస్తున్న 365రోజులు - ఇవన్నీ కలిపి ఒక అమరగాథంగా రూపొందాయి. ఇదొక అంతులేని కథ. ఐనా యింకా వుంది! గత చరిత్ర ఇందులో లేదు! ఇది మరోచరిత్ర.

## నటీ-నటులు

కమల్‌హాసన్, సరిత, మాధవి, జయవిజయ, రమణమూర్తి, పి.యల్.నారాయణ, మీరా, సరోజ, శ్యామల, చైతన్య, మిశ్రో, భాస్కరరాజు, డా॥ఆడెమ్స్, జగన్నాధరావు.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : గణేష్ పాత్రో |
| పాటలు | : ఆత్రేయ |
| ఫోటోగ్రఫి | : లోకనాథ్ |
| ఎడిటింగ్ | : ఎన్.ఆర్.కిట్టు |
| స్టిల్సు | : నాయర్ |
| మేకప్ | : ఆర్.సుందరమూర్తి |
| డైరెక్టోరియల్ అసిస్టెంట్స్ | : వెంకట్రామన్, అమీర్ జాన్, అనంతు, మిశ్రో |
| కాస్ట్యూమ్స్ | : పొన్నుస్వామి |
| హెయిర్ డ్రెస్సర్ | : సరోజ, జయ |
| మ్యూజిక్ అసిస్టెంట్స్ | : విజయ కృష్ణమూర్తి, జోసెఫ్ క్రిష్ణ |
| ఔట్‌డోర్ యూనిట్ | : భువనేశ్వరీ సినీ సర్వీస్ |
| ప్రాసెసింగ్ | : సారథీ స్టూడియోస్, హైదరాబాద్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : ఎస్.రాఘవేంద్రన్ |
| రికార్డింగ్ | : శివరాం (వాహిని) హరి |
| సంగీతం | : ఎం.ఎస్.విశ్వనాథన్ |
| నిర్మాత | : రామ అరంగణ్ణల్ |
| దర్శకత్వం | : కె.బాలచందర్ |

## 'సరిగపదమని-20

**జవాబులు**

**అడ్డం:** 1.అందానికి 3.పిలిచిన 5. పల్ల 6.నిగ7. ప్రతి 8.మన 11.ఇది 12.పందిరి 15.మెడ 16.దేవా 17.నీ 20.కొమ్మ 21.చిలకా 22.గువ్వా

**నిలువు:** 1. అందానివో 2.నిను 3.పిల్ల 4.నక్కిన 5.పతి 8.మల్లె 9.ఇదిగో 10.నీది 12.పండు 13.పొడగంటి 14.నాదేశం 18.అమ్మ 19.కల

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

ఏ.బి.వి.ఎన్.రమేష్-వేలూరు(తమిళనాడు), మేడా పద్మావతి- విశాఖపట్నం, నండూరి రామానుజాచార్యులు- విజయవాడ, జి పద్మనాభం- విజయవాడ, యం.రామమోహనాచార్యులు- చాట్రాయి(కృష్ణా), ఏటి శ్రీనివాసన్-అనంతపురం, బి ఉమాదేవి- ఆదోని, ఉప్పులూరి సుబ్బారావు-మొగలికుదురు (తూ.గో.జిల్లా), కె కమల- హైదరాబాద్, కె.వి దుర్గామోహనరావు -నల్గొండ, ఆలవారుశెట్టి రాధాకృష్ణ- నెల్లూరు, సిహెచ్ గౌరీపతిరావు- జోగిపేట(మెదక్), మండలీక కమలకుమారి- కాకినాడ, నిర్మల కృష్ణ- తిరుపతి, చెన్నమ రాజలక్ష్మి-కర్నూలు, తాడి రంగారావు- రాజమండ్రి, మహేష్-మహ్మదాబాద్(రంగారెడ్డి), జి కీర్తన-విశాఖపట్నం, కే.వి.ఎన్ కుసుమలత- హైదరాబాదు, పి.యస్.యన్ రాజు-అచ్చంపేట(మహబూబ్‌నగర్), యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి (గుంటూరు), పింగళి లలిత- ఒంగోలు, యర్లాపంతుల చందు-శ్రీకాకుళం, అడపా విఘ్నేశ్వరరావు-పర్లాకిమిడి (ఒరిస్సా), పి శిరీష కుమార్-రాజమండ్రి, సిహెచ్ శ్వేత-చీపురుపల్లి(విజయనగరం), పేరాల శ్రీవాణి-వైజాగ్, వి కృప లత- నాగులువీధి, టి శ్రీధర్- విజయనగరం, యస్.వి లక్ష్మి- తెనాలి, జి.వి రమణమూర్తి- హైదరాబాదు, కె.వి.యన్.యస్ భగవాన్-రాజమండ్రి, బి శ్రీనివాస ప్రభాకర్-హైదరాబాదు, పప్పు అప్పారావు-శ్రీరామ్‌నగర్ (విజయనగరం).

### ఒక తప్పుతో వ్రాసిన వారు:

ఎ ఆదినారాయణ- పోతవరం(గుంటూరు), సిహెచ్ విశ్వప్రసాద్-చోడవరం(విశాఖపట్నం), చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి-ఒంగోలు, రమేష్ సొంసాళె-ఎమ్మిగనూరు, యం మాధురి రంగారావు-నల్గొండ, ఉదయభాస్కరరావు & విజయ-రాజమండ్రి, ఆర్ సాయిప్రసాదరావు-హైదరాబాదు, అల్లూరి రామానుజ-విజయవాడ, యం.వి రాఘవమూర్తి-రాజమండ్రి, టి చంచలరావు- హైదరాబాదు, పి.హిమబిందు -మల్కిపురము(తూ.గో.జి), యన్ చిన్నా- కోల్‌కటా(వెస్ట్ బెంగాల్), ఆర్.యస్ సత్యవాణి-సికింద్రాబాదు, ఎన్ దివ్య-హైదరాబాదు, యం నాగేశ్వరరావు-విశాఖపట్నం, ఎన్ శంకరాదిత్య-హైదరాబాదు, టి నిర్మల-నెల్లూరు, కె లక్ష్మీకాంతమ్మ-నెల్లూరు, జె బాబురావు-గుడివాడ(కృష్ణా), గొర్ల సత్యనారాయణ-ప్రతిపాడు(తూ.గో.జి), జి పాండురంగశర్మ-హైదరాబాదు, వడ్లమన్నాటి భార్గవి-విజయవాడ, టి వి హనుమంతురావు- విశాఖపట్నం, బంకూరు శ్రీను-మల్లమ్మపేట(విజయనగరం), సాలా దేవీ రాహుల్-పొట్టిమల్లయపాలెం, జి సాయిలత-విజయవాడ, టి మీనా-సికింద్రాబాదు, బెహరా శేషశాయి-సత్తెనపల్లి(గుంటూరు), పి లక్ష్మి-గూడురు, వి సునీల్ రెడ్డి- మంగంపేట(కడప), మేడా మస్తాన్ రెడ్డి-విశాఖపట్నం, సపారె ఈరణ్ణ-ఆదోని, పర్చా వాసుదేవరరావు-దేవరకొండ(నల్గొండ), ఐ లిఖిత-హైదరాబాదు, జి.యస్.పి గీతావాణి-తక్కెళ్ళపాడు(కృష్ణా), ఎం పురుషోత్తమాచార్యా -నల్గొండ, టి మురళికృష్ణ-హైదరాబాదు, యం ప్రవీన్‌కుమారు- విజయనగరం, మోకా రామారావు-ముంబాయి, పి వేణుగోపాల్ రావు-అచ్చంపేట(మహబూబ్‌నగర్), కె జ్ఞాన ప్రసన్న-చిత్తూరు, హర్షకాన్త్ సాహు-పలాస(శ్రీకాకుళం), అద్దంకి సీతాదేవి-హైదరాబాదు, పక్కి చక్రవర్తి-గరివిడి(విజయనగరం), పక్కి సుందరీ కృష్ణ- గరివిడి (విజయనగరం), పి రాజరాజేశ్వరి-విజయనగరం, తిరుమల ప్రసాద్-హైదరాబాదు, సామంచి రాధా-విజయవాడ, యం సత్యవాణి-పాతపట్నం(శ్రీకాకుళం), యు ఆదిత్యామణిధర్- భీమవరపుకోట (తూ.గో.జిల్లా), బి రవికుమార్- రాజమండ్రి, చెరుకువల్లి రామచంద్రమూర్తి-కాకినాడ, యం అంజిరెడ్డి-ఒంగోలు, పసుపులేటి ఝాన్సీలక్ష్మి-మొగలికుదురు(తూ॥గో॥జిల్లా), పక్కి మధు-విజయనగరం.

### రెండు తప్పులతో వ్రాసిన వారు:

కేతవరపు చంద్రహర్ష-సత్తెనపల్లి(గుంటూరు), పి బాలామణి-సింగుపురం (శ్రీకాకుళం), వి శైలజ-హైదరాబాద్, వి దివ్య-ఆత్రేయపురం(తూ.గో.జిల్లా) నారోజు శంకరాచార్యులు-హైదరాబాదు, అత్మూరి వెంకటసూర్యనారాయణ శాస్త్రి-హైదరాబాదు, కె శేషశయన-ప్రొద్దుటూరు, మద్దాలి సువర్చలా శ్రీనివాస్-హైదరాబాదు, అయ్యగారి రాజశేఖర్- రాజోలు(తూ.గో.జిల్లా), బేరా సతీష్ కుమార్-నర్సీపట్నం(విశాఖపట్నం), జి.కె సుందరం- తిరుపతి, అవధాన లక్ష్మీమోహన్-తిరుపతి , విస్సా వెంకటసత్యవరప్రసాదరావు-పినపళ్ళ (తూ.గో.జిల్లా), కె.వి సరస్వతి-హైదరాబాదు, యన్ శ్రీవాణి-విజయవాడ, యస్ హసాన్‌భాషా-గాలివీడు(కడప), కె చైతన్య కుమార్- నిజామాబాదు, యన్ చైతన్య కుమార్‌రెడ్డి -కడప, డా॥ఉప్పల వెంకటరమణమూర్తి- కడప, వేంద్ర స్వాతి తేజస్వి-హైదరాబాదు, పి.వి పవన్‌కుమార్-హైదరాబాదు, ముటుకూరు వసుంధర-హైదరాబాదు, పాలేపాక గణేష్- అరూర్(నల్గొండ), ఎ మంజూష-హైదరాబాదు, ఆరాధ్యల స్వాతి, అప్పు,చిన్ను-విజయవాడ, జి ఆశాజ్యోతి- వినుకొండ, శివనాద్రి నీలిమ-హైదరాబాదు, యం వేణుగోపాల్-నాగ్‌పూర్(మహారాష్ట్ర), ఎం.వి.యస్ లక్ష్మి-కాకినాడ, సిహెచ్ పరాత్పర రావు-ఏలూరు(ప.గో.జిల్లా) బి రఘుబాబు-లక్ష్మీనగర్(మెదక్), పుణ్యాల శ్రీలక్ష్మి-సత్తెనపల్లి, మన్నవ మాధవి-సత్తెనపల్లి, శ్రీనివాసపవార్-ఆర్మూర్(నిజమాబాద్), పి పాపారావు-విశాఖపట్నం, కర్రి ఝాన్సీ-హైదరాబాదు, ఉప్పాల మోహనబాబు-అవనిగడ్డ(కృష్ణా), పుణ్యాల రాజ్యలక్ష్మి -సత్తెనపల్లి, వేలమూరి పద్మలత-విశాఖపట్నం, సి విజయసారథి-కర్నూలు, కొంపెల్ల వెంకట రత్నలక్ష్మి-విశాఖపట్నం, సిహెచ్ సురేష్‌కుమార్-కొత్తవలస(విజయనగరం), ఎ మంగప్రణవి-హైదరాబాదు, వి.యస్ రాగచంద్రిక-నారాపల్లి (రంగారెడ్డి), ఆర్.వి.వి క్రిష్ణ-హైదరాబాదు, వాస్తు సతీష్‌చంద్ర-నెల్లూరు, కె శంకర నారాయణ-హైదరాబాదు, ముగ్గుళ్ళ రాజ్‌కుమార్- హైదరాబాదు, కె సందీప్- కొత్వాల్(అదిలాబాదు), కె క్రిష్ణ-హైదరాబాదు, యన్ శారద-వైజాగ్.

### మూడు తప్పులతో వ్రాసిన వారు:

నేమానసుభాష్ చంద్రబోస్-శ్రీకాకుళం, కర్రి సీతారామగిరి-కాకినాడ, యం శ్రీదేవి-వైజాగ్, వేముల శేఖర్-నిజామాబాదు, టి వింధ్యారాణి-నల్గొండ, పార్నంది వెంకటసూర్యసుబ్రహ్మణ్యమూర్తి-విశాఖపట్నం, కె.యన్ జ్యోతి-రాజమండ్రి, వేముల నవ్యశ్రీ- ఈల్లెందు(ఖమ్మం) ఆర్ పరుశురాము-మంచిర్యాల (అదిలాబాదు), గౌరి పాలకోడేటి-హైదరాబాదు, వేదగిరి శారద-కోరాపుట్(ఒరిస్సా),గొగ్గుర రాజు-ముంబాయి, శ్రీరామ కవచం నరసింహమూర్తి-ఒంగోలు, మేడిపలి మౌనిక- జగిత్యాల (కరీంనగర్), యస్ మహమ్మద్ రఫీ- కాశీబుగ్గ(శ్రీకాకుళం), ఎన్ జగన్మోహనరావు-కరీంనగర్.

